జాతీయగ్రంథమాల : ౫.

# ఆధునిక రాజ్యాంగసంస్థలు.

(రెండవభాగము.)

*　　*　　*　　*

రచయిత:

శ్రీఆచార్య గోగినేని రంగనాయకులుగారు,
B. Litt (Oxon).

*　　*　　*　　*

సంపాదకులు:

బాలాంత్రపు సత్యనారాయణరావు,
పైడిమఱ్ఱి సత్యనారాయణమూర్తి.

వెల]　　[రు 1.

*
* *

# భారతీనికేతనము.
## కాకినాడ.

* *
*

కాకినాడముద్రాక్షరశాలా,
కాకినాడ.

# పోషకులు

---

శ్రీయుత దేశోద్ధారక

కాశీనాథుని నాగేశ్వరరావుపంతులుగారు,

మద్రాసు

# శాశ్వతచందాదారులు.

---

1 శ్రీయుత మల్లిపూడి పళ్ళంరాజుగారు, కాకినాడ.
2 ,, బిక్కిన వెంకటరత్నంగారు, చోడవరం.
3 ,, కళా వెంకట్రావుగారు, ముక్కామల.
4 ,, నరసింహాదేవర సత్యనారాయణగారు, ఆలమూరు.
5 ,, పసల సోమయ్యగారు, తాడేపల్లిగూడెం.
6 ,, యర్రమిల్లి నారాయణమూర్తిగారు, నర్సాపురం.
7 ,, భూపతిరాజు సుబ్బరాజుగారు, వేండ్ర ప॥గో॥
8 ,, కలిదిండి గంగరాజుగారు, తాడేపల్లిగూడెం.
9 ,, తెన్నేటి విశ్వనాథంగారు, విశాఖపట్నం.
10 ,, సమయమంత్రి అచ్చన్నపంతులుగారు, కాకినాడ.
11 ,, చేలిరెడ్డి నరసారెడ్డిగారు, వావిలేటిపాడు. నె॥జి॥

---



దేశభక్త

కొండా వెంకటప్పయ్యగారు

# అంకితము

## "దేశభక్తునకు."

అదుగో !

ఆంధ్రులు నవీనభారతదేశ జీవనమందు గణనీయులు!

భారతదేశ స్వాతంత్ర్య సమరమున ఆంధ్ర స్త్రీలు, పురుషులు, బాలబాలికలు తమసేవా హారతులతో, కలకలలాడుచున్నారు.

తమమట్టిని కనకముగా, తమనీటిని అమృతముగా మార్చుచున్నారు.

సంఘసేవ, దేశసేవ మానవసేవ ఆంధ్రులకు ప్రాణసమానమగుచున్నది.

వీరికి ఆదిగురువును, మార్గదర్శకుడును, ఆదర్శప్రాయుడును అగు "దేశభక్తుడు" ప్రాతఃస్మరణీయుడు.

"వీరగంధము తెచ్చినారము, వీరుడెవ్వడో తెల్పుడీ" అను ఆంధ్రబాలికలకు ఈయనవంటి మహనీయుడే ఆదరపాత్రుడు.

రెండుపుష్కరములక్రితమే ప్రజాసేవ కాంక్షించి, దేశసేవయే వృత్తిగాగొని, సర్వశక్తుల నాంధ్రులకై వెచ్చించి తన "మాయ"చే సృష్టింపబడిన ఆంధ్రోద్యమమును, భారత స్వాతంత్ర్యోద్యమమందు లీనమొనర్చి, తనను, తనప్రజలను, తనదేశమును ధన్యతనొందించిన శ్రీ కొండా వెంకటప్పయ్య గారికిదే కృతజ్ఞతాపూర్వక వందనములు.

కృష్ణజయంతి,
25-8-3౭.

రంగనాయకులు.

# విజ్ఞప్తి.

ఈ రెండవభాగములో మొదటి ప్రకరణమగు తొమ్మిదవ యధ్యాయమున మంత్రివర్గము ఆయాదేశములయందు ఏరీతిగా పనిచేయుచున్నదో తెలుపబడి, ఆంగ్లదేశమందున్న పద్ధతియే శ్రేష్ఠమైనదిగా సూచింపబడినది. ఇయ్యది శాసనసభకు బాధ్యతకలిగి, శాసనసభయొక్క బలముపై సంపూర్ణ స్వతంత్రతతో పనిచేయుచున్నది. (Walpole) వాల్పోలు మంత్రి కాలమునుండియు ముఖ్యమంత్రియొక్క అధికారము క్రమక్రమాభివృద్ధి నొందుట దీనిలో వివరింపబడెను. పదియవ ప్రకరణములో ప్రభుత్వోద్యోగులను గురించి వివరింపబడెను. పోటీపరీక్షలో ఉత్తమస్థానముల నలంకరించిన వారిని ఉద్యోగములకు తీసుకొనుట, పార్టీలో చేరినవారికి యుద్యోగములిచ్చుట: యను రెండు పద్ధతులు చర్చింపబడెను. కాని తిరిగి మరియొక పార్టీ యధికారములోనికి రాగానే మొదటి పార్టీయుద్యోగులను పదభ్రష్టులను జేసి, వారియనుచరులను యుద్యోగములందుంచుట తటస్థించుచునుగనుక ఈపద్ధతిమంచిది కాదని నిరూపింపబడెను.

పదునొకండవ ప్రకరణములో రాజ్యాధిపతిని వర్ణించుచు ప్రెసిడెంటుకు, నిరంకుశాధిపతికి, ఇంగ్లాండుదేశపు చక్ర

వర్తికిగల హక్కులును, వారుచేయవలసిన పనులును వివరింపబడెను. ఫ్రాన్సు మున్నగు దేశములలో అధ్యక్షునకొకానొకప్పుడు క్లిష్టపరిస్థితులలో మాత్రము విశేషమైన పెత్తనము చెలాయించుటకు హక్కుండును. కాని అమెరికాదేశపు ప్రెసిడెంటునకు అనేకమైన యధికారములు గలవు.

పండ్రెండవ ప్రకరణము పార్టీలను, బృందములనుగురించి తెలుపుచున్నది. ప్రజాస్వామిక రాజ్యము రెండుగాని, మూడుగాని రాజకీయపార్టీలపైని యాధారపడి యున్నది. ఫ్రాన్సు మున్నగు దేశములలో పార్టీలు మెండుగా పెరిగి ఏమంత్రికిని తగిన బలములేక కొద్దినెలలకే పదభ్రష్టత నొందవలసివచ్చుచున్నది. ఇటలీ, జర్మనీ, మున్నగు దేశములలో ఫాసిష్టుపార్టీ నాజీపార్టీయున్నూ ప్రబలమై దేశస్వాతంత్ర్యమును రూపుమాపినవి.

పదమూడవ యధ్యాయము చాల ముఖ్యమైనది. రషియా దేశములో జరుగుచున్న కమ్యూనిష్టు రాజ్యాంగమును వివరముగా తెలుపుచు అందలిగుణవిశేషములను వర్ణించి (Five year plan) ఆర్థికనిర్మాణకార్య విధానమువల్ల రషియాకులభించిన మహోపకారములు తెలుపబడెను. ముస్సోలినీగారి పరిపాలన నిరంకుశపాలనమువంటిది. దాని యందుకూడా కొన్నివిశేషములు లేకపోలేదు. ఇటలీయొక్క ప్రాముఖ్యత ముస్సోలినీగారి సంపూర్ణాధికారమువల్లనే

సిద్ధించినదిగాని లేనియెడల నాదేశమీపాటికి అధోగతిపాలై యుండియుండెడిది.

పదునాల్గవ ప్రకరణములో స్థానిక సంఘములు వాటి యధికారములు, వాటిబాధ్యతలు మొదలైనవి వర్ణింపబడెను. మనదేశములోని జిల్లాబోర్డులు, మ్యునిసిపాలిటీలు వాటి లోపాలోపములును విమర్శింపబడినవి.

పదిహేనవ యధ్యాయము న్యాయస్థానములను గురించి చెప్పుచున్నది సుప్రీముకోర్టునకు అమెరికాలో అత్యధికమైన స్థానమియ్యబడినది. కాని ఇంగ్లాండునందు లాకోర్టులకు రాజ్యాంగనిబంధనలకు చట్టములను న్యాయవిరుద్ధములని తీసివేయుటకు హక్కులేదు. మనదేశములో అమెరికాసుప్రీముకోర్టువంటి న్యాయస్థానము మిక్కిలి యవసరమైనది. పదునారవ ప్రకరణములో (Trade Unions) కార్మికుల సంఘములు వాటిప్రాముఖ్యము వర్ణింపబడినది. యంత్రసాధనముల వలన గలుగు నష్టములను ప్రతిదేశములోను తొలగించుటకు ఏయేప్రయత్నములు జరుగుచున్నవో వర్ణింపబడినవి. పరపతి సంఘములు (Co-operative Societies) వృత్తి సంఘములు (Craft Gilds) మొదలైనవాటియొక్క విశేషములు తెలుపబడినవి. చివరప్రకరణము అన్నిటికంటె చదువరుల నాకర్షించు విషయమును కలిగియున్నది. (League of Nations) నానాజాతిసమితి యుద్ధానంతరమందు స్థాపింపబడి నానాటికి

వృద్ధిబొంది ప్రస్తుతము అనగా 1933—34 లో క్షీణించుచున్నది. గాని యీసంఘమునకు అత్యుత్కృష్టమైన ప్రాముఖ్యమును ప్రపంచములోని దేశములన్నియు ఇచ్చియుండిన యెడల ఆధునికకాలమందీ దారిద్ర్యదశ లేకపోయుండెడిది. కాని వివిధదేశములయొక్క స్వల్పబుద్ధిచేతను స్వార్థపరతచేతను దీనిబలము తగ్గుచున్నది. కావున విశాలదృష్టికలిగి విశ్వమానవసోదరభావముతో ప్రపంచశాంతి కాంక్షించి యీ సమితిని బలపరచవలసిన యావశ్యకత [illegible] వెల్లడింప బడెను.

ఇంతటితో "ఆధునిక సామ్రాజ్య సంస్థలు" అను సీరీసు రెండవభాగము సమాప్తము. ఇట్టి [illegible] [illegible] ఆంధ్రభాషలో రచించి మాకు [illegible] కొసంగిన శ్రీరంగాచారిగారికి కృతజ్ఞతాపూర్వక నమస్కారము లర్పించుచున్నాము. ఇట్టి గ్రంథముల ప్రాశస్త్యమును గుర్తించి మనదేశీయులెల్లరును తగుప్రోత్సాహమును జూపెదురు గాకయని కోరుచున్నాము.

సంపాదకులు.

---

# విషయసూచిక.



తొమ్మిదవ ప్రకరణము.


పేజి

(మంత్రివర్గము) ... 1


పదియవ ప్రకరణము.


(ప్రభుత్వోద్యోగులు)

సివిలు సర్వీసులు వగైరాలు ... 43


పదునొకండవ ప్రకరణము.


(రాజ్యాంగాధ్యక్షుడు) ... 77


పన్రెండవ ప్రకరణము.


(రాచకీయపార్టీలు) ... 94


పదమూడవ ప్రకరణము.


(రషియా, టర్కీ, ఇటలీ రాజ్యాంగ

విధానములు) 113

టర్కీ ... 114

| | | పేజి |
|---|---|---|
| ఇటలీ | ... | 118 |
| రషియా కమ్యూనిష్టు రాజ్యాంగము | | 122 |
| గ్రామసిండికేటు | ... | 126 |
| జిల్లా సోవియటులు | ... | 128 |
| రాష్ట్రీయ సోవియటులు | ... | 128 |
| దేశీయ సోవియటులు | ... | 129 |
| రషియా రాజ్యసమ్మేళన సోవియటు | | |
| కాంగ్రెసు. | ... | 130 |
| కమీషనరు కౌన్సిలు | ... | 131 |
| కార్మికుల పరిపాలక మహాసంఘము | | 132 |
| స్థాయి సంఘము | ... | 133 |

పదునాల్గవ ప్రకరణము.

| | | |
|---|---|---|
| (స్థానిక స్వపరిపాలన) | ... | 148 |
| ఉద్యోగులు. | | |
| అమెరికా | ... | 154 |
| భారతదేశము | ... | 155 |
| యూరపుఖండము | ... | 158 |
| ఇంగ్లాండు | ... | 159 |
| అధ్యక్షులు | ... | 161 |

| | | పేజి |
|---|---|---|
| (రాచకీయపార్టీలు) | ... | 163 |
| ఈసంస్థల ధర్మములు | ... | 165 |

పదునైదవ ప్రకరణము.

| | | |
|---|---|---|
| (న్యాయస్థానములు, న్యాయమూర్తులు) | | 170 |

పదునాఱవ ప్రకరణము.

| | | |
|---|---|---|
| (ఆర్థికజీవితము, రాజ్యాంగము) | ... | 201 |

పదునేడవ ప్రకరణము.

| | | |
|---|---|---|
| (నానాజాతి సమస్యలు) | | |
| సమితి, కార్మికసంఘము, వ్యవసాయ సంఘము, న్యాయస్థానములు | ... | 256 |
| అసెంబ్లీ | ... | 257 |
| యుద్ధమేకూడదు | ... | 279 |
| మైనారిటీల రక్షణ | ... | 270 |
| అనాగరికపు జాతులరక్షణ | ... | 272 |
| నానాజాతిన్యాయస్థానము | ... | 279 |

---

# ఆధునిక రాజ్యాంగ సంస్థలు.

## తొమ్మిదవ ప్రకరణము.

ఏ రాజ్యమందైనను ప్రభుత్వమును నడపుటకు బాధ్యులగువారు ఇదమిద్ధమని స్థిరపడి యుండవలెను. నిరంకుశ రాజ్యములందు డిక్టేటరును, బాధ్యతాయుత రాజ్యాంగములందు (అమెరికాయందు తప్ప) మంత్రివర్గములును, అమెరికాయందు ప్రెసిడెంటును ప్రభుత్వకార్యభారమును వహించియున్నారు రషియాయందు కార్మికులకు బాధ్యతజెందిన సమ్మేళనరాజ్యాంగపు కేంద్రసంఘమువారును, ఇటలీయందు డిక్టేటరగు శ్రీ ముస్సొలీనీగారి యాధిపత్యముక్రింద ఫాసిస్టుపార్టీవారి కేంద్రసంఘమును రాచకీయమంత్రాంగమును నెరపుచున్నవి. పోలాండు, ఆస్ట్రియా, దక్షిణ అమెరికా రాజ్యములందు, "డిక్టేటరులు" రాజ్యము జేయుచున్నారు. టర్కీయందు ప్రజల యామోదముపైననే నిరంకుశుడగు శ్రీ ముస్తాఫా కెమాల్ పాషాగారు రిపబ్లికుప్రెసిడెంటుగాను, మంత్రాంగసభాధ్యక్షుడుగాను నున్నారు. పర్షియాయందు శ్రీ రిచ్యాపాషాగారును, ఆఫ్ఘనిస్థానమందు నాదిర్షాగారును, మొత్తముమీద నిరంకుశులై రాజ్యముజేయుచున్నారు జూగోస్లావియాయందు నామమాత్రపు పార్లమెం

మంత్రివర్గము.

టుపాయముతో శ్రీ అలెగ్జాండరు రాజుగారు నిరంకుశులై యు న్నాడు. నల్లజాతులకు జెందిన దేశములలో ఒక్క లైబీరియా రిపబ్లికునందు తప్ప, మిగతా ప్రాంతముల తెల్లజాతులవారు నిరంకుశులై రాజ్యపాలన మొనర్చుచున్నారు. ఇంక మిగిలిన దేశములందు(జపాను, చైనా—నామకార్థమా—సయాము, ఆస్ట్రేలియా, న్యూజీలాండు, అమెరికా, కెనడా, దక్షిణాఫ్రికా ఫ్రాన్సు, జర్మనీ, చెకోస్లావాకియా, హాలాండు, డెన్మార్కు, బెల్జియము, ఇంగ్లండు, నార్వే, స్వీడను, స్విట్జర్లండు, స్పెయి ను, పోర్చుగలు దేశములందు) బాధ్యతాయుత ప్రభుత్వము లే కలవు. ఈ ప్రభుత్వములందైనను రెండురకములు కలవు. ప్రజాప్రతినిధి సభవారికి బాధ్యతవహించు మంత్రివర్గముల గల్గిన ప్రభుత్వము ఒక్క అమెరికాయందు తప్ప మిగతా దేశ ములందు ఆచరణయందున్నది. కనుక మంత్రివర్గప్రభుత్వ మన్నచో ఇటుల బాధ్యతాయుత ప్రభుత్వముల కల్గినవానిలో అమెరికాతప్ప తదితరదేశములయొక్క మంత్రివర్గమని భావిం చవలయును. కనుక ఇప్పటికమలునందున్న ప్రభుత్వములను రెండు తరగతులుగా భాగించవచ్చును. ఒకటి నిరంకుశ ప్రభు త్వము. రెండు బాధ్యతాయుతప్రభుత్వము. రెండవతరగతి లోను, రెండు ప్రత్యేకాంగములు కలవు. ఒకటి ప్రజాప్రతి నిధిసభవారికి బాధ్యతవహించు మంత్రివర్గము. రెండు ప్రజల కే సరాసరిబాధ్యత వహించు ప్రెసిడెంటుస్థానము.

ఈ రెండు ముఖ్యాతరగతులలో నెయ్యది ప్రజాక్షేమా భివృద్ధికారకమో విచారించుట అగత్యము. నిరంకుశప్రభుత్వమునకు ప్రతిదేశము తనచరిత్రము నెప్పుడో యొకప్పుడు లోబడి యుండెను. ఆకాలములందు అట్టి ప్రభుత్వములవలన కల్గిన మేలుకంటె నష్టములే హెచ్చుగనుండెను. నిరంకుశ ప్రభుత్వమునకు ప్రజల నత్యంతముగా హింసించుటకు వీలు కలదు. అట్టి అవకాశమును ప్రతి నిరంకుశప్రభుత్వమును (అశోకుని ప్రభుత్వము తప్ప) పూర్తిగా నుపయోగించుకొని యుండెను. అరుదుగా ఒక సత్ప్రవర్తకుడు ప్రజాహితాభిలాషియగు నిరంకుశప్రభువు శతాబ్దముల తరబడి వచ్చుచున్న చరిత్ర కథనమందు కానబడినను మొత్తముమీద అట్టి ప్రభువులు సంకుచితాభిప్రాయులై విషయలోలురై అసందర్భ కార్యకలాపములందు దిగి స్వాభిమానమున యుద్ధముల ననవసరముగా, అతిత్వరితముగా, అనేకముగా, కల్గించుచు తమమాట కెదురగువారిని తమచేష్టలజూచి కినియువారిని మంచిచెడ్డ లాలోచింపక హింసించుచుండిరని తెలియనగును. అట్టి ప్రభుత్వములక్రింద ప్రజల ధన, మాన, ప్రాణములకు రక్షణ కలుగజాలదు. శ్రీ అలెగ్జాండరు, అక్బరు, కృష్ణదేవ రాయలు ఆదిగాగల చక్రవర్తులు తమకయిష్టులగు ప్రజల నిలువున చంపించియుండుట లోకవిదితము. శ్రీ ప్రథమ చార్లెసు ఇంగ్లండునందును, నెపోలియను ఫ్రాన్సున ... ఆ

హేస్టింగ్సు ఇండియాయందును, ప్రజల ధనమును అశాస్త్రీయముగ నపహరించిరి. అటులనే ప్రభువులనేకులు వివిధ దేశములందు ప్రజలఆస్తిపాస్తుల దిగమ్రింగి యుండిరి. ప్రజాస్వాతంత్ర్యాభివృద్ధి నిరంకుశప్రభువుల కెప్పుడును నచ్చదు. రష్యాలో చక్రవర్తులు ఇంగ్లాండులోని అష్టమహెన్రీ, ప్రథమజేమ్సు, ఫ్రాన్సులోని బూర్బను వంశీకులగు ప్రభువులు జర్మనీయాలోని హాహెన్‌జోలన్ వంశీకులు మతసాంఘిక రాజకీయస్వాతంత్ర్యముల గోరుచుండిన సాంఘికసేవకుల నెందరి ప్రాణములనో నిలువున తీసియుండిరి. ప్రజాసామాన్యపు పురోభివృద్ధికై పాటుపడుట తమధర్మమని పందొమ్మిదవ శతాబ్దపు నిరంకుశప్రభులు అంగీకరించరాయెను. తుదకీ యుగపు నిరంకుశ ప్రభుత్వముల జూచినను వానివలన కల్గు ప్రయోజనములకన్నను కష్టములే హెచ్చని తోచుచున్నది. ఇట్టి ప్రభుత్వములు కల్గిన అన్నిదేశములందును మత, సాంఘిక, రాచకీయ స్వాతంత్ర్యము ప్రజలకు దక్కుటలేదు. పైగా అట్టి స్వాతంత్ర్యమును ప్రసాదించుట తమధర్మమనియైన యీ ప్రభుత్వము లంగీకరించుటలేదు. యుగముల తరబడి ఎన్నో విప్లవములద్వారా, ఎందరో మహనీయుల ప్రాణత్యాగమువలన, ఎంతో మానుషేయధర్మతపః ఫలముగా ఈనాటికి మత సాంఘిక, రాచకీయ స్వాతంత్ర్యములు ప్రతిమానవునకు జన్మ స్వత్వములనియు వాని యభివృద్ధికయ్యేవి మూలాధారములను

సూత్రములను మానవులెల్ల రంగీకరింప కల్గుచున్నారు. కష్టార్జితమగు నీ హక్కులను తిరస్కరించు నిరంకుశ ప్రభుత్వములు ఎన్నిసౌకర్యములు ప్రజలయొక్క భౌతికజీవితమునందు కల్గింప యత్నించుచున్నను, తమ జన్మలను సార్థక మొందించుకొనజాలవు స్వతంత్రముగా తోడివారితో కలుసుకొని మంచిచెడ్డల ముచ్చటించుకొని అవసరమగు సుకార్యముల సాధింప సంఘములనేర్పరచుకొని, రాజ్యాంగ వ్యవహారముల చర్చించుటకు సభలజరిపి, వార్తల గ్రహించుటకు వార్తాపత్రికల ప్రకటించి, జ్ఞానబోధ చేయుటకై గ్రంథముల కరపత్రముల ప్రకటించి, న్యాయమార్గమునకు ప్రజల దెచ్చుటకై ప్రచార మొనర్చి, తమ కిష్టమగు మతాచారముల నవలంబించి తమకు నచ్చిన ఆటలపాటల నాడి, మన్నన మర్యాదల సాగించి, సరస సల్లాపములందు తేలి యాడుటకు హక్కులే నంతకాలము ప్రజలు పశుప్రాయులై యుండవలసినదే. భోజనప్రాప్తి కల్గినను, దేహస్వాస్థత యున్నను, మానసపరిశుభ్రత యేర్పడి, ఆధ్యాత్మికాభివృద్ధి కలిగి, మనోవాక్కాయ కర్మలందుసహృదయులై సౌభ్రాత్రత నెరపి అభివృద్ధిమార్గముల ననుసరించి, జ్ఞానజ్యోతిని వెల్గించిన శ్వేశ్వరుని తృప్తిదీర నారాధించవలయుననిన మానవకోటికి ఈ స్వాతంత్ర్యము లత్యవసరము. ఇట్టి స్వాతంత్ర్యము లేని ప్రజలు పశుప్రాయులగుదురు. వారికి స్వేచ్ఛయను అమృతాస్వాదన లేమి కన్నులున్నను

చూడ లేక, చెవులున్న వినజాలక, మనస్సున్నను ఆలోచింప లేక పడుంగడుపీ నావస్థయందుండెదరు. పరమాత్మునికి ప్రీతి కల్గించునట్లు ప్రజల దినదినపరివర్ధమానుల జేయుధర్మము తలపై పెట్టుకొనిన ప్రభుత్వము వారిని బానిసలుగా జేయుటచే స్వధర్మపతన మొనర్చుకొనును.

జుగోస్లావియా రాజును, మనస్వదేశసంస్థానపు ప్రభువులును, తమ రాజ్యములందు శాసనసభలున్నవని వాదించవచ్చును కాని, వాక్స్వాతంత్ర్యము, సభాస్వాతంత్ర్యము, పత్రికాస్వాతంత్ర్యము, సంఘస్వాతంత్ర్యము, రాజకీయస్వాతంత్ర్యములను పంచస్వాతంత్ర్యములు వారిప్రజలకు లేనంతవరకు శాసనసభలు మాత్ర మేమి చేయగలవు? జుగోస్లావియాయందలి శాసనసభ్యులకు తమకు భావ్యమని తోచిన యుపన్యాసముల సభయందొనర్చుటకు హక్కు లేదు. శాసనసభయందలి ప్రతిపక్షనాయకుల ననేకుల పోలీసులు చంపించిరి. శాసనసభోపన్యాసముల ప్రకటించుటకు హక్కు లేదు. శాసనసభయందు ప్రభుత్వమును విమర్శించుచు నుపన్యసించినందులకు సభ్యులు నిర్బంధింపబడిరి. పెత్తనమందున్న సర్బియను జాతికిని, ఆరాజ్యమందున్న క్రోటుజాతికిని మధ్య సామరస్యత యేర్పడుట మేలని వ్రాసినందుల కొకప్రొఫెసరును నిర్బంధించిరి. ఇటులనే, హైదరాబాదు రాజ్యమందు ప్రభుత్వముచే ప్రకటితమగు "గజెట్టు" తప్ప మరేయితర

రాచకీయవార్తాపత్రికయు ప్రచురించుటకు వీలులేకున్నది. పాటియాలా రాజ్యమందెట్లు, ప్రజలధనమునకును, ప్రాణములకును, తుదకు స్త్రీల ఆత్మగౌరవమునకును, భంగముకలిగెనో మనకు తెలిసియే యున్నది. పదభ్రష్టుడైన ఇందూరు మహారాజెట్టి యకార్యములఁ జేయుచుండెనో అందరికిని తెలియును. స్వదేశసంస్థానపు ప్రజలు, తమతమ రాజ్యములందె తమరాచకీయసభల సమావేశపఱచుకొన జాలకున్నారు, తుదకు హిందూమతస్థులే ఆల్వారు, భోపాలు, హైదరాబాదు రాజ్యములందు, తమమత సంఘసమావేశముల జేయలేకుండిరి. ఇక రషియా, టర్కీ, ఇటలీ, దక్షిణఅమెరికా రాష్ట్రములందలి ప్రజలదుర్గతిని గూర్చి వేరుగా జెప్ప పనిలేదు గదా !

నిరంకుశపాలనము ప్రజాసమ్మతమగుచో, ప్రజానురంజకముగా నుండుననియు, ప్రజాభ్యుదయమును కల్గించుననియు తలంచుట వెఱ్ఱి. ప్రజలమోక్షమే కోరు రాజ్యాంగము నిరంకుశముగ నుండు టెందులకు ? ప్రజాసమ్మతమగుచో, ఆప్రభుత్వము నిరంకుశముగ నెట్లుండును ? రషియాయందువలె, కార్మికులే నిరంకుశాధికారము వహించుచో, ఇటలీలోవలె, ధనాధికారులు సంపూర్ణాధికారము బొందుచో, మిగతా ప్రజలకట్టి ప్రభుత్వనిర్వహణమందు పాలులేనిచో, అట్టి ప్రభుత్వము ప్రజలెల్లరి కెట్లు సమ్మతమగును ? అట్టిరాజ్యాం

గము ప్రజలెల్లరి యనుభవము, ఆలోచన, సహకారము బొందని
విధి, సంపూర్ణతబొందు టెట్లు? సర్వజనామోదముకాని ప్ర
భుత్వము ప్రజామోక్షదాయక మెట్లగును?

సర్వస్వాతంత్ర్యముగ నడుపబడు యెన్నికలద్వారా యే
పెత్తనమునకు వచ్చు ప్రభుత్వము, సంపూర్ణనిరంకుశాధి
కారము బొందుచో రాచకార్యములు హెచ్చుత్వరితముగా,
ధైర్యముతో, సంతృప్తికరముగా నిర్వహింపబడునని కొందరు
వాదింతురు. కాని, ప్రజలు, అనేక కారణములవలన అట్టి
ఎన్నికలందు దుర్బుద్ధులకులోనై పొరపాటొనర్చి కూడనివా
రికి పెత్తనముగట్టవచ్చును. అప్పుడట్టి అయోగ్యులగు పెత్తం
దారులవలన కల్గు సత్వరప్రభుత్వపు చర్యలు ప్రజాకంటకము
లగునుగదా? ఒకవేళ ప్రజలు, జాగరూకతతో ప్రజాక్షేమా
భిలాషులనే పెత్తందారులుగా నేర్పరచినను, శాశ్వతముగా
నిరంకుశాధికారము పొందువారు త్వరలోనె, తమకాధార
భూతమైన ప్రజలను, తమచే రక్షింపబడదగు ప్రజలను, తమ
కార్యముల సఫలురుగా ఫలితముబొందవలసినప్రజలను మఱచి
పోయి, స్వలాభపరులై, స్వాభిమానులై స్వయంకృతాపరాధ
ము జేయుచుండుట చరిత్రప్రసిద్ధమేకదా! ప్రజాస్వామిక
రాజ్యాంగమందు, బాధ్యతాయుతమంత్రివర్గముల నేర్పరచు
చో, వానిద్వారా స్థానస్థిరత కల్గి తగినంతత్వరితముగానే ప్రజా
వసరములదీర్చుట యసాధ్యము కాదని అనుభవైక వేద్యము.

కనుక నిరంకుశప్రభుత్వము ప్రజల పశువులగాజేయును. ప్రజలనుమించిన పెత్తనము తుదకు ప్రజల పీడించును. బాధ్యతనొందని రాజ్యము, అరాచకమును పెంపొందించును. ఈవిషయమును గమనించియే, నిలకడకల్గిన కార్యనిర్వాహకవర్గము నభిలషించిన అమెరికాదేశపురాజ్యాంగవిధానపు నిర్మాతలు, తమప్రెసిడెంటునకు నాల్గువత్సరములవరకే, తన సంపూర్ణరాజ్యాధికారము నుపయోగించు నర్హతకల్గించిరి. ప్రతినాల్గువత్సరములకు ప్రజలకు, ప్రెసిడెంటు నెన్నుకొను నవకాశము కల్గుచుండును.

నిరంకుశ రాజ్యాంగము చిరస్థాయిగా నుండునని కొందరనుకొందురు. అదియుభ్రమయే! రాజ్యాంగపు వ్యవహారములతో నసంతృప్తిజెందినవారికి తమకిష్టమగు పెత్తందారుల నెన్నుకొనగల్గు నవకాశముండునంతవరకు, తమకయిష్టమగు పెత్తందారులక్రింద యోర్మికల్గి యుండగలరు. అట్టియవకాశముల కల్గించని నిరంకుశ రాజ్యమునందు రాజ్యాధికారుల కార్యక్రమము నిరసించువారెల్లరు, సక్రమరాచకీయాందోళనముద్వారా, సఫలీకృత మనోరథులను య్యెదమును ఆశలేమి, అరాచకులై అక్రమాందోళనపరులై, నిరాయుధులుగా గాని, సాయుధులుగా గాని, రాజ్యాంగ విప్లవముకల్గింప నుత్సుకులై యుండకతప్పదు. కనుక, కుములుచున్న అగ్నిపర్వతముపై ఆసీనుడైయున్న పిచ్చివానిమాడ్కి, ప్రజాభిప్రా

యముల ప్రకటనకు స్వతంత్రత నివ్వజాలని, నిరంకుశాధిపత్యము ప్రజలయందు ప్రజ్వలించు స్వతంత్రతాతాపమువలన ఎప్పుడో దహింపబడుట తప్పదు. కనుక, ఇట్టి నిరంకుశరాజ్యాంగవిధానము అస్థిరము. కనుకనే, ప్రపంచమందంతట ఇట్టివిధానము అచిరకాలముననే అంత మొందుచుండెను.

ప్రజలకుజెంది, ప్రజలపై నాధారపడియుండు ప్రభుత్వములలో అల్పసంఖ్యాకులకొరకై మాత్రము తమశక్తియుక్తుల ధారవోయునవికూడను అచిరములగును; అసంతృప్తికరములగును. కొలదిగనో, గొప్పగనో, ప్రజలెల్లరి మేలుకొరకై ప్రయత్నించు ప్రభుత్వములే స్థిరములగును. అల్పసంఖ్యాకులచే నడుపబడు ప్రభుత్వములును అచిరములే కాక, ప్రజామోదమును బొందజాలక ప్రజాపీడ కల్గించుట తథ్యము. ధనికుల హస్తగతమగు ప్రభుత్వము ప్రజాసామాన్యమునకు న్యాయమొనర్చకల్గునా ? జర్మనీ, ప్రాన్సు, అమెరికా రాజ్యాంగములందు ప్రజాకంటకము లేదనిచెప్పలేము. తుదకు కార్మికులొక్కరికే జెందిన పెత్తనము ప్రజాబాహుళ్యమునకు సంతృప్తికరము గాదు. రషియాలోని బోల్షివిక్కు రాజ్యము రైతులకు మధ్యతరగతివారికి తలకంటగింపుగానున్నది. ప్రజలెల్లరకు సంతృప్తికరముగా నుండవలయునన్నచో, ప్రతిప్రభుత్వము, ప్రజలందరిపేరిట ప్రజలకొరకై ప్రజలకందుబాటులో, ప్రజల యాధిపత్యముక్రింద నడుపబడవలెను. కనుకనే,

క్రమక్రమముగా బాధ్యతాయుత మంత్రివర్గ ప్రభుత్వపద్ధతి హెచ్చుదేశములం దవలంబింపబడుచున్నది.

బాధ్యతాయుత ప్రభుత్వములందు, అమెరికా ప్రభుత్వ మును ప్రత్యేకముగా విచారింపవలయును. ప్రజలందరి పై ఆధారపడియుండు ప్రభుత్వములలో దాదాపు నిరంకుశాధి కారము, నియమిత కాలమువరకు పొందియుండు ప్రభుత్వ మియ్యదియే. అమెరికా ప్రెసిడెంటుగారిని వివిధరాష్ట్రముల లోని ప్రజలు తమ డెలిగేటుల ద్వారా ఎన్నుకొనుచున్నారు. ఆతడు నాల్గు సంవత్సరములవరకు, ఖాయముగా అధికారము ండును. మంత్రివర్గమును, ఆతడే తనకునచ్చినట్లు సృష్టిం చవచ్చును. సెనెటు సభవారి ఆమోదమును మాత్రము మం త్రులనియామకమునకు బొందిన జాలును. ముఖ్యాధికారుల నియమించుటలో మాత్రము సెనెటుసభవారి సహకారము బొందిమిగతా యుద్యోగులను తనంతతానే నియమించు నధికారము ప్రెసిడెంటునకు కలదు. రక్షణాదళముల నిల్పి, పోషించి, ఉపయోగించుటకు ప్రభుత్వకార్యముల నన్నిటి నిర్వహించుటకు సర్వాధికారము ఆయునకు కలదు. శాసన నిర్మాణమందును, శిస్తులవేసి ప్రభుత్వ ఆదాయ వ్యయముల నిర్ణయించుటందును మాత్రము శాసనసభ వారి సహకారమును పొందవలసియుండినను, రాచకార్య నిర్వహణమందు సర్వాధి పత్యము ప్రెసిడెంటునకు కల్గుచున్నది. యుద్ధప్రకటన జేయు టకు, సంధిపత్రము నంగీకరించుటకు, మాత్రము శాసనసభ

వారి యంగీకారము అగత్యమే కాని, యుద్ధమునడపుట ఆయ నపైననే ఆధారపడియున్నది.

తుదకిట్టి నిరంకుశాధికారి కూడ ప్రజల పరీక్షకు లోనై తన యనుదినకార్యక్రమము ప్రజాభీష్టముల ననుస రించియుండునట్లేర్పరచుకొని, తనయధికారమునంతను ప్రజా మోదకరముగా నుండునట్లు ఉపయోగింపవలసివచ్చుచున్నది. ప్రతిప్రెసిడెంటును ఆదేశమందలి రెండుపార్టీలలో ఒకదానికి చెందియుండి, ఆపార్టీయొక్క అభ్యర్థియై ఆపార్టీవారి సహా యము వలననే తన యీగొప్పపదవిని బొందగల్గుచున్నాడు. తనపార్టీయొక్క ప్రతినిధులు రెండుశాసనసభలందును కల రుగనుక ఆశాసనసభల సహాకారము, తనప్రభుత్వపు కార్య నిర్వహణమున కనేకసమయములం దగత్యము కనుక దేశ మందు తనపార్టీయొక్క ప్రాపకము హెచ్చగునట్లును, అం దువలన శాసనసభలందు తనకు సుముఖులగువారి సంఖ్య హెచ్చగునట్లును జాగ్రత్తపడవలసిన యవసరము ప్రెసిడెంటు నకు కలదు. మరియు తన అధికారకాలపరిమితి పూర్తియైన పిమ్మట తిరిగి తానేగాని లేక తనపార్టీయభ్యర్థి కాని తనపద వికి ఎన్నుకొనబడుట తనపార్టీయొక్క ప్రాధాన్యతకు తన పార్టీకి జెంది తనచే నియమింపబడిన వేలకొలది అధికారులు పెత్తనమందుండుటకై యుపయోగించును కనుక అట్టిఫలి తము కల్గించుటకు వలయు ప్రజానురంజకమగు కార్యముల

నొనర్చుచుండుట అవసరమై యున్నది. ఇందువలన ప్రెసిడెంటు ఎల్లప్పుడు తనపార్టీవారి యభిప్రాయముల ననుసరించి ప్రజానాయకుల సలహాల ముదినుంచి సంస్కారుల ప్రచారమును మరువక, ప్రజలయిష్టమును జూరగొనుటకై తన కార్యవిధానమును నడపుచుండవలసియున్నది. ఇందువలన మొత్తముమీద బాధ్యతాయుత మంత్రివర్గపు ప్రభుత్వమువలెనే ప్రెసిడెంటుయొక్క పెత్తనముకూడ (నిరంకుశ లక్ష్యముల బాసి) బాధ్యతాయుతమై ప్రజలయిష్టానుసారమే నడుపబడుచున్నదని చెప్పవచ్చును.

కాని బాధ్యతాయుత మంత్రివర్గము కల్గినదేశములందువలె అమెరికాయందు, శాసననిర్మాణము త్వరితగతి జరుగుటలేదు. ప్రభుత్వోద్యోగనియామకము సంతృప్తికరముగా న్యాయపద్ధతిని జరుగుటలేదు. అనుదినము ప్రజలయెడ కల్గుచుండు అభిప్రాయపరివర్తనము ననుసరించి ప్రభుత్వము సాగుటలేదు. ఎప్పటికప్పుడు మంత్రివర్గపు రాజ్యాంగములందువలెనే శాసనసభవారికి, కార్యనిర్వాహకోద్యోగులకు మధ్య సహకారము సాధ్యమగుచు కార్యనిర్వహణము ప్రజానురంజకముగా జరుగుచుండుట లేదు. మొత్తముమీద అమెరికాదేశపు నాల్గువత్సరముల ప్రెసిడెంటు పెత్తనము మంత్రివర్గపు రాజ్యాంగము కల్గించినంత లాభమును కల్గించలేకున్నది.

కనుకనే తదితరదేశములందెచ్చటను ప్రజాస్వామిక రాజ్యాంగవిధానము నేర్పరచునప్పుడు అమెరికాదేశపు ప్రెసిడెంటుపద్ధతి అవలంబింపబడలేదు. అప్పటినుండి స్థాపించబడిన ప్రజాస్వామిక రాజ్యాంగ విధానములందు బాధ్యతాయుత మంత్రివర్గములే ప్రభుత్వమును నడపుటకై స్థాపించబడుచున్నవి. కాని కొంతకాలమువరకైన మంత్రివర్గములు అమెరికాయందలి ప్రెసిడెంటువలె స్థిరముగా నధికారమునందుట యుక్తమనియు, మంత్రివర్గమును పదభ్రష్టత నొందించుటకు సంపూర్ణాధికారము పూర్తిగా ప్రెసిడెంటు లేక రాజునందుగాని, శాసనసభయందుగాని యుండుట శ్రేయము కాదనియు కొందరు తలంచుచున్నారు. ఇందులకై ఫ్రాన్సు, జర్మనీదేశములందు రాచకీయబృందముల ప్రాపకమువలన, ఎటుల మంత్రివర్గములు సంవత్సరమునకంటె హెచ్చుగా పెత్తనమందుండుట సాధ్యమగుచున్నదో వీరు దృష్టాంతమిచ్చుచున్నారు. కనుకనే మనదేశపు మితవాదనాయకులు (సర్ తేజ్ బహదూరుసప్రూ, శ్రీనివాసశాస్త్రి, జయకరు, జిన్నాగారలు) రౌండుటేబిలునందు తమయుపన్యాసములందు కేంద్రప్రభుత్వము పదభ్రష్టత నొందించుటకై తేబడు "విశ్వాసరాహిత్య తీర్మానము"ను, "కేంద్రప్రజాప్రతినిధిసభవారు"మూడింట రెండువంతుల మంది అంగీకరించవలెనని సూచించిరి. అనేక రాచకీయబృందములు కల్గి అచిరకాలపుమంత్రివర్గ

ముల పెత్తనముబొందియున్న ఫ్రాన్సు, జర్మనీదేశములందిట్టి యపురూపమగు సూచన యింతవర కెవ్వరిచేగాని చేయబడలేదు. మనదేశపు రాజ్యాంగమందు మాత్ర మిట్టిసియమ మేర్పరచుటవలన మితవాదులు ధనికుల యాధిపత్యమును స్థిరపరచుటతప్ప మరియేయితరలాభమును కలుగజాలదు. మంత్రివర్గము నిజముగా బాధ్యతవహించి యుండవలయునన్న శాసనసభవారి ప్రస్తుతపుహక్కు, అనగా "విశ్వాస రాహిత్యతీర్మానము" నంగీకరించు హక్కునకు ఏమాత్రము భంగముకలుగరాదు.

స్విట్జర్లాండునందు, స్థిరమగు అధికారకాలపరిమితికల్గిన మంత్రివర్గముకలదు. కాని, అయ్యది, అమెరికాప్రెసిడెంటువలెనే, ప్రజలకే సరాసరి బాధ్యతవహించి, శాసనసభలతో సంబంధములేనిదికాదు. సెనెటుసభవారి యామోదముపైననే, ప్రజాప్రతినిధిసభవారి యిష్టానుసారముగనే, అయ్యది నిర్మింపబడుచున్నది. కాని, ఇంగ్లాండాదిగాగల దేశములందలి మంత్రివర్గములవలె, ప్రజాప్రతినిధిసభవారిచే, ఎప్పుడు బడితే అప్పుడు తనయధికారమునుండి తొలగింపబడదు. మూడువత్సరములకొకమారు, ఈమంత్రులెల్లరు ప్రజాప్రతినిధిసభవారిచే నెన్నుకొనబడెదరు. ఈమూడువత్సరముల లోపల, ఆసభవారు, ఒకటిరెండుమారులు అంతమొందవచ్చును. కాని, మంత్రివర్గముమాత్రము మారదు. ఈమంత్రి

వర్గపు అధ్యక్షుడు, ఇంగ్లాండాదిగాగల దేశములందువలె, ప్రజాప్రతినిధిసభలోని అధికసంఖ్యాకులనాయకుడైయుండు టకుమారు, పార్టీ పెత్తనముపై ఆధారపడక, తనతోడిసభ్యులచే, సంవత్సరమునకొకమారు ఎన్నుకొనబడుచుండును. కనుక, ఒక్క ప్రజాప్రతినిధిసభయొక్క జీవితమందు, ముగ్గురు మంత్రివర్గాధ్యక్షులు పెత్తనమునకురానగును. తదితర దేశములందువలె, మంత్రివర్గము మెజారిటీపార్టీ వారిపై యాధారపడక, ప్రజాప్రతినిధిసభవారందరిచే ఎన్నుకొనబడుచున్నది. ఈమంత్రివర్గపుసభ్యులు, ఆసభయందలి వివిధరాచకీయపక్షములకు జెందియుండెదరు. వివిధరాచకీయపక్షాభిమానులగువారు ఈమంత్రివర్గమునందున్నను, రాచకీయపక్షముల కార్య పరిణాళికల ననుసరించి లేక, ఎప్పటికప్పుడు, శాసన సభవారొసంగు ఆజ్ఞలు సూచించుకార్యవిధానమునే, అములునందు బెట్టుచుందురు. ఈమంత్రివర్గము, అనాదికాలపు ఏథెన్సు నగరపు 'కార్యనిర్వాహకవర్గమువలెనే, శాసనసభవారి యిష్టానుసారము రాచకార్యముల నడుపవలసియున్నది. ఇతర దేశములందు, ప్రధానామాత్యునికిమించి, ప్రెసిడెంటో, లేక రాజో యుండగా, స్విట్జర్లాండునందు, రాజ్యాంగమునకు తలమానికముగా, కార్యనిర్వాహకాధ్యక్షుడె, వ్యవహరించుచుండును.

ఈస్విట్జర్లాండుయొక్క మంత్రివర్గపద్ధతియే ఈకాలపు రాజ్యాంగావసరములందు, హెచ్చుసంతృప్తికరమని అనేక సాంఘిక వాదులు, లిబరలుపార్టీవారు వాదించుచున్నారు. స్విట్జర్లాండునందీమంత్రివర్గము చాలసంతృప్తికరముగా దేశసేవజేయుచున్నది. వివిధ రాచకీయబృందములకల్గిన, జర్మనీ, ఫ్రాన్సు దేశములందును, ప్రతిమంత్రివర్గమందును, రెండు, మూడు, లేక నాల్గుబృందముల సమ్మేళనము ప్రాతినిధ్యత బొందుచున్నది గనుక, మంత్రివర్గపు కార్యప్రణాళిక, ఆసభ్య బృందముల కార్యవిధానములలో మూలసూత్రములపై ఆధారపడియుండును. అట్టియెడ సోషలిస్టుల, కమ్యూనిస్టులనెల్లప్పుడు ప్రత్యర్థిపక్షమునందెయుంచి, వారిసహాకారమువలన కల్గు దేశసేవనుగైకొనకుండుట యనుచితము. కనుక ఆపార్టీలనుకూడ కల్పుకొని, అన్నిపక్షములకుజెందిన మంత్రివర్గము నేర్పరచి, ఒక్కొక్కమంత్రికి సలహాలనిచ్చుటకు, అన్నిపక్షములప్రతినిధులతో కూడిన "సలహాసంఘముల స్థాపించుట శ్రేయోదాయకమని శ్రీజార్జిలాన్సుబరీ వగైరాలు వాదించుచున్నారు. రాజకీయపక్షాభిమానులగువారు, ఈసూచనను నిరాకరించుచు, ఈస్విట్జర్లాండుపద్ధతివలన ప్రభుత్వకార్యవిధానము త్వరితగతి క్రమముగామారుచుండు ప్రజాభిప్రాయమునననుసరించి తగుసంస్కరణాల కల్గించుట కుపయోగపడదనియు, ఏమార్పులగోరక భావప్రపంచమున సోమరులై

యుండు ప్రజాసామాన్యమునకు పూర్తిగాలొంగి, వృద్ధికారకమగు మార్పులఁజేయజాలదనియు చెప్పుచున్నారు తుదకిప్పటి ఫ్రెంచి, జర్మనీవారి, సమ్మేళనబృందముల మంత్రివర్గములైనను, ప్రజాభిప్రాయానుసారము సంస్కరణవాదులకు సంతృప్తికరముగానుండునట్లు, అప్పుడప్పుడైనను, నూతనరాజ్యాంగసంస్కరణలను, సాంఘికమార్పులను ఆర్థికపరివర్తనలను కల్గించగల్గును. కాని స్విట్జర్లాండుపద్ధతి యమలులోనికి వచ్చుచో అట్టి మార్పులకవకాశముండదని వీరు వాదించుచున్నారు. అట్టి "సర్వపక్షమంత్రివర్గములు" సంతృప్తికరముగా రాజ్యాధికారమును నడుపవలయునన్న, ప్రజాప్రతినిధిసభవారికి తమమనసు తాము తెలుసుకొనగల్గి, తామే ముందుచూపుచూడగల్గి, తామే మంత్రివర్గమునకు ముందుదారితీయగల్గియుండుట అగత్యము కనుక; అట్టి నాయకత్వలక్షణములు, శిక్షణాసంసిద్ధి, వందలకొలది సభ్యులచేనిండియుండి వివిధమగు పరస్పరవిరుద్ధమగు, రాచకీయకక్షులచే నడుపబడు శక్తి వారికి యుండదని పార్టీమంత్రివర్గవాదులు వాకొనుచున్నారు. న్యాయముగా విచారించినమాత్రము, ఇప్పటి మెజారిటీపార్టీకి జెందిన మంత్రివర్గములు, వివిధదేశములందు, సంతృప్తికరముగా రాజ్యముచేయలేకుండుటయు, అనేకదేశములందు, వివిధబృందసమ్మేళనములకు బాధ్యతవహించియుండుటయు, అనేకమారులు సమ్మేళనమంత్రివర్గములు, జాతీయమంత్రివర్గములే

అవసరమగుటయు, సాధ్యమగుటయు తటస్థించుచున్నది. కను క, స్విట్జర్లాండువారి మంత్రివర్గవిధానము, మెజారిటీమంత్రివర్గ విధానముకంటె తీసిపోవునదికాదనియు, పైగా మెజారిటీమం త్రివర్గము అనేకమారులు, అనేకదేశములందు, స్విట్జర్లాం డు మంత్రివర్గపు లక్షణములనే బొంది, రాచకార్యనిర్వ హణ మొనర్చు చున్నదనియు ఒప్పుకొనక తప్పదు. క్రీ॥ శ॥ 1932 నందు ఇంగ్లాండునందలి జాతీయ మంత్రివర్గ మందు వాణిజ్యరక్షణపు శిస్తులగూర్చి తీవ్రాభిప్రాయములు కల్గినను ఆశిస్తులు అంగీకరింపబడెను. అట్టియెడ ప్రతిపక్షమం దుండు లేబరు, లిబరలు పార్టీలుకూడ మంత్రివర్గమందుండి నచో ఎంతయో లాభము కలుగకుండునా? వివిధ జర్మను ఫ్రెంచి మంత్రివర్గములందొకేవిధమగు రాచకీయబృందములు చేర్చబడుట స్విట్జర్లాండుపద్ధతికి సమమేకదా? వివిధ మంత్రి వర్గములందు కొందరు నాయకులు అనేక వత్సరములతరబడి సభ్యులుగా నుండుట స్విట్జర్లాండు మంత్రివర్గపద్ధతికి భేదము మాత్రము కాదు. మరియు ఈ "సర్వపక్ష మంత్రివర్గము" వంటి కార్యనిర్వాహక వర్గమే ఇంగ్లీషువారి స్థానిక సంస్థలన్నిటియం దును జయప్రదముగా వ్యవహారనిర్ణయ మొనర్చుచున్నది. ఎన్నటికిని మంత్రివర్గముల నేర్పరచి తమతమ పార్టీ ప్రణాళి కల శాసనరూపకముగా ప్రభుత్వకార్యవిధానరూపకముగా మార్చుకొను ఆశ లేమిచే వివిధదేశములందు లేబరుపార్టీవారు

అశాస్త్రీయమగు, చట్టవిరుద్ధమగు, రాజ్యాంగ విద్రోహకర మగు శాసనోల్లంఘనోద్యమమందె నమ్మకము బొందుచున్నారు. ఇట్టి ప్రజలచే రాజ్యాంగ విధానమును బలపరచునట్లు చేసి రాజ్యాంగ స్థిరతకల్గించవలెనన్న స్విట్జర్లాండుమంత్రివర్గ పద్ధతినే యవలంబించి వీరి ప్రతినిధులను ప్రతి మంత్రివర్గ మందును జేర్చుచుండుట శ్రేయోదాయకమని వేరుగ చెప్ప వలెనా? కాని యీపద్ధతి రెంటికి మించిన రాచకీయబృంద ములు ఏదేశపు రాజ్యాంగజీవితమందైనను ప్రాముఖ్యత వహించియున్ననే లాభకరమగును.

రెండే రాచకీయ పక్షములు అత్యంత ప్రాముఖ్యతవ హించి యున్నయెడల ఇంగ్లీషువారివలెనే మెజారిటీ పార్టీవా రివలననే మంత్రివర్గము నేర్పరుపజేయుట అత్యుత్తమము. రెండే పక్షములుండ ఒకపక్షము మంత్రివర్గము నేర్పరచ మరొకటి ప్రతిపక్షమైయుండ ప్రజలకు ఏ యేపక్షపు కార్య ప్రణాళిక దేశకాల పాత్రముల ననుసరించి యుపయోగకర మైనదో ఏపక్షము రాజ్యాంగాధికారమును సక్రమముగా నడ పునో ఎవ్వరు ప్రజలకు వాగ్దానమొనర్చినరీతి దేశసేవ చేయు చున్నారో లేక చేయుచున్నారో విచారించి తెలుసుకొనుటకు వీలగును. అంత ఆయాపక్షములను రక్షించుటో లేక శిక్షిం చుటో ప్రజలు సక్రమముగా చేయగలరు. తప్పులొనర్చిన మెజారిటీ పార్టీవారి నోడించుటకు వీలు కల్గును. ఏపార్టీవా

రెంతవర కెట్టి యిబ్బందులకు కారకులో నిర్ణయింప సాధ్యమగును. కాని బహుళమగు బృందములుండి ఒక్క బృందము నకు జెందక వివిధబృందపు సమ్మేళనములద్వారా యేర్పడు మంత్రివర్గములు సంప్రాప్తించునెడల ఏపార్టీపై నెంతబాధ్యత బెట్టనగునో ఏపార్టీ నెంతవరకు శిక్షింపవలెనో నిర్ణయించుటకు ప్రజలకు సాధ్యముకాదు. అందువలన అమెరికా రాష్ట్రములందువలె ఫ్రాన్సు, జర్మనీ దేశములందువలె ప్రజలకు వివిధబృందములు చీకాకు కల్గించి వారికి రాచకీయమందుండు శ్రద్ధను తగ్గించును.

ఐర్లాండునందు ఐరిష్ఫ్రీస్టేటులో ప్రధానమంత్రిని ప్రెసిడెంటు అనుట కలదు. ఆతడు తదితర బ్రిటిషుప్రజాస్వామికరాజ్యాంగములందువలె రాజుగారివలననో లేక గవర్నరుజనరలు గారివలననో నియమింపబడక "డయిలుఇరాను" అను ప్రజాప్రతినిధిసభవారిచే యెన్నుకొనబడుచుండును. అంతనా ప్రెసిడెంటుగారు తనకుసుముఖమగు మెజారిటీయొక్క నాయకులలో కొందరిని తనమంత్రివర్గ సభ్యులుగా నియమించును. ఈపద్ధతివలన ప్రజాప్రతినిధిసభయందలి వివిధరాచకీయ బృందముల నాయకులలో నెవ్వరిని ప్రధానమంత్రిగా నేర్పరచవలయునా యనువిషయమును తీర్మానించు నధికారము గవర్నరుజనరలుగారికి లేకపోవును. జర్మనీ, ఫ్రాన్సు, ఇంగ్లాండు, దక్షిణఆఫ్రికా, ఆస్ట్రేలియా, కెనడా, న్యూజీలాం

డు తదితర దేశములందు అచ్చటి ప్రెసిడెంటు లేక గవర్నరు
జనరలునకు వివిధనాయకులలో నేరినైనను మంత్రివర్గ మేర్ప
రచుమని కోరుటకు అధికారముండుటయు, తన్మూలమున
వివిధబృందములమధ్య సఖ్యత నేర్పరచి బృందసమ్మేళనముల
సమకూర్చి దేశసేవచేయుటకేగాక రాజ్యాధికారమును చెలా
యించుట కవకాశము కల్గుచున్నది. ఇట్టియవకాశము ఐ
ర్లాండునందు కలుగుటలేదు. ఈఐరిషువిధానమే జర్మనీయం
దములులో నున్నట్లైన ప్రెసిడెంటు హిండెన్ బర్గుగారు శ్రీ
బ్రూనింగుగారిని పదభ్రష్టునిచేసి శ్రీఫన్ పెపెన్ గారిని ఛా
న్సలరుగా నియమించుటకు వీలుండెడిదికాదు; ఇప్పుడు నాజీ
పార్టీనాయకుడైన శ్రీహిట్లరుగారికి ఛాన్సలరు కాగల్గు అవ
కాశములు కూడ కన్పడెడివికావు. వివిధబృందములుండి
కొన్నిబృందములు రాజ్యాంగవిధానమునె పూర్తిగా మార్చి
వేసి నిరంకుశ ప్రభుత్వమును స్థాపించు కుతూహలులై
యున్నంతవరకు ఐర్లాండులోవలె ఒకబృందము విరోధిదేశ
ముతో సఖ్యత నెరపనిచ్చగించునెడల ప్రెసిడెంటునకుగాని,
గవర్నరుజనరలునకుగాని ప్రధానమంత్రిని నియమించు నధి
కార ముండుటకు మారు ప్రజాప్రతినిధి సభవారికె యుండు
ట శ్రేయస్కరము.

జర్మనీయందు, ఛాన్సలరు (ప్రధానమంత్రి) గారిని,
ప్రెసిడెంటుగారే నియమింతురు. ఆతడు ప్రజాప్రతినిధిసభ

యందలి బృందములలో నొక్కదానికి నాయకుడై యుండవలెను. అతనికి తదితర బృందములలో కొన్నిటి నొకసమ్మేళనమందుజేర్చి, మెజారిటీసభ్యుల ప్రాపకము సంపాదించుకొనగల్గిన సత్తా యగత్యము. అంతనాతడు తనమంత్రివర్గమును నిర్మించును. ఇటులనే, ఇంగ్లాండాదిగాగల దేశములందును ఆచారమైయున్నది. తదితరదేశములందు రాజ్యాంగవిధానపు చట్టముందే, ఈచాన్సలరుయొక్క ధర్మమెద్దియో, మంత్రివర్గపుధర్మమెద్దియో నిర్ణయింపబడుట లేదు కాని, జర్మనీయందు ఈవిషయములు చట్టముందే నిర్ణీతమైనవి. ఛాన్సలరుగారు, మంత్రివర్గపు కార్యప్రణాళిక నేర్పరచవలెను. ఆప్రణాళిక ననుసరించియే, మంత్రివర్గము వివిధప్రభుత్వడిపార్టుమెంటుల నడుపవలయును. మంత్రివర్గములకు ఛాన్సలరు అధ్యక్షుడు. ప్రతిమంత్రియు తనవశమందున్న డిపార్టుమెంటుల పాలనమునకు బాధ్యుడు. రాచకీయప్రణాళికకు ఛాన్సలరు బాధ్యుడు. ఏమంత్రి యొక్కడిపార్టుమెంటుపై ప్రజాప్రతినిధి సభయందు విశ్వాసరాహిత్యతీర్మాన మంగీకరింపబడునో, ఆతడు తనపదవికి రాజీనామాయివ్వవలెను. చాన్సలరుగారు మంత్రులలో నెవ్వరినైనను, రాజీనామాయివ్వవలసినదని కోరనగును. తదితరదేశములందువలెనే ప్రజాప్రతినిధిసభను అంతమొందించవలసినదని ప్రెసిడెంటుగారిని కోరవచ్చును. అటులనే, ప్రజాప్రతినిధిసభవారు "విశ్వాసరాహిత్యతీర్మాన" మంగీకరించి

నవెంటనే ఛాన్సలరు, తనమంత్రివర్గముతోసహా తమ పదవికి రాజీనామా యివ్వవలెను.

ఇంగ్లాండునందలి మంత్రివర్గమే, ప్రపంచమందిప్పుడున్న బాధ్యతాయుతమంత్రివర్గములకు మాతృకమైయున్నది. ఆదేశపు మంత్రివర్గమును "కాబినెట్టు" అందురు. ప్రప్రథమమున ఐదుగురు ప్రధానులగు మంత్రులుండిరి. వారిపేరుల ప్రథమాక్షరముల జేర్చినచో "కాబల్" అను శబ్దము వచ్చును. కొంతకాలమీమంత్రివర్గము "కాబల్" అని పిలువబడుచుండెను. క్రమముగా "కాబినెట్టు" అను పేరుపొందెను. ఇయ్యది, ప్రీవీకౌన్సిలుసభ్యులలో కొందరిచే యేర్పరుపబడెను. ఈమంత్రివర్గపు సభ్యులు, ఆదేశపురాజుయొక్క మంత్రులైయుండిరి. క్రీ॥ శ॥ 1688 సంవత్సరమున కల్గిన "రక్తపాతములేని విప్లవము"ద్వారా రాజ్యాంగమందు పార్లమెంటుయొక్క ఆధిపత్యత స్థిరపరుపబడెను. రాజునకు వలయు బడ్జెట్టునంగీకరించుటకు, రక్షణదళముల నిల్పుటకవసరమగు శాసనముల ప్రతివత్సరము నిర్మించుటకు పార్లమెంటు అంగీకరింపవలసివచ్చెను. పార్లమెంటుయొక్క సహాకార మీ వ్యవహారములందును పొందవలయునన్న ఆసభలలో ముఖ్యమగు కామన్సు సభవారి మెజారిటీకి యిష్టులగు మంత్రులనే నియమించుట రాజున కవసరమయ్యెను. కనుక మూడవవిలియము, ఆయనభార్య మేరీరాణియు, రాజ్ఞిఆనీగారును, మెజారిటీ

నాయకులనె మంత్రులుగా నియమించుచుండిరి. పిమ్మట జర్మనువంశీకులగు ప్రథమజార్జి, ద్వితీయజార్జిప్రభువులు ఇంగ్లీషు తెలియనివారై, ఇంగ్లీషురాజ్యాంగ వ్యవహారములందు శ్రద్ధలేనివారై, భోగలాలసులైయుండుటచే మంత్రులసభలపై అధ్యక్షతవహించుట మానిరి. ఆకాలమందే ప్రధానమంత్రిగా నున్న శ్రీ వాల్‌పోలు (Walpole) గారు ఇరువదివత్సరముల పర్యంతము (1721-42) రాజ్యమునడపి, 'కాబినెట్టు' యొక్క యీకాలపుటధికారమునకు పునాదులు వేసెను. అప్పటినుండి ఈమంత్రివర్గసభకు, ఆచారవశతు, ప్రధానమంత్రియే అధ్యక్షుడుగానున్నాడు. మంత్రివర్గసభయొకటి ఉన్నదనిగాని, ప్రధానమంత్రి యొకరున్నారని గాని 1920 వ సంవత్సరమువరకు రాజ్యాంగవిధానమునందలి శాసనములలోగాని, ప్రభుత్వపు రికార్డులందుగాని ప్రత్యేకముగా వ్రాయబడియుండలేదు. ప్రధానమంత్రియు నొక్కమంత్రిగాను, మంత్రులెల్లరు ప్రీవీకౌన్సిలుసభ్యులుగాను పరిగణింపబడుచుండిరి.

మూడవజార్జిప్రభువుగారు తిరిగి తనపెత్తనమును పునరుద్ధరింపవలెననియు, మెజారిటీకి చెందిన మంత్రివర్గమును నిర్మూలింపవలెననియు ప్రయత్నించి విఫలమనోరథుడయ్యెను. అప్పటినుండి క్రమముగా శ్రీవిక్టోరియారాజ్ఞిగారి విశ్వాసము ద్వారా ఇప్పటివరకు మంత్రివర్గముయొక్క యధికారము హెచ్చుచున్నది. రాజుపేరిట జరుగనున్న వ్యవహారములన్ని

యు మంత్రివర్గము వారు నడుపుచున్నారు. రాజ్యాంగమందు శాసనసభ వారికి మించి, న్యాయస్థానములకు మించి, నడుప దగు ప్రభుత్వకార్యములన్నియు మంత్రాంగసభవారి పెత్తన ముక్రిందకు వచ్చినవి. కాని ఈ ప్రభుత్వకార్యములన్నియు రాజు పేరిటనే, రాజుముద్రక్రిందనే జరుపబడుచున్నవి.

యుద్ధానంతరమువరకు మంత్రివర్గపుసమావేశములు రహస్యముగ జరుగుచుండెను. శ్రీ వాల్ పోల్ గారి కాలమందు మంత్రివర్గరహస్యములు కొన్నిటి రాజునకు తెల్పుచు, రాజు నకు యిష్టులగు మంత్రులపై క్రిమినలు కేసులు తెప్పించు చుండుటచే ఇట్టిరహస్యసమావేశము ఏర్పరుపబడెను. ఆ సభలయం దేయేవిషయములుచర్చింపబడెనో, ఏయేసభ్యు లేమేమి చెప్పిరో తెల్పుటకు తగురిపోర్టరులు లేరైరి. కాని యుద్ధకాలమందు అత్యంతముఖ్యమగు వ్యవహారముల చర్చిం చుట అగత్యమగుటవలన మంత్రివర్గపుసభ్యులసంఖ్యయు హెచ్చగుటచే ఆసభాసమావేశములు రహస్యముగనే జరుగు చుండినను సభావృత్తాంతమంతయు ఆమూలాగ్రముగా గ్రంథ స్థము చేయుబడుచుండెను. ఇందులకై 'కాబినెట్టు' యొక్క సెక్రటేరియటు యేర్పరచబడెను. ఐతే ఒకమంత్రివర్గము వారి సమావేశచరిత్ర, మరొక మంత్రివర్గము వారికి దొరుకుచున్న దో లేదో కాని ఒక మంత్రివర్గము పెత్తనమందున్నంతకాల

మైనను అందలి సభ్యులకు వారి సమావేశవృత్తాంతములు సహాయకారిగా నుండును.

యుద్ధకాలమునందే మంత్రివర్గపుసభ్యులు హెచ్చైపో యిరి. యుద్ధానంతర మా సంఖ్య తగ్గదాయెను. సభ్యులసంఖ్య హెచ్చైనకొలది చర్చ ముఖాముఖి వ్యాదయాములు కలియు నట్లు, అభిప్రాయభేదములు సమయునట్లు, ఏకాభిప్రాయములు తయారగునట్లు సాధ్యపడుట దుస్తరమగును. దినదినమునకు కల్గుచుండు క్రొత్త రాజ్యాంగ పరిస్థితుల పరిష్కరించుటకుతగు కార్యవిధానమును తేల్చుటకు మంత్రాంగవర్గమువారే సమా వేశమగుచుండుట దుస్తరము. పైగా, మంత్రాంగవర్గమువా రందరి నేకాభిప్రాయులుగా జేయుటకు హెచ్చువ్యవధి యగ త్యము. కనుక మంత్రులందరియందును నాయకులగు ఏఐదు గురో, నల్గురో చిన్న గోష్టి నేర్పరచుకొందురు. ఈమంత్రి వర్గపుగోష్టియొక్క సమావేశముల కింకను రికార్డు లుంచు మర్యాద లేదు. మంత్రివర్గపుకార్యప్రణాళికయొక్క ప్రధాన సూత్రములను వీరే సాధారణముగా నిర్ణయించుచుందురు.

బ్రిటిషువారి మంత్రివర్గమందు మూడు భాగములు కలవు. కార్యదర్శులు, సహాయకార్యదర్శులు, ప్రధానమంత్రి. అందరుకలసి మంత్రాంగవర్గము (Ministry) గా నేర్పడు చున్నారు. అందులో ప్రధానమంత్రులందరుకలసి (Cabinet) మంత్రాంగసభ యగుచున్నారు. వారిలోను ముఖ్యులగు ఐదా

ద్దరు కలిసి మంత్రివర్గపుగోష్ఠి (Inner Cabinet) నేర్పరచు చున్నారు. వీరందరికి నాయకుడు ప్రధానమంత్రి. అతడు రాజుగారిచే నియమితుడగును. ఆయన కామన్సుసభయందలి ప్రధానపక్షపు నాయకుడై యుండుట క్రిందటి యిరువదివత్సరములనుండి వాడుకయైయున్నది. నామకార్థపుమంత్రిస్థానము నాతడు ఆక్రమించుచు ప్రధానమంత్రికి తగుకార్యభారమును మోయుచుండును. శ్రీ లార్డు శాలిస్‌బరీగారి పిమ్మట తిరిగి 1924 నందు శ్రీరామ్సేమాక్డునాల్డుగారు విదేశాంగమంత్రిగా గూడ వ్యవహరించువరకు ప్రధానమంత్రి యేడిపార్లమెంటును పరిపాలించుభారమును వహించుట తగదను నభిప్రాయము ప్రబలమగుచున్నది. ఆతడే తనమంత్రివర్గమును నడపుచు దాని సమావేశముల నుండు నాయకత్వము వహించి మంత్రివర్గపుకార్యప్రణాళికను తయారుచేసి పార్లమెంటునకు నివేదించును. విశ్వాసరాహిత్యపుతీర్మానము కామన్సుసభ యందంగీకృతమగుచో, ఆతడు తన పదవికి రాజీనామా నివ్వవలసియున్నది. ఆతడు పదభ్రష్టుడైనవెంటనే మంత్రివర్గ మంతయు పదభ్రష్టతబొందును. తాను తనపదవికి రాజీనామా యిచ్చునప్పుడే తన ప్రత్యర్థిపక్షనాయకులలో నొక్కరి (ప్రధాననాయకుని) మంత్రాంగవర్గము నేర్పరుప పిలువవలసినదని రాజునకు సలహా యిచ్చుట ఆచారమై యున్నది. ఒకవేళ "విశ్వాసరాహిత్యతీర్మానము" కామన్సు

సభవారిచే అంగీకృతమైనను సభవారు ప్రజాభిప్రాయమును ప్రకటించుట లేదనియు, తన మంత్రివర్గపు కార్యప్రణాళికనే ప్రజలు బలపరచుచున్నారనియు, తనకు సంపూర్ణ నమ్మకము కల్గియున్న రాజుగారికి నట్టివిశ్వాసమునే కల్గించుచో రాజుగారిని, కామన్సుసభవారి నంతమొందింప ప్రధానమంత్రి కోరవచ్చును. సాధారణముగా ఆసభవా రెన్నుకొనబడిన మొదటి వత్సరమందే అద్దాని నంతమొందింపకోరుట అసాధారణమే కాక, అసభ్యమైనను ప్రధానమంత్రియొక్క ఆకోర్కెను రాజుగారు నిరాకరింపరాదనియే ప్రధానరాచకీయజ్ఞుల నమ్మకము. తన సలహాలపై పార్లమెంటు అంతమొంది క్రొత్తగా యెన్నుకొనబడిన కామన్సుసభయందు తనకే మెజారిటీ లభించుచో తనకే తిరిగి మంత్రివర్గమును నడపుహక్కు సంప్రాప్తించును. ఇష్టమున్న, కొందరుమంత్రులను తీసివేసి క్రొత్తవారిని నియమించవచ్చును. కాని కామన్సుసభవారు తన కెదురగుచో వెంటనే తన పదవికి రాజీనామా నివ్వవలసిన బాధ్యత ఆతనిపై కలదు అంత రాజుగారు ప్రతిపక్షులందు ప్రధానపక్షనాయకుడగు వారిని మంత్రివర్గ మేర్పరుప నియమించవలెను. ఇట్టిపరిస్థితులందు కొన్ని సందిగ్ధావస్థలు కల్గుచుండును. క్రీ॥ శ॥ 1924 సంవత్సరమందు క్రొత్తగా నెన్నుకొనబడిన కామన్సుసభయందు ప్రధానమగునది కన్సర్వేటివు పార్టీయే. కాని వీరి మంత్రివర్గమే "జనరలు ఎన్నికలు"

తెచ్చిపెట్టి తమ సభ్యత్వముల నెన్నిటినో గోల్పోయి ప్రజల యవిశ్వాసమునకు బాల్పడెను రెండవపక్షమగు లేబరుపార్టీ వారు, అనేక క్రొత్తసభ్యత్వములబొంది ప్రజల విశ్వాసమును జూరగొనిరి. కనుక ప్రధానమగు కన్సర్వేటివుపక్షముయొక్క మంత్రివర్గము పదభ్రష్టత బొందుటయు, లేబరుపార్టీవారు మంత్రివర్గ మేర్పరచుటయు తటస్థించెను.

మంత్రివర్గమంతయు, ప్రభుత్వపు సాధారణకార్య ప్రణాళికకు సంయుక్త బాధ్యత వహించుచుండును. కనుక, మంత్రివర్గముచే నంగీకరింపబడిన కార్యప్రణాళికయందు ఏడి పార్లమెంటునకు చెందిన భాగమైనను పార్లమెంటుచే తిరస్కరింపబడుచో, మంత్రివర్గమంతయు రాజీనామా యివ్వవలసియుండును. ఒకవేళ అట్టి సమస్య "విశ్వాసరాహిత్యము" గా పరిగణింపబడకున్నను, కొలదివారముల పిమ్మటనైన ఆతీర్మానమునకు గురియైన మంత్రి రాజీనామాయివ్వవలసియుండును. ఇటులనే, మెసపటోమియా యుద్ధకార్యవిధానమును నిరసించినందులకు శ్రీ చేంబర్లేనుగారు ఇండియా సెక్రటరీపదవి వదలవలసివచ్చెను. మంత్రివర్గపుకార్యప్రణాళికకు వ్యతిరేకించి స్వతంత్రముగా వ్యవహరించుట కేమంత్రికిని హక్కులేదు. మంత్రివర్గసభలు సమావేశము కాకముందె, అవసరమునుబట్టి అమలుజరుపవలసినతీర్మానముల జేయుటకు మంత్రులకు హక్కుకలదు. ఎల్లప్పుడు మంత్రివర్గ

గోష్టిసభ్యులు అందుబాటులో నుండురుగనుక వారిసలహాల నైన ముఖ్యవిషయములందు మంత్రులు గైకొనుచుండవల యును. ఇటుల వ్యవహరించు స్వతంత్రాధికారమును అనుచితముగా నుపయోగించిన మంత్రిపై ప్రధానమంత్రి మంత్రివర్గమువారి సమ్మతిపైగాని, స్వయముగాగాని చర్య తీసుకొనవచ్చును. ఇటులనే, శ్రీలాయడుజార్జిగారికి తెలియకనే, శ్రీ ఎడ్వినుమాంటాగ్యూగారు టర్కీవారికి సుముఖముగానుండు ప్రకటనను, శ్రీలార్డురెడింగుగారిచే చేయించినందులకు శ్రీలాయడుజార్జిగారాయనను డిస్మిస్ చేసెను.

మంత్రివర్గ మేర్పరచునప్పుడు ప్రధానమంత్రికి సంపూర్ణమగు స్వాతంత్ర్యము కలదనుకొనుట పొరపాటు. తనపార్టీయందు ప్రముఖులైనవారికి తప్పక కొన్నిస్థానములివ్వవలెను యువకులైనవారిలోశక్తియుక్తులుకల్గినవారికికొన్నిస్థానములవసరము. ఇదివరకే తనమంత్రివర్గములందు మంత్రులుగానుండినవారికి తిరిగి స్థానములివ్వవలెను. రాగాపోగా క్రొత్తవారిని సహాయకార్యదర్శులుగా నియమించుట యందును, వివిధనాయకుల నాయాడిపార్టుమెంటులకు మంత్రులుగా నిర్ణయించుటలోను మాత్రము ప్రధానమంత్రికి కొంత స్వాతంత్ర్యము కలదు. ఇటులనే ఫ్రాన్సు జర్మనీలయందును, ప్రధానమంత్రి సంకుచితాధికారియై యున్నాడు. అచ్చట ఆతడు వివిధబృందముల సహకారము బొందవలసి యున్నది గనుక,

అనేకమంత్రుల నియామకము ఆయనపై ఆధారపడియుండుట లేదు. అనేకమారులు ప్రధానమంత్రులకు అంతగా పరిచయము లేనివారును మంత్రులగుచుందురు.

కనుక, ఇంగ్లాండుయొక్క మంత్రివర్గపు ప్రధానలక్షణములను క్లుప్తముగా పేర్కొందము. (1) మంత్రివర్గపు సభ్యులలో ననేకులు కామన్సు సభాసభ్యులు, కొలదిమంది ప్రభువుల సభాసభ్యులు, (2) అందరును సాధ్యమైనంతవరకు ఒకే పక్షమునకు జెందినవారై యుందురు. యుద్ధారంభమువరకు సంయుక్త పక్షమంత్రివర్గములు ప్రజలకు ప్రీతికరముగాకుండెను. కనుకనే, మైనారిటీయందున్న లేబరుపార్టీకి, రెండుమారులు మంత్రివర్గము నేర్పరచు సావకాశమును ఇతరపార్టీలుకల్గించినవి. ఇప్పుడుమాత్రము "జాతీయమంత్రివర్గము" మూడుపార్టీల సమ్మేళనమువలన యేర్పరుపబడినది. (3) మంత్రివర్గమంతయు, ఒకే రాచకీయదృక్పథమునుండి నిర్మింపబడిన కార్య ప్రణాళికను నడపుచుండును. (4) మంత్రివర్గమంతయు అట్టికార్య ప్రణాళికకు బాధ్యతవహించును. (5) మంత్రులెల్లరు ప్రధానమంత్రియొక్క నాయకత్వము నొప్పుకొందురు. (6) ప్రధానమంత్రివలన ఏర్పరుపబడి ఆయన రాజీనామాతోడనే, తమపదవులను మంత్రులందరు వదలుకొనవలసియుండుటయు జూడనగును. (7) ప్రధానమంత్రి నెదిరించు మంత్రిని పదభ్రష్టునిచేయు నధికారము ప్రధానమంత్రికి కల

ము. (8) కామన్సుసభవారి వ్యతిరేకతీర్మానములలో నెయ్యది "విశ్వాసరాహిత్యము" కన్పరచదో తెల్పునధికారము ప్రధానమంత్రికికలదు అటులనే, లేబరుమంత్రివర్గమువారు అనేకమారులు కామన్సులో అపజయమందినను రాజీనామా యివ్వకుండ నుండకల్గిరి. (9) "విశ్వాసరాహిత్యతీర్మానము" కామన్సుసభవారిచే అంగీకరింపబడుచో, ప్రధానమంత్రి తనమంత్రివర్గముతో బాటు రాజీనామాయివ్వవలెను. (10) అటుల "విశ్వాసరాహిత్యతీర్మానము" అంగీకరింపబడినపిమ్మట, రాజీనామాయిచ్చుటకు తనకిష్టము లేనిచో, ప్రధానమంత్రి కామన్సుసభను అంతమొందించి జనరలుఎన్నికలు పెట్టింపవలెనని రాజుగారిని ప్రార్థించవచ్చును.

ఈసూత్రముల ననుసరించియే, బ్రిటిషుఅధినివేశపు రాజ్యాంగములందును ఫ్రాన్సు, నార్వే, స్వీడనులందును, తుదకు జపాను, స్పెయిను, చెకోస్లావాకియా దేశములందును మంత్రివర్గము లేర్పరుపబడి ప్రజాప్రతినిధిసభవారికి బాధ్యతవహించియున్నవి. ఈసూత్రములలో నెద్దియు, ఇంగ్లీషు రాజ్యాంగమందు చట్టరూపముగాని శాసనరూపముగాని పొందకున్నను ఫ్రాన్సు, చెకోస్లావాకియా, బ్రిటిషువారి అధినివేశరాజ్యాంగ చట్టములందు నిర్ణయింపబడియున్నవి. వివిధ రాచకీయబృందములను జేరదీసి సమ్మేళనమేర్పరచి మంత్రివర్గమేర్పరుపవలసిన యవసరముకల్గిన జర్మను ఛాన్సలరుగారు

అనుభవమున బ్రిటిషుప్రధానమంత్రికంటె హెచ్చుయధికారము పొందకున్నాడు. కనుక, ఈదేశములందలి మంత్రివర్గములవలెనే జర్మనీదేశపుమంత్రివర్గమును, పైన పేర్కొనబడిన పదిసూత్రముల ననుసరించియే వ్యవహరించుచుండును.

ఇట్టిమంత్రివర్గములందు సభ్యులగువారు ఆయాదేశములందలి శాసనసభలలో పేరుపొందినవారై యుందురు. వారిలో ప్రముఖులు దేశమునందు పేరొందినవారు. మంత్రులెల్లరు ఎట్టివారో శాసనసభాసభ్యులెల్లరకు తెలిసియుండును. వివిధరాచకీయ పార్టీలయొక్క రాచకీయప్రణాళికలు శాసనసభలకు తెలియును. శాసనసభయందు ప్రాముఖ్యతబొంది మంత్రిత్వమునకు అర్హతబొందవలయునన్న ప్రజాసేవ చేసినవారుగాని, కొన్నిబిల్లుల ప్రవేశపెట్టుటద్వారా లేక, ప్రభుత్వముయొక్క సుగుణములు, అవగుణముల విమర్శించుటద్వారా పేరొందినవారుగాని, వివిధదేశముల జూచివచ్చి, రాచకీయ విజ్ఞానము పొందినవారుగాని యైయుండవలెను. వక్తలును, ప్రజానురంజకులును, సభాసదుల మనంబులకు నచ్చునట్లు రాచకార్యముల ప్రదర్శించువారును సాధారణముగా శాసనసభానాయకులై యుండెదరు. అట్టివారు ప్రజాభిప్రాయమును గ్రహించి, శాసనసభవారి తత్వమును కన్గొని, ఆయభిప్రాయము, తత్వము, ప్రకారము తమకు యేర్పరుపబడిన డిపార్టుమెంటులను నడపుటకు తగియుందురు. ప్రభుత్వ కార్య

ముల నిర్వహించు సివిలుసర్వీసువారు తగుసమర్థులై యుందు రుగనుక, వారెట్టిసూత్రముల ననుసరించి ఏయేలాభముల కల్గించుటకై తమయధికారముల నుపయోగించవలెనో నిర్ణ యించు తమధర్మమును శాసనసభానాయకులే స్వాతంత్ర్యపూర్వక ముగా నిర్వర్తించగలరు.

మంత్రివర్గమువారు ప్రభుత్వకార్యముల నిర్వహించుటకే వలసియున్నదిగదా? అందులకుగానుధనమగత్యము. ఆధనము నుఖర్చుపెట్టుటకు హక్కు యుండవలెను. ఇందులకై "బడ్జెట్టును" శాసనసభవారిచే అంగీకరింప చేసుకొనుట యగత్యము. శాస నసభలందును ప్రజాప్రతినిధి సభవారివ్యవహారమందు ప్రాము ఖ్యత బొందియున్నారు కనుక ఆసభవారినుండు వ్యవధి తక్కు వగాన ఆవ్యవధియం దెంతకాలము తమ "బడ్జెట్టు"ను చర్చిం చుట కగత్యమో నిర్ణయించి ప్రజాప్రతినిధిసభవారిని నడపి బడ్జెట్టును సకాలమున అంగీకరింప జేసుకొనుట మంత్రివర్గము వారి ధర్మమైయున్నది. ఈ విషయమందు మంత్రివర్గమునకు సంపూర్ణమగు స్వాతంత్ర్యము అగత్యము. ప్రజాప్రతినిధిసభ వారికి బడ్జెట్టును సమగ్రముగా విమర్శించుటకు హక్కుయుం డనగును గాని ఫ్రాన్సునందువలె తమ స్థాయిసంఘముద్వారా బడ్జెటునందు క్రొత్తభాగముల జేర్చి ఉన్న భాగముల తగ్గించు నధికారమున్నట్లు ఇతరదేశములం దుండుట శ్రేయోదాయక ము కాదు.

కావలసినధనము బడ్జెట్టుద్వారా లభించిన పిమ్మట సాంఘికార్థిక రాజకీయ జీవితమందు ప్రజల కగత్యమగు శాసనముల నిర్మించుటయుకూడ మంత్రివర్గపు ధర్మము. ప్రజాప్రతినిధిసభలోని మెజారిటీవారి సహాయము బడయు మంత్రివర్గమువారు తమ శాసననిర్మాణకార్యమును సాధించుట కగత్యమగు వ్యవధిని నిరూపించి ఆవ్యవధియందు తమబిల్లుల ప్రవేశపెట్టి వానిని శాసనములుగా నిర్మించవలసినభారము మంత్రివర్గముపై నున్నది. శాసనసభవారిచే తమ బిల్లులు సంతృప్తికరముగా విచారింప బడుటకు తగు నవకాశము లివ్వవలెను. ఇందులకై అవసరమున్న ప్రజాభిప్రాయము కనుగొనుటకై ప్రజాసంస్థలమధ్య తమబిల్లుల ప్రచార మొనర్చి, పిమ్మట శాసనసభవారి స్థాయిసంఘములు చర్చించుట కవకాశమిచ్చి, ప్రజలు కోరుచో ఆసంఘములనుందు ప్రజానాయకులు, సంఘములు సాక్ష్యమిచ్చుటకు నావకాశము కల్గించి సాధ్యమైనంతవరకు ప్రతికక్షులవారికిగూడ సంతృప్తికరముగా నుండునట్లు తమ బిల్లుల పరిష్కరించి తుదకు శాసనములుగా నిర్మింపవలసియున్నది. అటు బడ్జెట్టునుకాని ఇటు తదితర బిల్లులగాని శాసనములుగా నిర్మించుటకు ప్రధానమగు శక్తిసామర్థ్యములు ఈవిధమగు మంత్రివర్గములకు కలవు.

ఈవిషయమందు అమెరికారాజ్యాంగపద్ధతి యెంతయు అసంతృప్తికరముగా నున్నది. రాజ్యాంగ వ్యవహారనిర్వహణ

మునందనుభవము కల్గియున్న మంత్రులు ప్రజాప్రతినిధి సభానాయకులై యుండుటవలన వారియనుభవముయొక్క లాభమునుపొంది శాసననిర్మాణము మంత్రివర్గము వారి నాయకత్వముక్రింద జేయుటకు అమెరికా గాక ఇతర రాజ్యాంగములందు సుగమమై యున్నది. కాని అమెరికాయందు మంత్రులతో సంబంధము లేని కాంగ్రెసుసభలు వారి అనుభవమునకు తగిన ప్రాముఖ్యత నిచ్చుటకు అంగీకరించక, మంత్రులచే తయారుకాబడిన బిల్లులలెక్కించక తమంత తామే బిల్లుల తయారుచేసి శాసనములుగా నిర్మింపఁ బ్రయత్నించుటవలన శాసననిర్మాణకార్యము చురుకుగా జరుగజాలదు. రాచకీయ పార్టీల ప్రాపకముద్వారా ప్రెసిడెంటునకును కాంగ్రెసునకును మధ్య కొంతసంబంధ మేర్పడినను మంత్రివర్గములు కల్గిన దేశములందువలె ప్రభుత్వముకోరు బిల్లుల శాసనసభలందు వక్తలగు,అనుభవజ్ఞులగు మంత్రులచే ప్రవేశపెట్టించబడి ఆమంత్రులచేనడుపబడుట సాధ్యమగుట లేదు. మరియు తమ ప్రభుత్వము అను అభిమానము కాంగ్రెసువారికి ప్రెసిడెంటుయందు లేకుండుటచే, ప్రెసిడెంటు గారి బిల్లులను విపరీతముగా మార్చకుండ వారంగీకరించుట కుద్యుక్తమగుట లేదు. ఇక బడ్జెట్టువిషయమున కాంగ్రెసు యొకవిధముగను ప్రెసిడెంటు మరొకవిధముగను వ్యవహరించుచుండుట అమెరికాయందు సాధారణమై యున్నది. కాంగ్రెసు వారి "ఆర్థిక స్థాయిసంఘము"లవారికి అత్యధికమగు అధి

కా(ము బడ్జెట్టు(  తారుమారు చేయుటలో' ౕలదు. కనుకనే ఈ (ంవత్సరము (ాను సూచించిన క్రొత్తశిస్తులను కాంగ్రెసు అం(ీకరించునో లేదో యను సంశయముతో ప్రెసిడెంటు హూ'రుగా రమిత యలజడిపొందిరి. తుదకుసెనెటు సభవారి ముందు తా నుపన్యసించవలసి వచ్చెను. అనేకయిబ్బందులు పడినపిమ్మట తన బడ్జెట్టుబిల్లు అనేకమార్పులజెంది అంగీక రింపబడెను. ఇతరదేశములం దిట్టిబాధ కలుగజాలదు.

ప్రభుత్వ కార్యనిర్వహణమందును ప్రతి డిపార్టుమెంటు ఎటుల నడుపబడుచున్నదో శ్రద్ధగా విచారించుటకు మంత్రి వర్గపు దేశములందు శాసనసభల కధికారము కలదుగనుక ఆసభలయందు తామవలంబించుచున్న కార్యవిధానము తీవ్ర ముగా విమర్శింపబడనంతవరకు, నిరసింపబడనంతవరకు తాము ప్రజాభిప్రాయానుసారముగా రాజ్యము జేయుచుంటి మిగదా యను నమ్మకము మంత్రులకు కల్గుచుండును. అమె రికా ప్రెసిడెంటు(ు ఎప్పటికప్పు డరికట్టుటకు కాంగ్రెసున కధికారము లేదు. కాని మంత్రివర్గముయొక్క అనుదిన చర్యల విమర్శించి అవసరమగునప్పుడెల్ల జాగ్రత్త కొల్పుటో, అవి విశ్వాసము తెల్పుటో, "విశ్వాస రాహిత్య తీర్మానమును" అంగీకరించుటో అమెరికేతర దేశములందు సాధ్యమగును. కనుక మంత్రివర్గ మెల్లప్పుడు తన రాజకార్యభారమును ప్రజానురంజకముగా నడుపుట కగత్యము కలుచుండును. ఇం

దువలన మంత్రివర్గపు ప్రభుత్వము ప్రజలకు హెచ్చుసంతృప్తి కల్గించును. శాసనసభలయందే ప్రభుత్వపు చర్యల విమర్శిం పనగును. అనుదినపు డిపార్టుమెంటు వ్యవహారముల విచారిం చుటకు ప్రతి డిపార్టుమెంటునకు ఒక స్థాయిసంఘము శాసన సభాసభ్యులతో ఏర్పరచబడి యుండును. కనుక సంఘము ద్వారా ప్రజాభిప్రాయానుసారముగా డిపార్టుమెంటు వ్యవహా రముల నడిపించుట కవకాశము కలదు. ప్రజలకు మంత్రివర్గ ముపై పూర్తిగా యసంతృప్తి కల్గుచో, ఎప్పటికప్పుడు మం త్రివర్గమును ప్రజాప్రతినిధి సభవారి "విశ్వాసరాహిత్య తీర్మా నము"ద్వారా పదభ్రష్టత బొందించవగును. అమెరికాదేశపు ప్రెసిడెంటు యిటుల ప్రజాభిప్రాయమునకు సంపూర్ణ సంతృప్తి కల్గింప జాలడు. ప్రజలకు ప్రెసిడెంటుపై, మంత్రివర్గములపై యున్నట్లు పైపెత్తనము సాధ్యపడుటలేదు. ఆర్థిక సాంఘిక వ్యవహారములు బహుతర క్లిష్టస్థితికి వచ్చుచున్న యీదినము లందు, సూత్రములు ప్రకటించుటకై అనేక శాసనములను నిర్మిం చుట శాసనసభలకు సాధ్యమగుచున్నది. వివరముల పూర్తి చేయు నధికారము ప్రభుత్వమున కివ్వబడుచున్నది ఈయధి కారమును ప్రజలకు సంతృప్తికరముగా నుండునట్లు ఉపయో గించుటకు బాధ్యతాయుత మంత్రివర్గమునకే సాధ్యమగును. అమెరికా ప్రెసిడెంటున కిట్టి యధికార మిచ్చుట అనర్థదా యకమగును. కనుక ఆదేశమం దిట్టివివరముల నన్నిటి కాం

గ్రెసే ప్రతిశాసనమందు లిఖించవలసి వచ్చుచుండుటచే శాస నవిర్మాణము మందగతి బొందుచున్నది.

విదేశవ్యవహారములందును అమెరికారాజ్యాంగపు పద్ధతుల కంటె బాధ్యతాయుత మంత్రివర్గమే అత్యుత్తమమైనది. శ్రీ ప్రెసిడెంటు విల్సనుగారు వర్సేల్సు సంధిపత్రముపై సంతక మొనర్చి తనదేశము వెళ్లగా ఆయనకు వ్యతిరేకమగు రిపబ్లికనుపార్టీవారికి లోబడియుండిన సెనెటుసభవారా సంధి పత్రమును నిరాకరించిరి. అందువలన అప్పటినుండి యిప్పటి వరకు నానాజాతిసమితియందు అమెరికా తనసభ్యత్వము నంగీకరింప జాలకున్నది. ఇట్టి విపరీతము మంత్రివర్గములున్న దేశములందు జరుగజాలదు. తమ ప్రజాప్రతినిధి సభ కయిష్టమగు సంధిపత్రమును ఏ మంత్రివర్గమును అంగీకరించదు. తుదకు మంత్రివర్గమువారిచే అంగీకరింపబడిన సంధిగాని ఒడంబడికగాని వారి ప్రజాప్రతినిధిసభవారిచే సాధారణముగా నంగీకరింపబడును. రాజ్యాంగ వ్యవహారములందు పెత్తనము జేయువారికి తమకు నచ్చిన యేర్పాటులు చేయుటకు తమకు హక్కు కలదనియు, అయ్యది తమప్రజాప్రతినిధిసభవారిచే అంగీకరింప బడుననియు, హామీ లేనిచో స్వతంత్రించి విదేశ వ్యవహారములందు కాలావసరములబట్టి పెత్తనము జేయుటకు సాహసముండదు.

అమెరికాయందు ఒకసారి యెన్నుకొనబడిన ప్రెసిడెంటు నాల్గువత్సరములవరకు పెత్తనమం దుంకును. ఆయన యొక్క రాజ్యాంగ కార్యక్రమ ప్రణాళిక ప్రజలయం దసంతృప్తి కల్గించినను, శాసనసభలందు మెజారిటీసభ్యులట్టి కార్య ప్రణాళికను నిరసించినను గూడ ఆతడు తన పదవియందు సుస్థిరుడై యుండును. ఇందువలన ప్రజాభిప్రాయములకు విరుద్ధమగు కాంగ్రెసున కయిష్టమగు రాజ్యాంగ పెత్తనము జరుగుచుండుట సాధ్యము. బాధ్యతాయుత మంత్రివర్గమును కల్గియున్న దేశములందు శాసనసభవారి యభిప్రాయ ప్రకారము రాజ్యము చేయని మంత్రివర్గము సత్వరముగనే పదభ్రష్టత జెందును. కాన ఏమంత్రివర్గమైనను శాసనసభవారి యాజ్ఞల పాలించువరకే పెత్తనమం దుండకలదు. ఒకవేళ ప్రజాభిప్రాయమును శాసనసభ ప్రకటించుట లేదనియు, తమ కార్య ప్రణాళికయే ప్రజలకు యిష్టమనియు, మంత్రివర్గమువారికి తోచుచో ఆప్రజాప్రతినిధిసభవారి సంత మొందించి నూతన సభను సమావేశ పరచుటకు (ఫ్రాన్సునందు తప్ప) మంత్రివర్గమువారికి అధికారము కలదు. కనుక ప్రజాభిప్రాయాను సారము ప్రజాప్రతినిధిసభకు యిష్టమగునట్టి మంత్రివర్గమే ఎప్పుడైనను పెత్తనమందుండుట మంత్రివర్గము గల్గిన దేశములందు సాధ్యము. స్విట్జర్లాండునందు మంత్రివర్గము అదివరకుస్థిరత బొందియున్నను ప్రజాప్రతినిధిసభవారి యాజ్ఞలనే అమలుపర

చుచుండును. గనుక ఇబ్బంది లేమియు కలుగజాలవు. అమెరికాయందట్లుగాక కాంగ్రెసువారి యాజ్ఞల లెక్కించక ప్రజాభిప్రాయమును నిరసించి వ్రేసి డెంటు రాజ్యాంగపు వ్యవహారముల నడపుటకు వీలుకలదు. కాన మొత్తముమీద బాధ్యతాయుత మంత్రివర్గము గల్గిన రాజ్యాంగములు స్విట్జర్లాండు రాజ్యాంగములే హెచ్చు సంతృప్తికరముగానున్నవి.

---

పదియవ ప్రకరణము.

## —: ప్రభుత్వోద్యోగులు :—

మంత్రులు చేయకల్గునది చేయవలసినదియెల్ల ప్రజాభిప్రాయమును, ప్రజాప్రతినిధిసభవారి యాజ్ఞలను, ప్రభుత్వోద్యోగులకు తెలియజెప్పి వారిచేత ప్రజాభీష్టములు నెరవేరుటకై వలయు కార్య నిర్వహణత చేయించుటయే. మంత్రులకు తమకప్పగించిన ప్రభుత్వశాఖల నెట్లు నడపుటో తెలిసియుండవలసిన యావశ్యకత యంతగా లేదు. ఒకవేళ ఏమంత్రియైనను, తన వశమందున్న డిపార్టుమెంటును నడపుజ్ఞానము సంపాదించ ప్రయత్నించినను, తనయుద్యోగకాలమందు ఆయనకుకల్గు జ్ఞానము ఆడిపార్టుమెంటుయొక్క ప్రధానోద్యోగియగు శెక్రటరీగారికుండు అనుభవమునకు సరిరాక పోవును. కనుక, తన కంటెను హెచ్చుగా డిపార్టుమెంటులోని యుద్యోగులచేత తగుకార్యముల చేయించుటలో హెచ్చుఅనుభవము, శక్తి, కల్గిన శెక్రటరీగారితో మంత్రి పోటీపడుట నిరుపయోగము. శెక్రటరీగారివలెనే, ఉద్యోగవ్యవహారముల నిర్వర్తించువారు కావలెనన్న మరొక సివిలుసర్వీసుసభ్యుని నియమించవచ్చును. మంత్రి అట్టిపనికైకాదు నియమింపబడుచున్నది. ఏయే సూత్రముల ననుసరించి, ఏయేకార్యముల సాధించి ఫలితము

సివిలుసర్వీసు లు వగైరాలు

లకల్గించుటకు డిపార్టుమెంటుయొక్క శక్తిసామర్థ్యముల నుప యోగించవలెనో, శక్రటరీకి తెల్పుటయే మంత్రియొక్క ధర్మము. తనయాజ్ఞల ప్రకారము తానుకోరిన ఫలితముల కల్గించుటకు డిపార్టుమెంటువారు తగు శ్రద్ధచేయుచున్నారో లేదో విచారించుచు తాను వాంఛించినటుల తమపార్టీ కార్య ప్రణాళిక సఫలతనొందుచున్నదో లేదో పరీక్షించుచుండు టయే మంత్రియొక్క ధర్మము.

డిపార్టుమెంటులోని యుద్యోగులును తమ శాఖవలన ఎట్టి మార్పులుకలుగవలెనో,తమచర్య లెట్లుండవలెనో,ఆచర్యలప ర్యవసాన మెట్లుండవలెనో నిర్ణయించుటకూడదు. మనదేశ మందిప్పటికి నాచారమైనట్లు సివిలుసర్వీసువారు తమకార్య నిర్వహణమున కేర్పరచబడిన జి. ఓ లన్నే ప్రేమించుచు, తమ తమడిపార్టుమెంటులవలన ఏయేకార్యము లెంతెంతవరకెట్లెట్లు పర్యవసానముల కల్గించవలెనో నిర్ణయించుట పాడికాదు. డిపార్టుమెంటులవలన కలుగవలసిన మార్పులెట్టివో నిర్ణయిం చుభారము మంత్రివర్గమందు కలదు. డిపార్టుమెంటువారు చేయవలసినదెల్ల మంత్రివర్గమువారి ఆజ్ఞలననుసరించి మంత్రి గారిసలహాలు, కోర్కెలు, ఆజ్ఞలను శిరసావహించి, వారు కోరిన సాంఘికోపయోగములు కల్గించుటకు తమశక్తియుక్తు లనెల్లను పరిపూర్ణముగా నుపయోగించుటే ! మంత్రిగారిచే వాంఛితమగు కార్యమును సాధించుటకు అగత్యమైన హెచ్చు

మంది యుద్యోగులసాయము కోరవచ్చు; అవసరమైనభవనములు తదితర సహాయములనపేక్షించవచ్చును. కాని, మంత్రిగారి కాంక్షితములే తమకు గమ్యస్థానములుగా గమనించి, ప్రజలందరి నొకేసంఘీయులుగా భావించి, తమవిధ్యుక్తధర్మమును సకాలమున నిర్వర్తించుట డిపార్టుమెంటునకు పాడి. డిపార్టుమెంటునందలి యుద్యోగులకు మంత్రిగారు కాంక్షించినమార్పులను కల్గించుటకు మంత్రిగారు సూచించినపద్ధతి కంటె సులభమగు, చౌకయగు లేక లాభకరమగు పద్ధతి, తమయనుభవరీత్యా తోచినయెడల దానిని మంత్రిగారికి సూచించునధికారము డిపార్టుమెంటు ఉద్యోగస్థులెల్లరకు కలదు. కాని ఆసూచనల నంగీకరించుటకు, లేక తిరస్కరించుటకు మంత్రికధికారముకలదు. తమకు మంత్రిగారిచే కాంక్షించబడిన మార్పు లయిష్టమైనను, మంత్రిగారిచే నంగీకరింపబడిన కార్యసాధకపద్ధతులు అసహ్యమైనను, మారుమాటాడక తమవ్యక్తిగత, లేక సమిష్టియిష్టాయిష్టముల మరచి స్వామిభక్తపరాయణతతో కొలువొనర్చుటయే డిపార్టుమెంటువారి విధికృత్యము.

డిపార్టుమెంటు యుద్యోగులకు రాచకీయ విభేదములు పట్టింపుకాకూడదు. తమతమ వోటులను తమ కిష్టమగు రాచకీయపక్షముల కొసంగవచ్చును. కాని తమ యుద్యోగధర్మనిర్వహణమందు పార్టీబుద్ధి నేమాత్రము కల్గియుండక నిష్పక్ష

పాత్రముగ సంపూర్ణ స్వామిభక్తిపరాయణతతో మంత్రుల యాజ్ఞల శిరసావహించి, మంత్రులవాంఛాసఫలత కల్గించుటయే తమ పరమధర్మమని యెంచి, తమ యుద్యోగశక్తుల నన్నిటి నుపయోగించుట సివిలుసర్వీసువారికి పాడియై యున్నది. కనుకనే ఇంగ్లాండునందలి సివిలుసర్వీసునందు హెచ్చుమంది ధనికులు, మధ్యతరగతిజాతులకు జెందినవారైనను, లేబరుపక్షము పెత్తనమందున్నప్పుడు భేదభావము లేక విశ్వాసముతో ఎప్పటియట్లుల ప్రభుత్వకార్యనిర్వహణా మొనర్చిరి. మన రాజధానియందును, వివిధడిపార్టుమెంటుల యందలి యుద్యోగులలో నధికసంఖ్యాకులు బ్రాహ్మణులైనను, బ్రాహ్మణేతరమంత్రివర్గములక్రింద నమ్మకముగా ఉద్యోగధర్మముల మన సివిలుసర్వీసువారు నిర్వహించిరి.

మంత్రివర్గము వారి ఆజ్ఞలకు శిరసావహించి యుద్యోగధర్మముల నెరవ డిపార్టుమెంటులు సమ్మతించినను యుద్యోగులు ప్రజలతో ప్రభుత్వవ్యవహారముల నెరపునెడల తమవారు, పెరవారను భేదభావము జూపెట్టుటకు చాల యవకాశముకలదు. ఇంగ్లాండునందలి డిపార్టుమెంటు లనేకములు బీదప్రజలతో ననేకవ్యవహారములం దనేకమారులు వ్యవహారము నడుపవలసియుండును. అట్టియెడ బీదవారు, అజ్ఞానులు, వేషభాషలందు మోటగువారునై యుండుటచే వారిని పైతరగతులకు జెందిన యుద్యోగులు పౌరులకు జూపెట్టతగు గౌర

వాదరముల ప్రకటింపజాలకున్నారు. ఇందువలన ఉద్యోగులు ప్రజలమాటలను పెడచెవినిబెట్టుటయు, ప్రజల బాధలన్న లెక్కించకుండుటయు, ప్రజల కోర్కెలన్న మూగభావము వహించుటయు, ప్రజావసరముల శ్రద్ధగా విచారింపకుండుటయు, అంత తమ కష్టనిష్ఠూరముల తెల్పుకొనవచ్చిన ప్రజలీపైతరగతులనుండి వచ్చు యుద్యోగుల జూచి, భయమంది, వచ్చినపనినే మరచుచుండుటయు తటస్థించుచున్నది. ఇదేవిధముగ మనదేశమందును, బ్రాహ్మణజాతి బ్రాహ్మణేతరులందు పైకులములనుండియే యుద్యోగులం దధికసంఖ్యాకులు నియమింపబడుచుండుటవలన ప్రజాసామాన్యము (పంచములాదిగాగల నిమ్నజాతులు, శూద్రులందలి బీదసాదలు) అధికారులవలన తగుఆదరము పొందకుండుట సర్వజనైకవేద్యము. ఈయిబ్బందిని తొలగించుటకై ఇతరదేశములందు లేబరుప్రజలుకూడ విద్యాబుద్ధుల గఱచి సివిలుసర్వీసునందు జేరుటకవకాశములు కల్పించవలసియున్నది. మనదేశమందు కమ్యునల్ జి. ఓ. అను ప్రభుత్వపుటార్డరుప్రకారము వివిధజాతులయొక్క విద్యాధికులు వరుసవారీగా ప్రభుత్వోద్యోగమునందు జేర్చుకొనబడుట శ్రేయోదాయకము.

ప్రభుత్వోద్యోగుల నేవిధముగ నేర్పాటుచేయుటయుత్తమమో విచారించవలసియున్నది. ప్రజాస్వామిక రాజ్యాంగమందు ప్రతియుద్యోగుని ప్రజలే యెన్నుకొనుచో ఉద్యో

గులెల్లరు ప్రజాభీష్టముల నెరవేర్ప నుద్యుక్తులయ్యెదరనియు, ప్రజలయందలి వివిధతరగతుల ప్రతినిధు లెన్నుకొనబడెదరు కాన వారందరియందు ఆయుద్యోగులు గౌరవాదరముల జూపెట్టెదరనియు పందొమ్మిదవ శతాబ్దారంభమందు అమెరికా దేశమున తలంపబడుచుండెను. కాని ఆదేశమునందువలె ప్రతి మూడు లేక నాల్గువత్సరములు కొకమారు వేలకొలది యుద్యోగుల నెన్నుకొనుట తుదకు ప్రజలకే నష్టదాయకమని వారి నాయకులే కన్గొనిరి. ఎవ్వరు ప్రభుత్వకార్యనిర్వహణమునకు తగుదురో, ఎవ్వ రెట్టియుద్యోగమున కర్హులో నిర్ణయించుటకు ప్రజాసామాన్యమునకు సాధ్యపడదు. మరియు వేలకొలది అభ్యర్థులు దేశముమొత్తముమీదను, పదులకొలది ప్రతిరాష్ట్రమందును ప్రభుత్వోద్యోగములకై జరుగు యెన్నికలందు నిలబడుటచే వారిలో నేకొలదిమందినో మాత్రము వోటరు లెరింగియుండుటవలన మిగతావారందరు ప్రజల యజ్ఞానమువలననే ఎన్నుకొనబడుచుండిరి. ఇందువలన క్రమముగా అధికారుల నెన్నుకొనుటకై గవర్నరులు, ప్రెసిడెంటు ఆదిగాగల ప్రధానాధికారుల నెన్నుకొనుటకై రాచకీయపక్షములపై ప్రజలు ఆధారపడవలసివచ్చెను. రాచకీయ పక్షములు తమ ప్రత్యేకలాభములనిమిత్తమై తమకు ప్రత్యేక సేవజేయ కంకణము గట్టుకొనినవారినే తమ అభ్యర్థులుగా బెట్టుటయు, గెల్చినవారు తమపార్టీలయాజ్ఞలప్రకారము తమ

ప్రభుత్వాధికారమునంతయు నుపయోగించ ప్రయత్నించు టయు, అందువలన ప్రజలకు అనేకసమయములందు మితిమించిన నష్టముకల్గుటయు అనుభవైకవేద్యము.

మరియు ప్రభుత్వ కార్యముల నిర్వహించవలెనన్న ఉద్యోగులకు తగు ననుభవ మగత్యము. తగిన చదువు సంధ్యలుండుటయే కాక యీ అనుభవముకూడ కల్గిన అభ్యర్థులు అమెరికాయందలి యిరుపక్షముల అభ్యర్థుల జాబితాలందు చాల కొలదిగా యుండుచుండిరి. తుదకు ఉద్యోగము బొంది, రెండుమూడు సంవత్సరములలో తగు అనుభవమును సంపాదించి ప్రభుత్వ కార్యముల సమర్థతతో గడపుశక్తి బొందు సమయమునకు తిరిగి యెన్నికలు వచ్చుటయు, తమ పార్టీల యభ్యర్థుల జాబితాలందు స్థానము బొందక కొందరును, తమ పార్టీ, ఎన్నికలందపజయమునందిన, అందరును, స్థానభ్రష్టత బొందుటయు జరుగుచుండెను. ఇటుల నెల్లప్పుడు, ప్రభుత్వోద్యోగానుభవము లేనివారు, అనేకులు ముఖ్యోద్యోగములకు మూడు లేక నాల్గువత్సరముల కొకసారు వచ్చుచుండుటచే, ప్రభుత్వవ్యవహారములు సక్రమముగా, సమర్థతతో సంతృప్తికరముగా నడుపుట కసాధ్యమగుచుండెను. ఈరహస్యము కన్గొనుటవలననే అమెరికావారి సంస్కారవాదులు, అనేకరాష్ట్రములందు ప్రభుత్వోద్యోగులు, శాశ్వతముగా న్యాయరీత్యా ప్రవర్తించువరకు తమ ఉద్యోగములందుండుటకై తగు యేర్పాటుల జేయించుచున్నారు. కాని

యిప్పటికిని కేంద్రప్రభుత్వము కొన్నివందలమంది యుద్యోగులను, అనేక రాష్ట్రీయప్రభుత్వములు మఱికొన్నివందలమందిని ఎన్నికలద్వారాగాని, పార్టీనియామకముద్వారాగాని నిర్ణయించుచున్నవి.

ఎన్నికలపద్ధతిప్రకారము ప్రజలయందలి అన్ని భాగములవారి ప్రతినిధులు యుద్యోగములబొందుట సాధ్యమగును.

ఎన్నికలపద్ధతి ఆచరణయోగ్యము కాకున్నను, కార్యనిర్వాహకవర్గము (ప్రెసిడెంటు అమెరికా సమ్మేళనమందు, గవర్నరులు రాష్ట్రములందు, మంత్రివర్గములు తదితరప్రజాస్వామిక రాజ్యాంగములందు, రాజులు లేక డిక్టేటరులు తదితర దేశములందు) తనకు నచ్చినవారిని యుద్యోగులుగా నిర్ణయించుట లాభకరముగాదా? ఇప్పటికి డెబ్బదివత్సరములవరకు (1854, సివిలుసర్వీసునకు పోటీపరీక్షలు ప్రారంభమయ్యెను. 1870 లో అన్ని సర్వీసులకు ఉద్యోగులు పోటీపరీక్షలో గెలుపొందినవారై యుండవలసివచ్చెను.)ఇంగ్లాండునందు రాజుగారి యిష్టముపై, మంత్రులు, తమకు నచ్చినవారిని ప్రభుత్వోద్యోగులుగా నియమించుటయే ఆచారమైయుండెను. ఈ పద్ధతి వలన అనేకమంత్రులు, తమ కిష్టులు బంధువులు నగువారిని ఉద్యోగులుగా నియమించుచుండుటయు, ఉద్యోగములందు జేరదలచుకొన్నవారు లంచములనిచ్చుకొనవలసియుండుటయు జరుగుచుండెను. రక్షణదళముల జేరుటకుగాను శ్రీ విల్లిం

ర్టను ద్వారకుగా రాకపూర్వు కొన్ని వేలరూప్యములు లంచ మివ్వవలసియుండెను. ఇదేపద్ధతి అన్నిదేశములందును (చైనా యందుతప్ప) ప్రచారమందుండెను. ఈ పద్ధతివలన ధనికులును, భూస్వాములునైనవారి యువకులే ప్రభుత్వోద్యోగము లందు జేరుటకు, ఎల్లదేశములందును సాధ్యమయ్యెడిది. భారతదేశమందు బ్రాహ్మణులకే అట్టియవకాశము కల్గుచుండెను. ఈవిధముగా నియమింపబడిన యుద్యోగులు, తమపదవుల కర్తవ్యులు కారనియు, వారివలన నడుపబడు ప్రభుత్వము హెచ్చుశక్తివంతము కాజాలదనియు, క్రీ॥శ॥ 1870 సంవత్సరమువరకు బ్రిటిషువారి సివిలుసర్వీసుయొక్క చారిత్రనుగమనించినవారికి తెలియనగును. రక్షణశిస్తులను క్రీ॥శ॥ 1815 సంవత్సరమువరకు బ్రిటిషుప్రభుత్వము, దిగుమతివస్తువులపై వేయుచుండ, వానిని సక్రమముగా వసూలుచేయుటకు సివిలుసర్వీసు శక్తివంతముకాదాయెను. అనాధరక్షణాలయముల నడపుటకు ప్రభుత్వోద్యోగులు అసమర్థులైయుండిరి. ఆదాయపుపన్నుల వేయుటకు సివిలుసర్వీసువారి అసమర్థత యొకఅడ్డంకుగా నుండెను. ప్రభుత్వమే వాణిజ్యముల నడపుటకు పూనుకొనజాలదాయెను.

కాని, పోటీపరీక్షాపద్ధతిప్రకారము, జాతిభేదములు లేకుండా సమర్థులగువారును, విద్యాబుద్ధుల గరచినవారును, తెల్వితేటలు కల్గినవారును, ఉద్యోగులుగా నిర్ణయింపబడుట్యు,

ఇంగ్లాండునందు క్రీ॥ శ॥ 1854 సంవత్సరమందే సూత్రప్రాయముగా నొప్పుకొనబడినను, 1870 సంవత్సరమువఱకుగాని, అన్ని సర్వీసులకు నీపద్ధతి నవలంబించబడ లేదు. అప్పటినుండి ప్రభుత్వపు అన్ని శాఖలకు వలయునుద్యోగులను పోటీపరీక్షలద్వారాయే నియమించుచున్నారు. అప్పటినుండి ప్రభుత్వపు డిపార్టుమెంటులు, అనేకప్రధానకార్యములను నిర్వహించుటకు పూనుకొనినను, చాల జయప్రదముగా తమ ధర్మమును నిర్వర్తింపజాలుచున్నవి. ఇందులకు పూర్వము మంత్రుల యిష్టానుసారముగా నియమింపబడిన యుద్యోగులు ఎందుకుపనికిరానివారై యుండుటయు, పోటీపరీక్షలు వచ్చినపిమ్మట, ఉద్యోగులెల్లరు క్రమక్రమముగా సమర్థులగుచుండుట యు ముఖ్యకారణములు.

ఈ పోటీపరీక్షాపద్ధతినే, జర్మనీ, ఫ్రాన్సు, అమెరికా యుం దనేకరాష్ట్రాదులు, దక్షిణాఫ్రికా, కెనడా, ఆస్ట్రేలియా, న్యూజిలాండు, ఐర్లాండు దేశములు నవలంబించుచున్నవి. ఈపద్ధతిప్రకారము, నిర్ణయింపబడిన పరీక్షలందు అభ్యర్థులెల్లరు పాలుపుచ్చుకొనగా ఎవ్వరికి అత్యుత్తమమగుస్థానము దక్కునో వారిలో ఎందరు అవసరమున్న అందరిని వరుసవారీగా ఉద్యోగులుగా నిర్ణయించుదురు. ఉద్యోగములందును వివిధతరగతులుండును గనుక, ఒక్కొక్కతరగతికి దాని యాధిక్యత ననుసరించి, తగునట్టి పరీక్షలనే నడపుటకలదు.

అధమతరగతిగుమాస్తాలకొకపరీక్ష, మధ్యమతరగతిగుమాస్తాలకు మరొకటి, ఉత్తమతరగతిగుమాస్తాలకు పెద్దది, ఉద్యోగులలోను, చిన్నయుద్యోగుల కొకటి, పెద్దయుద్యోగుల కింకొకటి యేర్పరతురు. పరీక్షతరగతి హెచ్చుకొలది, ప్రశ్నలును కష్టమైనవగును. ఇవ్వవలసినసమాధానములు హెచ్చు శక్తిపంతములుగనుండవలెను. మన మద్రాసునందలి సెక్రటేరియటులో, జూనియరుగుమాస్తాలకొకటి, సీనియరుగుమాస్తాలకు మరింకొకపరీక్ష కలవు. క్రమముగా డిప్యూటీమాజిస్ట్రేటు, పోలీసు, అబ్కారీ సబుఇనస్పెక్టరులకు ఒకటి, సబురిజిస్ట్రారు, సర్వే సబుడిప్యూటీ డైరెక్టరు, విద్యావిషయక సబుడిప్యూటీ డైరెక్టరు, కో-ఆపరేటివు సబుడిప్యూటీ డైరెక్టరు వగైరాలకు మరొకపరీక్ష ఏర్పరచబడవచ్చును. ఇప్పటికే ఇండియను సివిలుసర్వీసునకు, ఆర్థికసర్వీసునకు, అడిటుసర్వీసునకు పోటీ పరీక్షలు ఢిల్లీయందు జరుపబడుచున్నవి. చిన్నయుద్యోగములందున్నవారు, క్రమముగా ఉన్నతోద్యోగపుపరీక్షలం దుత్తీర్ణతజెంది, పెద్దయుద్యోగములబొందుటకు అవకాశముబొందవగును.

ఇట్టి పరీక్షల నడపువారు మంత్రులే యగుచో పక్షపాతపు చర్య లనేకము జరుపబడునేమో యనుసందియము కలదు. మరియు వీనిని జాగ్రత్తగా నడపుటకు తగు వ్యవధి మంత్రివర్గమువారికి కలుగదు. మంత్రులు చేయదగునదియెల్ల

ఎట్టి నియమముల ననుసరించి ఈ పరీక్షలు నడుపబడవలయునో నిర్ణయించుటయే. ఒకమారొక పరీక్షయందు త్తీర్ణత జెంది ఉద్యోగము బొందినవారు తగిన వ్యవధి మించినపిమ్మట పెద్దయుద్యోగము పొందవలెనన్న ఎట్టి పరీక్షలందు త్తీర్ణత బొందవలెనో, హెచ్చు జీతము బొందుట కెప్పు డర్హత బొందుదురో మంత్రివర్గమువారే నిర్ణయించవలెను. అత్యున్నతమగునట్టియు, స్వతంత్రాలోచనాశక్తిని కోరు ప్రత్యేకోద్యోగములకు మాత్రము సివిలు సర్వీసునందలి ప్రధానోద్యోగులలో జేరినవైనను, తన యిష్టవచ్చినట్లు ఆయా డిపార్టుమెంటుల సెక్రటరీల సమ్మతితో మంత్రివర్గమువారు నియమించనగును.

మంత్రివర్గము వారిచే నిర్ణీతమైన నియమముల ననుసరించి పోటీపరీక్షల నడపి, ఉద్యోగార్హత బొందినవారిని నిర్ణయించుటకు ప్రతిదేశమందును "పబ్లికు సర్వీసు కమీషను" లేక "సివిలు సర్వీసు కమీషను" అనుసంఘము లేర్పరచబడుచున్నవి. ఈ కమీషనుయొక్క సభ్యులు ఇంగ్లాండునందువలె జీవితాంతమువరకు, సద్గుణులై యుండునంతవరకు, నియమింపబడుచున్నారు. మనదేశమునందు నిట్టి కేంద్రప్రభుత్వమునందేగాక రాష్ట్రీయ రాజ్యాంగములందును ఈపబ్లికు సర్వీసు కమీషనులు" ఏర్పరచబడుచున్నవి. వీనిసభ్యులను పదభ్రష్టులచేయుటకు శాసనసభలకు మాత్రమే యధికారముకలదు. వీరిపై మంత్రివర్గమువారికి పెత్తనము కలుగజాలదు. న్యాయ

మూర్తులవలె నిష్పక్షపాతముగ ప్రభుత్వపు నియమనములప్రకారము పోటీపరీక్షల జరిపి ఉద్యోగార్హులైన వారిని నిర్ణయించుటయే యీ కమీషనుయొక్క ప్రధానధర్మము. ఉద్యోగులలో నేరిపైన పైయుద్యోగులు అక్రమముగా డిస్మిసు చేయ ప్రయత్నించినగాని, వారి ప్రమోషనును ఆపినగాని, న్యాయాన్యాయముల విచారించుటకు ఈ కమీషనువారి కధికారము క్రమముగా నివ్వబడుచున్నది.

ఇదివరకె పేర్కొనబడినట్లు ఎట్టిపరీక్ష లెట్టిసూత్రముల ననుసరించి ఈకమీషను నడుపవలయునో మంత్రివర్గమువారే నిర్ణయించవలెనుగదా! ఈ నియమనములను నిర్ణయించుటలో మంత్రివర్గము కొన్నివిషయములను గమనించవలయును. ఏయేయుద్యోగముల కేర్పరచబడిన పరీక్షల కెట్టి నియమనముల నేర్పరచిన, హెచ్చుమంది జనసమూహముల యొక్క యువకులకు, పరీక్ష కభ్యర్థులుగావచ్చి జయమందుట కవకాశముండునో విచారించి, అట్టినియమనములనె యేర్పరచుటమేలు. అనగా తాలూకాగుమాస్తాలుగా నుండుటకు బి. ఏ. పరీక్ష నిచ్చినవారే యవసరమగుచో బ్రాహ్మణేతరులకు అవకాశముండదు. కలెక్టరెటు గుమాస్తాలకు బి ఏ. (ఆనర్సు) వారే అవసరమైన బ్రాహ్మణేతరుల కసలే యవకాశము చిక్కదు. అటులనె పోలీసు సబుయినస్పెక్టరులకు బి. ఏ., వారే కావలెనన్నచో బ్రాహ్మణేతరులు వెలుపల నుండవల

సినదే ! కాబట్టి సాధ్యమైనంతవరకు ఆయా యుద్యోగములందుండువారు నిర్వహించవలసిన కార్యభారము మదినెంచి అందుకు తగినట్టి విద్యాశిక్షణమునుగాని, అంతకంటె కొంచెము తక్కువ తరగతికి జెందిన శిక్షణమునుగాని, అభ్యర్థులు కల్గి యుండవలెనని నిర్ణయించుట అన్నిజాతులవారి యభ్యర్థులకు సహాయభూతముగా నుండును. పోటీపరీక్షయొక్క తరగతి ఉద్యోగమునకు కొంచెము తక్కువగుచో ఎన్నుకొనబడిన అభ్యర్థులకు, "తరిబీయతు శిక్షణమును" ప్రభుత్వపు ఖర్చుపై నిచ్చుట మంచిది. అట్లిదే కాని, ప్రభుత్వపు కార్యనిర్వహణమునకు సరిపోయినవారిని అంతకు మించినవారినే నియమించబూనుకొనుచో అనేక బీదసాదలును సాంఘికముగ దీనులునైనవారి బిడ్డలకు ప్రభుత్వోద్యోగములందు జేరుటకు అవకాశము కలుగదు. ప్రజాస్వామ్యము జయమొందవలెనన్న సివిలు సర్వీసువారు సమర్థులై యుండుటయు, సివిలు సర్వీసునందు ప్రజాసంఘముయొక్క వివిధభాగములకు తగిన ప్రాతినిధ్యము చేకూరుటయు యత్యంతావసరము. పోటీపరీక్షలందు త్తీర్ణులు కాగల్గినవారిని తయారుచేయుటకు బీదసాదలకు దీనజనులకు పతితులకు నెంతో కష్టము. కాన ఆ పరీక్షల తరగతి కొంచెము తగ్గించియైన వారికి సహాయమొనర్చి మిగతా తరగతి శిక్షణ ఆయభ్యర్థులు పొందుటకై ప్రభుత్వమే బాధ్యతవహించుట శ్రేయము. ఈ పద్ధతి మద్రాసురాష్ట్రమందు

మాత్రము శాస్త్రీయముగా నేర్పరుపబడినది. ఇతరరాష్ట్రిము లం దింకను యేర్పడలేదు. ఫ్రాన్సు, జర్మనీ, ఇంగ్లాండులం దింక నీవిధానము అంగీకరింప బడలేదు. కనుకనే కార్మికుల మధ్య ప్రభుత్వోద్యోగులన్న అత్యంత అసంతృప్తికలదు.

ఇట్టిప్రత్యేకపు సర్వ జాతివాక్కులను, ఉద్యోగుల నేర్ప రచుటయందు భద్రపరచుట యెంత ముఖ్యమో, రక్షణాదళము లగురించి విచారించుచో తెలియుసగును. మనదేశమం దిప్పటి వరకు మహామ్మదీయులు, సిక్కులు, నేపాలు, భూపాలుదేశ స్థుల ఉత్తరాదిహిందువులె హెచ్చుగా చేరియున్నారు. ఇందు వలన ఆజాతీయులే యుద్ధ కార్యనిపుణులనియు, దక్షిణా త్యులు, సాధారణ హిందువులు, అసమర్థులనియు తలంపబడు చున్నది. వివిధమతములు, జాతులు కల్గిన మనదేశమందు స్వరాజ్యలబ్ధి యైనపిమ్మట శాంతి నెలకొల్పవలెనన్న అన్ని జాతులకు, అన్ని మతములకు, అన్ని భాగములకు జెందినవారు తగురీతి రక్షణాదళములందు జేర కల్గుట చేరుట అత్యావసరము. ఇందులకై తగిన శ్రద్ధ యిప్పటినుండె ప్రభుత్వము గన్పరచి దక్షిణాత్యులకు రక్షణాదళములం దుద్యోగములను విరివిగా యిచ్చుటకు పూనుకొనవలెను.

అన్నిజాతుల ప్రజలయొక్క యువకులు యువతీమ ణులు ప్రభుత్వోద్యోగములందు జేరగలుగు నవకాశము లుం డవలయునన్న ఎట్టి జీతముల చెల్లించవలసియుండునో ఆలో

చింపవలెను. ఇప్పుడు మన దేశమందు ఉన్నతోద్యోగులకు, ఇండియను సివిలుసర్వీసు ఆదిగాగల యుద్యోగులకు చెల్లించు జీతములు నిలిపివేయబడియున్నవి. మన ప్రజల ఆర్థిక స్థితిగతులకు మించిపోయియున్నవి. ప్రజలకు సేవచేయవలసిన యుద్యోగులు ఆ ప్రజల స్థితికి సాధ్యమగు జీతముల కోరుటయే శ్లాఘ్యము. మరియు ప్రభుత్వోద్యోగేతర జీవితమందు విద్యాధికులకు ఎట్టి జీవనాధారము కలుగుచున్నదో విచారించి అట్టి జీతభత్యములకంటె అంతగా మించకుండు జీతములను ప్రభుత్వోద్యోగులకు చెల్లించుట న్యాయము. కనుక యిప్పటి మన యున్నతోద్యోగుల జీతములు చాల హెచ్చుగానున్నవి. కాని కలెక్టరాఫీసు గుమాస్తాలవరకుండు చిన్న గుమాస్తాలకు, రైలు స్టేషనుమాస్టరులవరకుండు గాంగివర్గ్గరా యుద్యోగులకు, పోలీసు జవానులు, హెడ్డుకానిస్టేబులున్ను, ఆదిగాగల చిన్నయుద్యోగులకిప్పుడు చెల్లించు జీవనభృతి చాల తక్కువగాయున్నది. కాన, పైవారి జీతము తగ్గించి, క్రిందివారి జీతము కొంతవరకు హెచ్చించుట యుత్తమము. మధ్యమతరగతి యుద్యోగుల జీతములు కొలదిగా తగ్గించుట కవకాశమున్నదని చెప్పవచ్చును.

కాని, కాంగ్రెసువారు ప్రచారముచేయుచున్నట్లు ఐదు వందల రూపాయిలకంటె నేయుద్యోగునిజీతము మించరాదనుట న్యాయముకాదు. మనమెంత యున్నతాదర్శముల గల్గి

యున్నను, మనయుద్యోగులెల్లరు తమ వాంఛల క్లుప్తపరచుకొను తత్వముకల్గియుండరు. తమతోడివారు వ్యాపారములందు (ఇకముందు యీయవకాశము మరి హెచ్చగును) నెలకు వేయి రెండు వేలవరకు సంపాదించుకొనుచుండ, అత్యంతముగు భాగ్య భోగములందు తులతూగుచుండ తాము ఐమువందల రూప్యములతో జీవించుట ఎందరికో కష్టంపుగానుండును; అసాధ్యమగును. ఇందువలన అత్యంతముగా తెలివి తేటలుగల వారు ప్రభుత్వోద్యోగములకై రాకుండుటగాని వచ్చినవారు లంచగొండులగుటగాని తటస్థించును. ఇప్పటికి ఇండియాదేశపు సర్వీసులందు రాష్ట్రీయసర్వీసులందు లంచగొండితనము ఎచ్చటనో అరుదుగా తప్ప తలయెత్తజాలకున్నది. ఐనను వ్యాపారస్థులు చెల్లించగల్గినంత పెద్దజీతములను చెల్లించుటకు మనదేశపు ప్రభుత్వమునకు శక్తిచాలదు. పైగా చెల్లించుట అనగత్యము కూడ. ప్రభుత్వోద్యోగమన్న ఫ్రాన్సు, ఇంగ్లాండు, జర్మనీలందువలెనే మనదేశమందును గొప్పప్రతిష్ట కలదు. ప్రభుత్వసేవ జేయుట ఎందరో యుత్తములకు యిష్టముకూడను. కనుక నెలకు వెయ్యిరూపాయలకు మించకుండా నుండు జీతములు పెద్దయుద్యోగులకు చెల్లింప నొప్పుకొనుట శుభప్రదము, లాభకరము.

జర్మనీయందు జీవితాధారమునకు తగినంత జీతము సివిలుసర్వీసువారికి తదితరప్రభుత్వోద్యోగులకు యివ్వబడు

చున్నది. బ్రిటిషువారి ప్రజాస్వామిక దేశములం దన్నిటి యందిట్టి పరిస్థితులే కలవు. ఇందువలన ప్రభుత్వోద్యోగులు తమధర్మనిర్వహణమందు శ్రద్ధవహించుచు తమతమ సర్వీసులయొక్క ఘనతకై పాటుపడుచు దేశసేవచేయుచున్నారు.

కాని ఫ్రాన్సునందు అన్ని సర్వీసులందును చాలాతక్కువజీతములు చెల్లింపబడుచున్నవి. ఇందువలన మేధావంతులనేకులు ప్రభుత్వోద్యోగమునకు గలప్రతిష్ఠకొరకై ప్రభుత్వపు సర్వీసులందు జేరుచున్నను లంచగొండితనమునకు చాలవరకు పాల్పడవలసివచ్చుచున్నది. మరియు బ్రిటిషువారి రాజ్యాంగములందు రక్షణాదళములందలి యుద్యోగులకు జీవితాధారమునకు సరియగు జీతములె చెల్లింపబడుట లేదు. వారికి సరియగు దుస్తులను కొనుటకే వారిజీతములు చాలకున్నవి. వారికి సరియగు శిక్షణబొందుట కెంతో ధనమును, జీవితమును సలక్షణముగా జరుపుకొనుటకు కొంత ధనము నగత్యమగుటచే ధనికుల బిడ్డలె యీయుద్యోగములందు జేరుటకు సాధ్యమగుచున్నది. ఫ్రాన్సునందును ఈ బ్రిటిషురాజ్యములందును, భారతదేశమందును సివిలు సర్వీసు రక్షణసర్వీసులందును ఈకారణములవలననె ధనికులు జమీందారుల బిడ్డలకె ముఖ్యోద్యోగముల బొందకల్గిన యవకాశము కల్గుచున్నది. ఇదిచాలదుర్ణయము కనుక ఇట్టి సర్వీసులందు జేరువారందరికి జీవితాధారమునకు సరియగు జీత-

భత్యముల చెల్లించుట అన్నిదేశములందును అగత్యము. రక్షణాదళములకు వలయు ప్రాథమిక తరబీయతునుండియు అగు ఖర్చులను ప్రభుత్వమే భరించవలయును.

పోటీపరీక్షలందు అభ్యర్థులు ఏయేవిషయములగురించి తగుసమాధానములను తెలుపవలయునో జాగ్రత్తగా నిర్ణయించవలెను. ఇప్పటివరకు దేశచరిత్ర, ఆర్థికశాస్త్రము, భౌతికశాస్త్రములు, గణితక్షేత్రీయగణితములు, సాహిత్యముల గురించియె ప్రశ్నలు వేయుట కలదు. వీనికితోడు సాంఘికశాస్త్రము, మనశ్శాస్త్రము, ప్రపంచచరిత్ర, నానామత సాధారణసూత్రములగురించికూడ ప్రతిఅభ్యర్థియు తగినంతజ్ఞానమూ పొందయుండు టగత్యము. ఈదినములందు నానాజాతిసామరస్యము ప్రపంచమందంతట కల్గించవలసియున్నదిగనుక ప్రపంచచరిత్ర మతముల ప్రాధాన్యసూత్రముల గురించి తగుపాటి జ్ఞానమును ప్రతిప్రభుత్వోద్యోగియు పొందవలెను. వివిధడిపార్టుమెంటులకు ప్రత్యేకముగా వలయుశిక్షణను ప్రభుత్వమే ఆయా యుద్యోగుల కిచ్చుట సాధారణమై యున్నది.

కాని అనాగరిక, ఆదిమ, దీనజనుల రక్షణమొనర్చవలసిన భారతప్రభుత్వము, బ్రిటిషుప్రభుత్వము, ఫ్రెంచి, ఇటలీ, బెల్జియము ప్రభుత్వములు అట్టి నిమ్నజాతులకు సంబంధించినట్టి ఉద్యోగములందుండు వారికి "జాతులసృష్టి," "సంఘనిర్మాణశాస్త్రము" ఆదిమసంఘముల కట్టుబాటులు

మనశ్శాస్త్రములందు ప్రత్యేకశిక్షణ కల్గించు టగత్యము. కానిచో సివిలుసర్వీసువారు ఆఫ్రికాలోని నీగ్రోల నెట్లు పాలించవలెనో మన అడవిజాతుల కెట్లు సాహాయమొసర్చ వలెనో ఎరుగక ఆయా ప్రజలసాంఘిక, ఆర్థిక సాంప్రదాయముల వృద్ధిపరచుటకు మారు క్షీణతబొందించెదరు.

ప్రభుత్వమే రైల్వేలను, గనులను, మిల్లులను సంపాదించి వానినినడుప బ్రయత్నించుట వివిధదేశములందు హెచ్చుచున్నది. మనదేశమందు రైల్వేలు, ఆస్ట్రేలియాయందు రైల్వేలు, జర్మనీ, ఫ్రాన్సునందు రైల్వేలు, కాల్వలు మనదేశము, ఆస్ట్రేలియా, ఫ్రాన్సు, జర్మనీ ఆదిగాగల అన్ని దేశములందును అడవులు, మనదేశమందు కొన్నిమిల్లులు మత్స్యములవ్యాపారము, గంజాయి, ఉప్పునిర్మాణము, ఫ్రాన్సునందు పొగాకువ్యాపారము ప్రభుత్వములచే నడపబడుచున్నవి. ఇందులకై వేలకొలది యుద్యోగు లగత్యము. వీరందరు ఎట్టిశిక్షణపొందవలయునో నిర్ణయించుటకు కొన్ని సూత్రములను మంత్రివర్గమువారు నిరూపించవలసియున్నది. ఆసూత్రముల నమలులోపెట్టుటకు సాధారణమగు పబ్లికు సర్వీసు కమీషనులకు బదులు వ్యాపారముల యనుభవము కల్గిన పెద్దలచే నిండిన "ప్రత్యేకఆర్థిక సర్వీసుకమీషనుల" నేర్పరచుట యుత్తమము. ఈరెండుకమీషనులకు సమానమగు వ్యవహారముల నెట్లు ఎవ్వరు నిర్ణయించవలెనో మంత్రివర్గమువారు తేల్చవచ్చును.

ఆర్థికసంక్షోభములు తఱచుగా కల్గుచుండు యీదిన ములందు తినుబండారములు జీవితాధారమున కగత్యముగు వస్తువుల ధరలు హెచ్చుటయో తగ్గుటయో తరచు కల్గుచుండును. ఈహెచ్చుతగ్గుల ననుసరించి ప్రభుత్వోద్యోగుల జీతభత్యముల గూడ మార్చుట యవసరము. కాని మాటి మాటికి యీమార్పుల జేయుటకు మూరు పదివత్సరముల కొకమారెట్టి మార్పులగత్యమో విచారించు నేర్పాటులు చేసి అత్యధికమును, విపరీతము నగు మార్పు లకస్మాత్తుగా కల్గుచో తగుపరిహార మేర్పరచుట కవకాశముకల్గించుట లాభ కరము కాని, వారి నెలజీతములు భత్యములపై కొలువునకు "ప్రభుత్వార్థిక వ్యాపారము" లందు జేరువారి జీతభత్య ములు ఎప్పటి కప్పుడు జీవనఖర్చుల హెచ్చుతగ్గుల ననుస రించి మార్చుచుండుటకు అవకాశములు కల్గించవలెను.

ప్రభుత్వోద్యోగులు తమసాముదాయిక హక్కుల రక్షించుకొనుటకై తమ యభ్యుదయము వృద్ధిపరచుకొనుట కై తమ "ట్రేడుయూనియనుల" నేర్పరచుకొను హక్కుబొం దియుండవలెను. ఈహక్కు ఎల్లదేశములందివ్వబడుచున్నది. ఈట్రేడుయూనియనులద్వారా సివిలుసర్వీసువారు తమకష్ట నిష్టూరముల ప్రభుత్వమునకు తెల్పుటకు తమజీతభత్యము లందు వలయు మార్పుల కోరుటకు అవకాశము కల్గును. ప్రజలందరిక్షేమార్థమై ప్రభుత్వము నడువవలసియున్నది.

గాన, ప్రభుత్వోద్యోగులకు 'సమ్మెకట్టు' నధికారము మాత్రి మొసంగరాదని ఎల్లరియభిప్రాయమైయున్నది. కాని ప్రభుత్వమునకు సర్వీసుల వారికి తీవ్రమగు భేదాభిప్రాయములు కల్గుచో వాని దీర్చుటకు నానాజాతిసభ వారి, నానాజాతి లేబరుఆఫీసు వారికి హక్కు నిచ్చుట శ్రేయము. ఆమార్పు నకు ఇప్పటిప్రభుత్వము లొప్పుకొనువరకు ప్రజాప్రతినిధి సభ వారి స్థాయి సంఘమువారియొక్కయు, సర్వీసుల ప్రతినిధుల యొక్కయు సమ్మేళనసంఘమందు, అవివాదగ్రస్థమగు విష యముల తేల్చుకొనన బ్రయత్నించనగును. ఇట్టి వివాదకా రణముల తగ్గించుటకై, ప్రభుత్వము కార్మికులమధ్య సామ రస్యమేర్పరుటకై ప్రతి "ప్రభుత్వపరిపాలిత వాణిజ్యము" మును ఆవాణిజ్యమును పాలించుటలో కార్మికులయొక్క సం పూర్ణసహకారము బొందుట లాభకరము.

ప్రభుత్వోద్యోగులకు వోటుహక్కు యిచ్చుట అనవ సరము. ఉద్యోగముల జేసి జీవించు ప్రజలెల్లరకు వోటు హక్కు ప్రసాదించబడుచుండునప్పుడు ప్రభుత్వపుకొలువు నందున్నవారికి మాత్రము ఆహక్కు యివ్వవలదా? కనుకనే జర్మనీయందు రక్షణదళములందలి యుద్యోగులు, కూలీలు ఆదిగాగలవారెల్లరికి వోటుహక్కు యిచ్చుటయేకాక ఎన్నిక లందు తమవోటులనిచ్చుటకు నావకాశమిచ్చు నేర్పాటు లును కలవు. ఈమధ్యజరిగిన జర్మనుదేశపు ప్రెసిడెంటు

యొన్నికలలో సముద్రముపైనున్న స్టీమరులయందలి కొందరు వాణిజ్యోద్యోగులు తమవోటులను ప్రత్యేకముగా తంతిద్వారా పంపించి పిమ్మట వోటింగుకాగితముల పోస్టుద్వారా పంపించిరి.

ప్రభుత్వోద్యోగులు ప్రజాప్రతినిధిసభయందుగాని సెనెటుసభ యందుగాని సభ్యులుగానుండుటకు వీలులేదను నియమ మన్ని దేశములందును కలదు. మంత్రివర్గసభ్యులు అమెరికా దేశమునందు తప్ప మిగతా ప్రజాస్వామిక రాజ్యాంగములందు శాసనసభలయందు సభ్యులైయుందురు. కాని శాశ్వతముగా ప్రభుత్వోద్యోగములందు జేరి, సర్వీసులలో చేర్చబడినవారెవ్వరు శాసనసభలందు సభ్యులై యుండరాదు. ఇంగ్లాండునందు కొందరు ప్రభువులు ప్రభువుల సభాసభ్యులై యున్నను ప్రభుత్వోద్యోగములందుండువరకు (అనగా రాజప్రతినిధులుగానుండువారు కూడను) తమసభ్యత్వపు హక్కులనుపయోగించుకొనరాదు. ఇందులకు కారణము ఎవ్వరు మంత్రివర్గపు టాజ్ఞల శిరసావహించి ప్రభుత్వ కార్యముల నెరపవలసియున్నారో వారు శాసనసభలయందు జేరి తమ అధిపతుల పెత్తనమును విమర్శించుచు మంత్రివర్గపు కార్యప్రణాళికలనుజీల్చి చెండాడుటకును లేక తమకిష్టులగు మంత్రివర్గముల భూషించుటకును అవకాశముకల్గును అందువలన ప్రభుత్వోద్యోగు లందు తీవ్రతరమగు రాచకీయపక్ష విభేద

ములు ప్రబలుటయు, తన్మూలమున ఒక భాగము మరొక భాగముతోడను, ఒక భాగము మరొకపక్షపు మంత్రివర్గము తోడను సహాయనిరాకరణ మొనర్చుట తటస్థించును. అట్టి దుర్గతి రాజ్యాంగశాంత్యభివృద్ధికి హానికరమగును.

ఇంగ్లాండునందు పదునేడవశతాబ్దాంతమువరకు ప్రభుత్వోద్యోగు లనేకులకు కామన్సుసభయందును ప్రభువులసభయందును సభ్యత్వములుండుటచే మూడవజార్జిప్రభువు పార్లమెంటునందలి మెజారిటీపార్టీని ధిక్కరించుచు, సభ్యులగు నుద్యోగులను తనయిష్టమువచ్చి నట్లుపయోగించుచుండెను. అనగా మనదేశమందెట్లు ప్రతిశాసనసభయందును "ఉద్యోగులముఠా" యున్నదో అటులనే ఆకాలమందు కామన్సుసభలో "ఉద్యోగులముఠా" యుండెడిది. ఇచ్చటివలెనే అప్పుడచ్చటనీ "అధికారులముఠా" వారు రాజుగారు కోరినట్లు వోటుచేయుచుండెడివారు. ఈపద్ధతి ప్రజాప్రతినిధుల ఆధిపత్యమునకు విరుద్ధమగుటచే లిబరలుపార్టీవారును వారినాయకుడగు శ్రీఎడ్మండుబర్కుగారును తీవ్రముగా విమర్శించి తుదకు క్రీ॥ శ॥ 1707 నందు క్రొత్త శాసనముద్వారా ప్రభుత్వోద్యోగు లెవ్వరు శాసనసభాసభ్యులై యుండరాదని నిర్ణయించిరి.

ఈ దినములందు ప్రభుత్వము అనేక వాణిజ్యములను స్వాయముగా నడపుచుండుటచే వానియందు కొలువొనర్చు కార్మికులు, గుమాస్తాలు వేలకొలది కలరు. వారికిగూడ నిట్టి సూత్రమే యనువర్తించునా కాదా యను సందియము కల్గుచున్నది. ఉద్యోగులు శాసనసభా సభ్యులుగానుండుటకెట్టి యభ్యంతరములు కలవో అవన్నియు ఈ వాణిజ్యములందలి ఉద్యోగులకును వర్తించును. కనుక ఈ యుద్యోగులకు తమతరఫున తమనాయకులను (ప్రభుత్వోద్యోగమందు లేని) ప్రతినిధులగా నెన్నుకొనవచ్చును. తమలో నేరైన సభ్యత్వమాశించుచో ఆతడు తన యుద్యోగమును ముందుగా వదలవలసియుండును.

ఇప్పటివరకు ప్రజాస్వామిక రాజ్యములందు ప్రభుత్వోద్యోగులలో అనుభవపరులు అప్పుడప్పుడు వారి యనుభవమునకు సంబంధించిన బిల్లులు శాసనసభలందు చర్చింపబడుచున్నప్పుడు వానిపై తమ యభిప్రాయముల తెల్పుట కవకాశము లేదు. శాసనసభలయందె చర్చ జరుగుచుండు సమయమున బిల్లులపై సుముఖముగగాని విముఖముగగాని ఉపన్యసించుటకే ప్రభుత్వోద్యోగికి యవకాశ మిచ్చుట యుక్తము కాదు. కాని శాసనసభవారి స్థాయిసంఘములు ప్రతిడిపార్టుమెంటునకు బిల్లుల విచారణ జేయుటకు స్థాపించబడుచున్నవి కనుక ఆసంఘములు ప్రభుత్వపు ఆర్డరుల, నియమముల, బిల్లుల,

పరీక్షించు నెడల నీ యధికారుల ఫలహారలను బొందనగును. ఆసమయమందె అధికారుల యనుభవమును స్థాయిసంఘుస భ్యులు జూరగొనుట లాభకరము. చర్చనీయమగు సమస్యపై అటునిటు విమర్శించుటకు తగిన యుద్యోగుల రప్పించనగును. ఈవిధముగ సివిలు సర్వీసువారి యనుభవ పూర్వకమగు యభి ప్రాయముల యొక్క లాభమును శాసనసభవారు పొందుట దేశోపకార మగును. ఈయవకాశ మొసంగుటవలన ప్రభు త్వోద్యోగులుకూడ వివిధ రాజ్యాంగ సమస్యలగూర్చియు ఆర్థిక వ్యవహారముల గురించియు, శ్రద్ధమై జదువుచు, ఆలో చించుట కుత్సాహము పొందెదరు.

ఈ దినములందు నానాజాతి సామరస్య మెంత యగ త్యమో నాగరికతాభివృద్ధికి రాజ్యాంగమందు ముఖ్యులగువా రెల్లరు ప్రపంచమంతయు నొక్కటనియు మానవు లెల్లరు సోదరులనియు గ్రహించుట ఎంత అగత్యమో తెలుసుకొన గల్గుచున్నాము. ప్రభుత్వోద్యోగులందు పైతరగతివారు నానా జాతి సమస్యల బాగుగా గ్రహించగల్గిన శక్తి బొందుట అవ సరము. అందు ముఖ్యముగా విదేశాంగపు డిపార్టుమెంటు వారు వివిధదేశముల జూచి ఆయా ప్రదేశములందలి రాచ కీయ ఆర్థిక సాంఘిక పరిస్థితుల విచారించి మానవకోటియందు ప్రేమ సంపాదించుకొనుట రాజ్యాంగాభివృద్ధి కారకము. కనుక ప్రతిముఖ్యుడగు ఉద్యోగికిని పది వత్సరముల కొక

మూరుగాని ఐదు వత్సరముల కొకమూరుగాని ప్రపంచయాత్రచేసి నానాజాతిసమితి ఆఫీసునందు కొంతకాలము ఉద్యోగమొనర్చి వచ్చుటకు ప్రభుత్వము తనఖర్చులపై పంపుట మంచిది. ఉద్యోగులం దెవ్వరికైన సాంఘికార్థికా సమస్యల తేల్చుటకు స్వతంత్రభావములు తట్టినచో తమడిపార్టుమెంటుల యనుభవముతో క్రొత్తమార్పులం ప్రభుత్వపు భవనమందు కల్గించు టగత్యమని తట్టుచో శాసనసభవారి స్థాయిసంఘములవారికి తమ రిపోర్టులను నివేదించుట కవకాశ మీయవలెను. ఆసంఘము లంగీకరించిన ఆరిపోర్టుల ప్రకటించనగును.

ఈ యుద్యోగులు ప్రజల పీడించకుండా ప్రజాసేవనే చేయుచు ప్రజానురంజకముగా ప్రభుత్వ కార్యముల చక్కబెట్టుటకై తగు కట్టుదిట్టముల జేయుట అగత్యము. ఎన్నికశద్ధతిగల అమెరికాయందు ప్రజల కయిష్టుడగు నుద్యోగుని పదభ్రష్టుని చేయుటకు 'వోటు' చేయు (Recall) హక్కు కావలెనని కొందరు సంస్కారవాదులు కోరుచున్నారు. కొన్ని రాష్ట్రములం దిట్టియధికారము ప్రజల కివ్వబడియే యున్నది. కాని ప్రభుత్వముచే పోటీపరీక్షలద్వారా పబ్లికు సర్వీసుకమీషను వారితోడ్పాటుతో నియమింపబడు నుద్యోగుల నదుపుమాజ్ఞలం దుంచుటకు మంత్రివర్గమువారికి సంపూర్ణ హక్కు ఒసంగబడవలెను. ఐతే న్యాయమూర్తులును పబ్లికు సర్వీసుకమీషనుల సభ్యులును అట్టి యితరముఖ్యోద్యోగు

లును మాత్రము శాసనసభ వారిచేతప్ప మంత్రివర్గముచే పద భ్రష్టత బొందరాదు. మిగిలినవారి నందరిని పబ్లికుసర్వీసు కమీషనువారి సలహాలపై గాని, సహాకారముపై గాని ఆక మీషనుతో నిమిత్తములేకనేగాని అవసరము కల్గినప్పుడు తగురీతి శిక్షించుటకు మంత్రివర్గము వారికి హక్కు అన్నిదేశ ములందును కలదు.

కాని ఎట్టితప్పిదములకు ఎట్టిశిక్షలు వేయదగునో నిర్ణయించుచు కొన్ని సూత్రములను ప్రభుత్వోద్యోగుల సహాకారములతో మంత్రివర్గము వారు ముందుగానే ప్రకటిం చవలయును. శిక్షార్హులగు నుద్యోగుల కెట్టిశిక్ష వేయన గునో నిర్ణయించునప్పుడుకూడ యుద్యోగుల ప్రతినిధులసల హాలను మంత్రివర్గము వారు పొందుట శుభప్రదము. ఈ కా ర్యములు సుగమములగుటకై ప్రభుత్వపుప్రతినిధులు, ఉద్యో గులప్రతినిధులు సమానముగా కల్గియున్న "సర్వీసు సమ్మేళన సంఘము" స్థాపించుట శుభప్రదము. ఇట్టిసంఘములు ఇంగ్లాం డు, జర్మని, ఆస్ట్రేలియాలందు కలవు. వీనినే యింగ్లాండు నందు "Wheatly Committees" అందురు. ఈసంఘములు ప్రతిఉద్యోగుల చర్యలకు సంబంధించిన ప్రతివిషయమందు ను తమసలహాల నివ్వవచ్చును. గాని తుదితీర్మానము మం త్రివర్గమువారె తమబాధ్యతపైననె తేల్చుకొనుట యు క్తము.

తప్పులొనర్చుచున్నను ప్రభుత్వోద్యోగులు తమయుద్యోగ వ్యవహారముల నడపుటలో ప్రజలకు సానుసయముగ ప్రీతికరముగ ప్రవర్తించి ప్రజాభ్యుదయము వృద్ధిపరచం బ్రయత్నించుటమంచుట మంచిది. వారిట్లు చేయునట్లు జాగ్రత్తచేయుటకు మంత్రివర్గము వారికిగాని శాసనసభ వారి డిపార్టుమెంటుల స్థాయిసంఘములకుగాని పూర్తిగా సాధ్యముకాజాలదు. కనుక ప్రతిజిల్లాయందు, ప్రతి వాణిజ్యమునకును, వీలుకల్గిన సమయములందెల్ల స్థానికముగా ప్రజానాయకులగు వారిని అచ్చట శాసనసభాసభ్యులను ఆయావ్యవహారములకు సంబంధించిన ప్రజాసంఘముల ప్రతినిధులను జేర్చి సలహాసంఘముల స్థాపించుట అగత్యము. అనగా ఇక్కమ్టాక్సు డిపార్టుమెంటు ఉన్నదనుకొందము. మనదేశమందిప్పుడు ప్రతిజిల్లాకొక్కరు లేక ఇద్దరు ఆఫీసరులున్నారు. వీరికి ఎవ్వరెవ్వరిపై నెంతెంతశిస్తువేయునగునో నిర్ణయించు నధికారము కలదు. అనేకమారులు వీరు స్థానికపు స్థితిగతుల తెలుసుకొనక తమకిష్టమువచ్చినట్లు శిస్తుకట్టుట కలదు. అట్టియెడ ఇబ్బందిలోపడిన సాహుకారు వీరివద్దనే తిరిగి మొరపెట్టుకొనవలసియున్నది. వీరి తీర్పు సుముఖముగ నుండకున్న వీరిపై యుద్యోగియగు అసిస్టెంటుకమీషనరుగారి పైనలు తీర్పునకు పోవును. ఆయన సాధారణముగా ఆఫీసరుగారి తీర్మానమునే అంగీకరించును. మనసూచనప్రకారము జిల్లా

యుద్యోగికి పిమ్మట అసిస్టెంటుకమీషనరుకు సలహాయిచ్చుటకై ప్రజానాయకుల సంఘమొకటి యుండును. ఆసంఘము వారు వివాదగ్రస్థమగు వ్యవహారముల గురించి తగు సలహాల నిత్తురు. ఈయిద్దరి ఆఫీసరులవద్దనుండు సలహాసంఘము లేకాభిప్రాయము బొందుచో కమీషనరునకు అప్పీలు ఉండును. అచ్చటను కమీషనరు తనయుద్యోగుల సలహాసంఘము క్రిందటి సంఘముల బలపరచుచో మంత్రివర్గము వారి విషయమును పరిష్కరించవలెను. ఇటులనె పి డబ్లియు. డిపార్టుమెంటులో కూడ ఓవరుశీయరులతో గ్రామపంచాయితీలు, యగ్జిక్యూటీవు యింజనీయరులతో ఇర్రిగేషనుబోర్డులు సూపరింటెండెంటు యింజనీయరులతో మాగాణిరైతులు, ఛీఫ్ యింజనీయరుతో శాసనసభాస్థాయి సంఘసభ్యులు సహాకారమొనర్చుచు ప్రజలహక్కులు కాపాడుచుండుట అవసరము. ఇప్పుడిట్టి ప్రజాసంఘముల యాజమాన్యము సహకారము లేకుండుటవలననె రైతులు అధికముగా ప్రతిమాగాణి యుద్యోగికి లంచము లివ్వవలసి వచ్చుచున్నది.

ప్రభుత్వోద్యోగులందు స్వామిభక్తిపరాయణత న్యాయమార్గానువర్తనము ధర్మపాలనాబుద్ధి నిష్పక్షపాతశీలము వృద్ధిపొంది ఇప్పుడు ప్రచారమైయున్న లంచగొండితనము కులాభిమానము వగైరాలు రూపుమాయవలెనన్న వారి సంఘములు స్థాపించబడి వానిద్వారా పెన్షనుపుచ్చుకొన్న

వారు ఉన్నతాధికారములందుండువారు ఉద్యోగులందు తమ వృత్తిపైనను తమస్థానముపైనను గౌరవము అభిమానము కల్గించవలసియున్నది. మంత్రులుకూడ నిట్టిసంఘములం దప్పుడప్పు డుపన్యసించుచుండవలయును. ప్రభుత్వపు సహాయముచే ఈసంఘములు దేశమందలి తత్వవేత్తలు రాచకీయ వేత్తలచే సలహాలను బొందుచుండవలెను. ఉద్యోగులు సంధిగ్ధసమయములందు అరాచకము నణచునప్పుడు నిర్బంధవిధానము నమలులో పెట్టవలసివచ్చునప్పుడు తాము చేయవలసిన కార్యములు చట్టసమ్మతములగునా కాదాయని విచారించి సంఘసహాయము బొందుటకుగాను ఈసంఘము అనుభవశాలురును ప్రతిభాశాలురునగు న్యాయవాదుల సహాయము బొందుచుండవలయును. అశాస్త్రీయమగు కార్యముల జేయుమని ప్రభుత్వము శాసించుచో ఆకార్యముల నిర్వహింపజాలకగాని ఆకార్యముల జేయనిచ్ఛగించకగాని, ఏప్రభుత్వోద్యోగియైనను సెలవుగోరుచో, లేక టాన్సుఫరుగోరుచో ప్రభుత్వమట్టియుద్యోగి కాసౌకర్యము కల్గించునట్లు చేయుట యీసంఘముయొక్క ధర్మము.

రాచకీయాధికారము (వోటునకు మినహా) యేమాత్రము లేక రాచకీయజీవితమందు ప్రజలతోబాటు స్థాయిసంఘములకు రహస్యముగా తమసలహాలనిచ్చుటకుతప్ప తదితర ప్రాముఖ్యత పొందలేకుండు యీప్రభుత్వోద్యోగులకు వారి

వారి సేవాపరాయణత ననుసరించి ప్రభుత్వము తగుగౌర
వాదరముల కల్గించుచుండుట వాడికైయున్నది. ఒక్క అమె
రికా, జర్మనీ ఫ్రాన్సునందు తప్ప తదితర దేశములందు బిరుద
ములు వీరికివ్వబడుచున్నవి. అన్ని దేశములందును వీరికేదో
నొక విధమగు మరియాద మన్ననలు ప్రభుత్వముచే కల్గిం
చబడుచునే యున్నవి.

ప్రభుత్వపుటాజ్ఞల ననుసరించి తమధర్మమును నిర్వ
ర్తించుటకు ప్రభుత్వోద్యోగులు ప్రయత్నించుటలో తలవని
తలంపుగ ప్రజలయందెవరికైనను ధన, మాన ప్రాణనష్టము
కల్గుచో ఆయుద్యోగులనే ఆనష్టపరిహారమును కట్టి యివ్వ
మనుట వాడిగాదు. తమకు కల్గిన నష్టపరిహారముకై పౌరులు
దావాలు తెచ్చినయెడల పౌరులతరపున న్యాయమున్నచో
నష్టపరిహారమును ప్రభుత్వమే కట్టియివ్వవలసివచ్చును ప్రభు
త్వోద్యోగి తెలిసియే దుర్మార్గములొనర్చుచో ఆనష్టపరి
హారమును ప్రభుత్వమే చెల్లించినను అతనికి తగుశిక్ష వేయు
టకు ప్రభుత్వమునకు హక్కు ఉండవలెను.

కాని ప్రభుత్వోద్యోగములందుండువారు తాము తమ
యుద్యోగరీత్యా చేయు కార్యములవలన కల్గు మంచిచెడ్డలకు
తదితర పౌరులవలెనే బాధ్యులై యుందురు. కనుక ప్రజాసా
మాన్యమునకు ఉద్యోగులకుమధ్య న్యాయస్థానములందువారు
నిందార్హులై యున్నయెడల ఏమాత్రము భేదము కల్గించరాదు.

ఈవిధముగ బ్రిటిషువారి ప్రజాస్వామిక రాజ్యాంగములందు. తదితర బ్రిటిషువారి సామంతరాజ్యములందును ప్రభుత్వోద్యోగులు తదితరులవలెనే న్యాయస్థానములందు, వారొనర్చిన తప్పిదములకు, శిక్షాపాత్రులగుదురు. ఇందువలన, ప్రభుత్వోద్యోగులు ఎల్లప్పుడును తమ యుద్యోగధర్మనిర్వహణమందు చట్టబద్ధముగా ప్రవర్తించవలెనని ప్రయత్నింతురు. మరియు, తాము ప్రభుత్వోద్యోగులముగదాయని, నిరంకుశముగా గర్వముతో ప్రవర్తించుటకు సాహసించరు. న్యాయస్థానములు ప్రభుత్వమునకులోబడక స్వతంత్రించియుండును గనుక, తప్పిదమొనర్చిన యుద్యోగులు తప్పక శిక్షింపబడుదురు. ఇట్టియుద్యోగులు కల్గియుండుటకే, సాధ్యమైనంతవరకు ప్రభుత్వము తనయుద్యోగులకు కల్గునష్టముల కట్టియిచ్చును. ధననష్టమే కాక, ఉద్యోగులకు, జైలువాసశిక్షపడుచో, దానిని, అసాధారణపరిస్థితులందుతప్ప, ప్రభుత్వము తప్పింపసాహసించదు. కనుకనే, బ్రిటిషువారిరాజ్యములందు ప్రభుత్వోద్యోగులెల్లప్పుడు శాసనబద్ధముగానుండు కార్యములనేచేయుచు ఆజ్ఞలనే అమలుజరుపుటకు ప్రయత్నింతురు.

జర్మనీ, ఫ్రాన్సు, ఇటలీ, స్పెయిను, పోర్చుగలు, బాల్కనురాష్ట్రములందుమాత్రము మరొకపద్ధతి ఆచరణయందున్నది. దానిప్రకారము ఏకారణనైకైనను, ప్రభుత్వోద్యోగియొక్క చర్యలవలన నష్టమో కష్టమో కల్గుచో,

ఆతనిపై తగుచర్యను తీసుకొనుటకు బ్రిటిషురాజ్యములందు వలె సాధారణకోర్టులకు వెళ్లగల్గుటకు మారు "అడ్మినిస్ట్రేటివ్ కోర్టులకు" వెళ్ళవలెను. ఆకోర్టులు సాధారణపౌరులకు వర్తించు న్యాయచట్టముల నమలులో పెట్టుచుండుటకు మారు ప్రత్యేకమగు "అడ్మినిస్ట్రేటివు" శాసనముల నమలుపరచు చుండును. బ్రిటిషువారి న్యాయమూర్తులు ప్రభుత్వమునకు లొంగనివారైయుండ, "అడ్మినిస్ట్రేటివుకోర్టుల" న్యాయమూర్తులు ప్రభుత్వముచే నియమింపబడి, ప్రభుత్వమునకు లోబడి యుండురుగనుక, బ్రిటిషువారి దేశములందువలె పౌరులకు, ఉద్యోగులకెదురుగా న్యాయముజరుగునని చెప్పవీలులేదు. అనుభవమందును, బ్రిటిషురాజ్యములందు, ప్రభుత్వోద్యోగికి కల్గురక్షణకంటె అడ్మినిస్ట్రేటివుకోర్టులుగల్గిన దేశములందు హెచ్చురక్షణకల్గుట తటస్థించుచున్నది.

ప్రభుత్వోద్యోగులకు "అడ్మినిస్ట్రేటివు" శాసనసముదాయమే హెచ్చులాభకరముగానున్నది. కాని ప్రజలకు, బ్రిటిషువారి న్యాయశాసనసముదాయమే హెచ్చుశ్రేయోదాయకముగాను, సౌఖ్యదాయకముగాను పరిణమించుచున్నది. మనదేశమందిప్పటికి బ్రిటిషువారి పద్ధతియే యమలునందున్నదికనుక, అయ్యదియే పౌరులకు శ్రేయోదాయకమైనదిగాన, ఆపద్ధతినే యికముందును నిల్పుకొనుటయుత్తమము.

---

## పదునొకండవ ప్రకరణము.

ప్రతి రాజ్యాంగమునకు అధ్యక్షుడొకడుండును. ఇంగ్లాండు, బ్రిటిషువారి సామంత రాజ్యములు, అధినివేశ రాజ్యములు, సయాం, అఫ్ఘనిస్థానము, పర్షియా, నార్వే, స్వీడను, ఇటలీ, జుగోస్లావియా, జపాను, భారతీయ స్వదేశ సంస్థానములందు, ఆతనిని "రాజు" లేక "చక్రవర్తి" యనుటకలదు. స్విట్జర్లాండు, పోర్చుగల్, స్పెయిను, ఫ్రాన్సు, జర్మనీ, పోలాండు, ఆస్ట్రియా, అమెరికా, దక్షిణ అమెరికా రాజ్యములందాతని 'ప్రెసిడెంటు' అందురు. జుగోస్లావియా, ఆఫ్ఘనిస్థానము, పర్షియాలందు సంపూర్ణముగాను, జపాను, భారతీయస్వదేశ సంస్థానములందు చాలవరకు, 'రాజు' నిరంకుశాధిపతియై యున్నాడు. మిగతా రాజ్యములందు, రాజ్యాంగమున కధ్యక్షతమాత్రమువహించి ప్రజాప్రతినిధిసభవారికి బాధ్యులగు మంత్రివర్గమువారి సలహానుసరించి, సహకారముతో మంత్రివర్గపుటంగీకారముతోడనే రాజు తన బాధ్యతల నెరవేర్చగల్గుచున్నాడు. కనుక బాధ్యతాయుత మంత్రివర్గములు కల్గిన దేశములందు, రాజు, నామమాత్రముననే, రాజ్యాంగాధ్యక్షుడై మంత్రివర్గమువారికి సలహాలనిచ్చుచు, వారితో సహకారమొనర్చుచు, మంచిచెడ్డల జెప్పుచుండుటకే అర్హతకల్గియుండును. ప్రెసిడెంటులు

రాజ్యాంగాధ్యక్షుడు.

కల్గిన, రిపబ్లికులందును, ప్రెసిడెంటున కొకేవిధమైనయధికారములు లేవు. స్విట్జర్లాండునందు, మంత్రివర్గముచే ఎన్నుకొనబడి ఆసభకధ్యక్షుడైనవాడె ఒక్కవత్సరమువరకు ప్రెసిడెంటుగావ్యవహరించును. కనుక, ఆరిపబ్లికుప్రెసిడెంటు తానుగూడ యొకమంత్రియై మంత్రివర్గముకధిపతియై యుండును. అమెరికాయందట్లుగాక, నాల్గువత్సరములకొక్కమారు ప్రజలందరిచేతను ఎన్నుకొనబడి, సమ్మేళనరాజ్యాంగనిర్వహణ భారమంతయు తలపైనిడుకొనుచున్నాడు. స్విట్జర్లాండులో ప్రెసిడెంటువలె, తాను మంత్రిగామాత్రము వ్యవహరించక మంత్రివర్గమునె నిర్మించుచు, అచ్చటివలె, శాసనసభలకు బాధ్యుడైయుండక ప్రజలకే బాధ్యుడై అమెరికాప్రెసిడెంటుప్రత్తనముచేయుచున్నాడు. ఆతడే రాజ్యాంగాధ్యక్షుడై తనదేశమునకు తలమానికమై తనదేదేశీయులకు ప్రధానపూరుషుడై యుండును. కాంగ్రెసువారిబిల్లుల నామోదించి వానిని శాసనములుగా ప్రకటించుటకు యుద్ధమునడపుటకు రక్షణదళములపోషించుటకు రాజ్యాధికారమును నడపుటకు నాతడు అర్హుడు. ప్రభుత్వమంతయు నాతనిపైననే యాధారపడియుండును. టర్కీయందలి ప్రెసిడెంటు ప్రజాప్రతినిధిసభవారిచే నెన్నుకొనబడు చున్నాడు. నాల్గువత్సరముల వరకు ఆతడుద్యోగమందుండును. తనకిష్టులైనవారినె,మంత్రులుగానియమించి అందొక్కరిప్రధానమంత్రిగా నిరూపించుచుండును.

శాసనసభ వారి బిల్లులను ఆతడు అమెరికా ప్రెసిడెంటువలెనే, సభవారియనుమతిబొందిన పదిదినములలో నిరాకరించుటకధికారముకలదు. అమెరికాయందలి ప్రెసిడెంటువలెనే ఆతడును రాచకీయపక్షములలో నొకదానికి నాయకుడైయుండును.

మిగతా రాజ్యాంగములందలి ప్రెసిడెంటులు, బాధ్యతాయుతమంత్రివర్గములకల్గిన రాజులవలెనే, తమ మంత్రివర్గములతో సహాకారమొనర్చుచు, వారియాజ్ఞలపాలించవలసియుందురు. ఫ్రెంచిప్రెసిడెంటు, ఏడు వత్సరములకొకమారు, రెండుశాసనసభల సమ్మేళనమగు "నేషనల్ అసెంబ్లీ" వారిచే నెన్నుకొనబడును. జర్మను ప్రెసిడెంటుకూడ ఏడుసంవత్సరములకొకమా రెన్నుకొనబడుచున్నాడు. కాని వోటరులెల్లరు, ప్రపోర్షనల్ ప్రాతినిధ్యసూత్రము ననుసరించి ఆతని నెన్నుకొనవలెను. తదితర దేశములందలి, రిపబ్లికుయొక్క రాజ్యాంగవిధానము సక్రమముగా జరుగుట లేదుకనుక, వాని ప్రెసిడెంటులగూర్చి వివరముల తెలుపజాలము.

రాజులెల్లెడ, వంశపారంపర్యాయముగా, తమస్థానములనాక్రమించుకొనుచున్నారు. జపానుచక్రవర్తి, సూర్యవంశీయుడట. మన స్వదేశసంస్థానాధీశులును, సూర్య, చంద్రవంశీయులట. కలకాలమునుండి రాజ్యమేలుచుండిరట. అమెరికా ప్రెసిడెంటునకు ఓకేవ్యక్తి రెండుమారులకంటె, వరుస

గా అభ్యర్థిగా నిలబడరాదు. ఫ్రాన్సు, జర్మనీ, టర్కీలయం దు, రెండుమారులు వరుసగా ఒకరే ప్రెసిడెంటుగానుండవ గును. జర్మనీయందు మూడవమారు వారుండరాదు. బ్రిటి షువారి అధినివేశ దేశములందును, ఇండియాయందును, గవ ర్నరుజనరలుగారు, ఐదువత్సరములకొకమారు నియమింప బడెదరు. అవసరమగుచో, మరిరెండు వత్సరములవరకు, వారిని ఆస్థానమునందే రాజుగారు నిలుపుసగును.

బాధ్యతాయుతరాజ్యాంగాధ్యక్షుడు (రాజుగాని, ప్రెసి డెంటుగాని) బాధ్యతాయుతమంత్రివర్గముతో కలసి, తన బాధ్య తల నెట్లు నిర్వర్తింపవలయునో విచారింతము. ఈయధ్యక్షుడు అన్నిదేశములందును, రాజ్యాంగవ్యవహారములకు ప్రధానా ధికారి. ఆయనపేరుననె, రాజకీయ ప్రెత్తనమంతయు జరుపబ డును. శాసనములు ప్రభుత్వపు ఆర్డినెన్సులు, ప్రభుతపుచర్య లన్నియు ఆయనపేరునజరుపబడవలెను. రాజముద్ర ఆయన ఆజ్ఞపై, ప్రతి ప్రకటనపైనను వేయబడును.

శాసననిర్మాణమందు, ఈతనికికొంత ప్రత్యేకబాధ్య తకలదు. ఇంగ్లాండు, బ్రిటిషువారి అధినివేశ రాజ్యాంగములం దు, ఫ్రాన్సు, నార్వే, స్వీడను రాజ్యములందును, శాసనసభ వారిచే సంగీకరింపబడి, రాజ్యాంగవిధానపు చట్టానుసార ముగ నున్న బిల్లులను, మంత్రివర్గమువారు బలపరచుచో, ఈయధ్యక్షు డంగీకరించవలసి యున్నది. ఆస్ట్రేలియాయందు,

సెనెటుసభవారు ప్రజాప్రతినిధిసభవారు బిల్లుల నంగీకరిం పనిచో, రెండుసభలనంత మొందించి, క్రొత్తగా సమావేశపడు క్రొత్తసభల సమ్మేళనసభయందట్టి బిల్లులప్రవేశపెట్టుటకు, గవర్నరుజనరలుగారు సహకారమొనర్పవలెను. ఆసమ్మేళన సభవారు ఆబిల్లునంగీకరించుచో, ఆతడద్దానిని రాజుగారిపేర శాసనముగా ప్రకటించవలసినదే ! మిగతా దేశములందుచట్ట పూర్వకముగా శాసనసభలుబిల్లులనంగీకరించుచో, సంశయ మేమాత్రము జూపెట్టక రాజ్యాంగాధ్యక్షుడు వానిని శాసన ములుగా ప్రకటించవలెను. తుదకు జర్మనీయందు, రెండు సభలచే సంగీకరింపబడిన బిల్లును ప్రెసిడెంటుగారు, "రిఫరెం డము"నకు తేవచ్చును. ప్రజాప్రతినిధి సభవారిలో మూడవ వంతుమంది ఏబిల్లునైన శాసనముగా ప్రకటించుటకు రెండు నెలలవాయిదా వేయుమనికోరినపిమ్మట వోటరులందరిలోయిరు వదవవంతుమంది "రిఫరెండము" కావలెననికోరుచో, అట్టి బిల్లును ప్రెసిడెంటుగారు "రిఫరెండము" నకు తేవలసి యున్నది.

ప్రతి ప్రజాస్వామిక రాజ్యాంగమందును (అమెరికా యందుతప్ప) రాజ్యాంగాధ్యక్షుడు చేయుప్రతికార్యమునకును మంత్రివర్గమునందలిసభ్యులలో ఎవరో యొకరు బాధ్యతవహిం చవలయును. అమెరికాలో ప్రెసిడెంటు తనచర్యలకేరికి బా ధ్యుడుకాడు. తానునడపిన పెత్తనము ప్రజలకు బాధకరముగు,

చో వారాతని రాజద్రోహమునకై శిక్షితుచేయవచ్చునే కాని, అనుదినచర్యలకు మరేయితరయుద్యోగియు నాతనిపై లేడు. ఇగ్లాండుయొక్క రాజ్యాంగవిధానపు ఆచారమగు "రాజుగారు తప్పొనర్చరు" అను సూత్రము తదితరదేశ ములందంగీకరింపబడినది. కనుక శాసననిర్మాణమందుగాని, కార్యనిర్వహణమందుగాని, రాజు లేక ప్రెసిడెంటుగారి పేర బయలువెడలు ప్రకటనలన్నిటికి మంత్రివర్గమువారు బాధ్యులై యుండవలెను. కనుక ఏరాజునకుగాని ప్రెసిడెంటునకుగాని, మంత్రివర్గమును నిరాకరించి స్వతంత్రముగా ఏపెత్తనముచేయుటకును వీలులేదు. ప్రజాప్రతినిధిసభవారి విశ్వాసమును పోగొట్టుకొనిన మంత్రివర్గమును రాజీనామా నివ్వమనికోరుటకు అధ్యక్షునకు అధికారముకలదు. పిమ్మటప్రజాప్రతినిధిసభవారి కంగీకారమగు మరొక మంత్రివర్గము నాతడు నిర్మించవచ్చును. ఈరెండుకార్యములును మంత్రులయొక్క బాధ్యతపైననే చేయబడును. రాజీనామాయిచ్చుమంత్రులు తమ రాజీనామాలపైనను నూతనముగా మంత్రిత్వముల బొందువారు తమయుద్యోగ స్వీకారపత్రములపైనను దస్కతు చేయవలెను. ప్రజాభిప్రాయమును ప్రజాప్రతినిధిసభవారు సరిగ ప్రకటించుటలేదనియు, మెజారిటీకిజెందిన మంత్రివర్గమువారు ప్రజాభీష్టములకు వ్యతిరేకముగా ప్రవర్తించుచున్నారనియు, ప్రెసిడెంటుగారభిప్రాయపడుచో మెజారిటీవారి

మంత్రివర్గమును పంపివేసి మైనారిటీ పక్షనాయకులలో నొకరిని మంత్రివర్గము నేర్పరుపకోరి క్రొత్తమంత్రివర్గముయొక్క యనుమతిపై ప్రజాప్రతినిధిసభను అంతమొందించి, జనరలు ఎలెక్షను జరుపవచ్చును. క్రొత్తయెన్నికలందును వెనుకటి మెజారిటీపక్షమే జయమందుచో వారినాయకునే తిరిగిప్రధానమంత్రిగా నియమించవలెను. ఈవిధముగా రాజ్యాంగాధ్యక్షుడు ప్రజాభిప్రాయమును ప్రకటించుటకై మంత్రివర్గముల మార్పుచేయవలయునన్నను మంత్రులయొక్క యనుమతిపొందవలెను. ఫ్రాన్సునందుమాత్రము మంత్రులసలహాపైగాని సెనెటు సలహాపైగాని, ప్రజాప్రతినిధిసభ నంత మొందించు నధికారము ప్రెసిడెంటునకు లేదు.

అధికారమందున్న మంత్రివర్గములతో ఎక్కువగా పోరాడు గవర్నరుజనరలులను, రాజీనామా యిచ్చి రమ్మనుమని ఇంగ్లండు రాజుగారుకోరుట యింతవరకు ఆచారమైయున్నది. ఐతే 1930 సంవత్సరమువరకు, రాజుపేరిటనట్టి ఆజ్ఞనిచ్చుటకు ఇంగ్లీషువారి మంత్రివర్గమునకే అధికారముండెను. కాని అప్పటినుండి రాజునకట్టి సలహానిచ్చి ఆయా నిరర్థకులగు గవర్నరుజనరలులను పదభ్రష్టులచేయుటకు బాధ్యతవహించవలసినవి అధినివేశ రాజ్యములమంత్రివర్గములైయున్నవి. ఇంగ్లాండునందు రాజు అక్రమవర్తనుడగుచో కామన్సుసభ వారు నిందితుచేసి ప్రభువులసభముందు విచారణకు తేవచ్చును. పార్లమెం

టువారు ప్రథమచార్లెసు రాజును వధించుటబట్టి రెండవ ఛార్లెసుగారిని పదభ్రష్టునినిజేయుటబట్టి, ఆతడుశిక్షాపాత్రుడైనచో శిక్షనునిర్ణయించుటకు ప్రభువులసభకధికారమున్నదని తలంచవచ్చును. ఫ్రాన్సు, జర్మనీదేశములందు ప్రజాప్రతినిధిసభవారికి ప్రెసిడెంటును నిందితుగాజేయుటకు హక్కుగలదు. జర్మనీయందు ప్రజాప్రతినిధి సభవారట్లు, మూడింటరెండువంతులమంది యంగీకారముతో ప్రెసిడెంటును నిందితుగాజేసినపిమ్మట ప్రెసిడెంటుగారు తనయధికారమును తాత్కాలికముగా వీడవలెను. అంతనా ప్రెసిడెంటుగారు తన ఉద్యోగమందుండనగునా, లేదా యని తెల్పుటకు "రిఫరెండము" జరుపబడును. దానిద్వారా ప్రజలు ప్రెసిడెంటుగారినే బలపరచుచో, వెంటనే ప్రజాప్రతినిధిసభవారు అంతమొందుటయు, తిరిగి జనరలు ఎలక్షనులు జరుగుటయు తటస్థించును. ఈవిధముగా రాజ్యాంగాధ్యక్షుని అవసరముకల్గినప్పుడే, పదభ్రష్టునిచేయుటకైనను, ప్రజలకు తగు యవకాశములుండుట మేలు. అట్లుకానిచో ప్రెసిడెంటుగాని, గవర్నరుజనరలుగాని, తనకునచ్చినమంత్రివర్గమునే బలపరచుచు, ప్రతిపక్షనాయకుల నిరాదరణచేయవచ్చును. ఫ్రాన్సునందు శ్రీప్రెసిడెంటుమిల్లెరాండుగారు, శ్రీపాయింకారేగారి మంత్రివర్గమునే బలపరచుచు జనరలు ఎలక్షనులలో కూడ ఆమంత్రివర్గమునే అంగీకరించవలెనని వోటరులకు తనసలహాను ప్రకటించిరి.

ఇటుల చట్టవిరుద్ధమగుచర్యకు పాల్పడిన ప్రెసిడెంటును క్రొత్తగా సమావేశపడిన ప్రజాప్రతినిధిసభవారు తీవ్రముగా విమర్శించి నిందితు జేతుమని ప్రకటించిరి. వెంటనే ఆతఁడు తన పదవికి రాజీనామా యివ్వవలసివచ్చెను. అటులనే బ్రిటిషు అధినివేశ రాజ్యాంగములందు గవర్నరు జనరలుగారు ఒక మంత్రివర్గమును పదభ్రష్టతనొందించి క్రొత్తమంత్రివర్గమును (మైనారిటీపార్టీకి చెందినది) నిర్మించి ప్రజాప్రతినిధి సభవారి నంత మొందించినపిమ్మట క్రొత్త సభవారి యొక్క మెజారిటీ, వెనుక పదభ్రష్టుడైన ప్రధానమంత్రినే బలపరచుచో, ఆతడు వెంటనే తనపదవికి రాజీనామా నివ్వవలసివచ్చును. వెస్టుమినిస్టరు ఆక్టుప్రకారము అధినివేశరాజ్యాంగపు ప్రధానమంత్రియొక్క సలహాలపై బ్రిటిషు రాజు తనయాధిపత్యము నడుపవలసియుండును కనుక ఆరాజుయొక్క ప్రతినిధియగు గవర్నరుజనరలుగారు ప్రజాప్రతినిధిసభవారిచే నంగీకరింపబడు మంత్రివర్గమును పదభ్రష్టతనొందించ సాహసింపరాదు.

రాజ్యాంగాధ్యక్షునికి రాచకీయపక్షములతో సంబంధమేమాత్రము కూడదు. ఆతని కన్నిరాచకీయపక్షములు సమానముగనే యుండవలెను. ఆయన శ్రీవిక్టోరియారాజ్ఞిగారు తనకిష్టుడగు శ్రీలార్డు బీకన్సుఫీల్డుగారి పార్టీసంఘమగు "ప్రిమ్‌రోజు లీగు"ను బలపరచినట్లు చేయరాదు. నిష్పక్షపాతముగ మంత్రివర్గమునందు జేరు మంత్రులందరి

నొకేరీతి గౌరవించుచు ప్రజాప్రతినిధిసభయొక్క మెజారిటీ కే మంత్రివర్గము నేర్పరచు సభ్యుల కల్పించుచు మంత్రుల యభిప్రాయముల యెడ నాదరముంచి మంత్రివర్గమునకన్నివిధ ముల సహాయము చేయుచుండుట అధ్యక్షుని ధర్మమైయున్నది. ఎన్నికలందు మంత్రివర్గపరముగాగాని, వ్యతిరేకముగాగాని ఆతడు ప్రవర్తించరాదు. ప్రజాభిప్రాయము ననుసరించియే ఆతడెల్లప్పుడు మంత్రివర్గముతో సహాకార మొనర్చుచుండ వలయును.

ఈవిధముగా ఏరాచకీయపక్షమునకు జెందక మంత్రులకు మించి స్వతంత్రముగానే యధికారము నుపయోగించజాలక, మంత్రులు కోరినవిధముగనే అన్నివ్యవహారములందును ప్రవర్తించవలసిన రాజ్యాంగాధ్యక్షునకు రాజ్యాంగ సేవచేయుటకుగాని ప్రజాసేవ నొనర్చుటకుగాని ఎట్టియవకాశములు కల్గునో విచారింతము. విరంకుశముగాగాని తనంత తానేకాని ఎట్టియధికారమును చెలాయించుట కాతనికి వీలు లేదు. శిక్షాపాత్రులగువారిపై వేసిన శిక్షల తగ్గించుటకు గాని భూషణార్హులైనవారికి బిరుదములిచ్చుటకుగాని ఆతడు తనమంత్రుల యిష్టప్రకారమే ప్రవర్తించవలసియున్నది. కాని సాధారణముగా ఆతడికోర్కెలను కొంతవరకైన సఫల పరచుటకు మంత్రులు సమ్మతించుచుందురు. దేశసేవను సాంఘికసేవను చేసిన యుత్తమపురుషుల గౌరవింప ఆతడు

పూనుకొనుచో మంత్రివర్గము అభ్యంతరపెట్టదు. కనుక సర్వ పక్షసమానభావము కల్గిన రాజ్యాంగాధ్యక్షునకు దేశసేవా తత్పరుల గౌరవించునవకాశము కల్గుచుండును.

విదేశ రాజ్యాంగ ప్రతినిధుల సమావేశములందు తన దేశీయుల తరఫున గౌరవమర్యాదల నిచ్చిపుచ్చుకొనుటకు విదేశాంగవ్యవహారములందు తనప్రజల పేరు ప్రతిష్ఠల నిల్పు టకు రాజ్యాంగాధ్యక్షుడు వ్యవహరించ నగును. సాంఘిక, మత, నైతికజీవితములందు దేశపుగౌరవమును ప్రకటించుట కాయనకే సావకాశము కల్గును. ఏదేనొక రాజకీయపక్ష మును జెందిన ప్రధానమంత్రికంటె నాతడే సర్వజనులకు గౌర వపాత్రుడును ఆదరపాత్రుడు నగును.

మంత్రివర్గము నేర్పరచు నెడ ఆతనికి, దేశసేవచేయు టకు తన శక్తిసామర్థ్యములజూపి తనపెత్తనము కొంతనడ పుటకు చాలయవకాశముకల్గును. మైనారిటీపక్షపునాయకుని ప్రధానమంత్రిని జేయుటా ? లేక, ప్రధానమంత్రికే కామన్సు సభను అంతమొందించు అవకాశమిచ్చుటా ? యనునది ఇంగ్లాండునందు ఆయనే తీర్మానించవలెను. కామన్సుసభయందే మెజారిటీ మంత్రివర్గమున కెదురగుచో ప్రతిపక్షనాయకుని ప్రధానమంత్రిగా ఆయన (రాజు) నియమించవచ్చును; లేదా, కామన్సుసభ యంతమొందించి తిరిగి యెన్నికలజరిపించవ చ్చును. ఎన్నికలైనపిమ్మట ప్రధానమంత్రిగారి బలగములు

మరింతతగ్గుచో, ఆతని ఉద్యోగమునుండి పంపివేసి ప్రతిపక్ష నాయకుని మంత్రివర్గమేర్పరుప ఆయన కోరవచ్చును. రెండే రాచకీయపక్షములుండునంత కాలము రాజుగారు ఈపరిస్థితు లందంతగా స్వాతంత్ర్యముబొందజాలకుండును. కాని ప్రతిపక్ష మునకు ఇద్దరుముగ్గురు నాయకులై యుండ వారిలో నెవరును ప్రాధాన్యతబొందకుండు నెడల రాజుగారు వారిలో తనకు నచ్చినవారిని మంత్రివర్గమేర్పరచ పిలువనంపవచ్చును. తమ నాయకుడే ప్రధానమంత్రియగును గనుక, ఆపక్షీయులు రాజుగారికోర్కె ననుసరించి మంత్రివర్గము నేర్పరచుటకు తగుసహాకారమొనర్చెదరు. అటులగాక, మూడు రాచకీయ పక్షములుండి ఏయొక్కపక్షమునకు, మెజారిటీ కలుగనిచో ఇదివరకే అధికారముండున్న పార్టీనే మంత్రివర్గమునందుంచ నగునా? లేక ప్రతిపక్షమందలి రెండుకక్షలలో నెవ్వరికి మంత్రివర్గము నేర్పరుప నవకాశమివ్వవలెనో తీర్మానించుభా రము రాజుపైపడును. అప్పుడాతడు తనకునచ్చినపార్టీకే మం త్రివర్గము నేర్పరుప నధికారమొసంగనగును.

ఫ్రాన్సు, జర్మనీ వగైరాదేశములందు ఐదారురాచ కీయబృందములుండుటయు, ఏ రెండుబృందములకు ప్రజాప్రతి నిధిసభయందు మెజారిటీ కలుగకుండుటచే, మూడు నాల్గు బృందముల నొక సమ్మేళనమందు జేర్చుకొని మంత్రివర్గము నేర్పరచుటకు వీలులేదు. కనుక ప్రెసిడెంటుగారు (రాజ్యాం

గాధ్యక్షుడు) ఏబృందపునాయకుని పిలిపించి మంత్రివర్గమే ర్పరుప కోరవలయునో తీర్మానించవలెను. అంత తగుసమ్మే ళన మేర్పరచుటయు ఆనాయకునకు వివిధబృందములచేర దీసి వారివారి కార్యప్రణాళికలను మొత్తముమీద సరిపోవు నమ్మేళకార్యక్రిమ మేర్పరచి వివిధరాచకీయనాయకులమధ్య సఖ్యత నేర్పరచుటకు ప్రెసిడెంటునకు అత్యంతము గు అవకా శము కల్గుచున్నది. ఇందువలన ప్రెసిడెంటున కిష్టుడగునాయ కుడు ప్రధానమంత్రియగుటకు ఆతని ఆదరముబొందువారు మంత్రులగుటయు, ఆయునకు సంతృప్తికలిగించు బృందములు మంత్రివర్గమందు జేర్పబడుటయు సాధ్యముగుచుండును. ఇం గ్లాండాదిగాగల దేశములలో రెండు లేక మూడే రాచకీయ పక్షములుండుచో, మంత్రివర్గము నేర్పరచి దాని కార్య ప్రణాళికను స్థిరపరచుటకు ప్రధానమంత్రి కెక్కుడధికార ము, అవకాశముకల్గుచుండ వివిధబృందములకల్గిన జర్మనీ, ఫ్రాన్సు ఆదిగాగల దేశములందట్టి యవకాశములు హె చ్చుగా రాజ్యాంగాధ్యక్షునకు (ప్రెసిడెంటు) దక్కుచున్నవి. కనుకనే, జర్మనీ, ఫ్రాన్సులందు ప్రెసిడెంటు రాచకీయవ్యవ హారము లందత్యంతప్రాముఖ్యతనొందుచున్నాడు. ఇట్టియవకా శము తమగవర్నరుజనరలునకు లేకుండుటకై ఐర్లండునందు ప్రధానమంత్రి "డెయిలుఐరీను" వలన ఎన్నుకొనబడవలెనని నిర్ణయించిరి. మొత్తముమీద ఐర్లాండుపద్ధతియే యుత్తమ

మైనది జన్యాసుపద్ధతిప్రకారము ప్రెసిడెంటు రాజ్యాంగమున అత్యధికాధికృతబొందుట శ్రేయముగాదు. మతసంబంధమైన యుద్యోగులు న్యాయమూర్తులు, వగైరా ప్రధానోద్యోగుల నియమించుటలో ఇంగ్లాండాదిగాగల అన్ని ప్రజాస్వామికరాజ్యములందును (అమెరికాతప్ప) రాజ్యాంగాధ్యక్షునకు కొలదిగా పెత్తనములభించును. అన్నిపక్షములకుజెందిన యోగ్యులను రాజులేక ప్రెసిడెంటు యెరింగియుండును. రాచకీయపక్షములకు సంబంధించని యుద్యోగములకు అట్టి యోగ్యులలో నెవ్వరినైన నియమించవలెనని, తన మంత్రివర్గమునకు సూచించనగును. సాధారణముగా అతని సూచనలు మంత్రివర్గమువారిచే సంగీకరింపబడును.

ఆర్డినెన్సుల ప్రకటించి నిర్బంధవిధానమును బయలుదేరదీసి అకస్మాత్తుగాకల్గిన రాజకీయవిపత్తుల గడుపప్రయత్నించు మంత్రివర్గమువారికి ఆతడు తన యభిప్రాయమును తెలియుపరచవచ్చును. ఒకటి రెండు వత్సరములవరకే పెత్తనముండు మంత్రివర్గపుసభ్యులకంటె ఐదువత్సరములవరకు లేక, ఏడువత్సరములవరకు ఉద్యోగమందుండు వాతడు (ఇక రాజులసంగతి వేరుగా చెప్పనగత్యములేదుగదా) రాజ్యాంగావసరములెట్టివో అసాధారణరాచకీయప్రక్రియ లెంతవరకెట్లుపయోగింపనగునో, మంత్రివర్గమువారికి తెలియజేయనగును. మంత్రివర్గమునందలి సభ్యులు సాధారణముగా యను

భవపరులై అనేకమారులు మంత్రులై యుండినవారైనను రాజ్యాంగాధ్యక్షునిగా నుండువారుకూడ, రాజకీయానుభవపరులైయుందురుగాన, వారిని ప్రతిఘటించి తన వాదమును ప్రకటించి, మంచిచెడ్డల, వారితో విచారించవచ్చును. తమకు, ఆయనయెడ గౌరవాదరములుండునుకనుకను, ఆతని యామోదము తాము అవలంబించతలచిన చర్యలకగత్యముకనుకను, ఆతనికి తగినట్లు సమాధానమిచ్చి, ఆయనను సమాధానపరచుటయే లాభకరమని మంత్రివర్గము వారు సాధారణముగా తలంతురు కనుక, మెజారిటీయుండున్న పార్టీవారు తమ ప్రతిపక్షులపైగాని, ప్రజాసంఘములపైగాని విపరీత నిర్బంధవిధానము నమలుపరచకుండ కొంతవరకతడు ప్రయత్నించనగును. జర్మనీయందు ప్రెసిడెంటు హిండెన్‌బర్గుగారట్లుగాక, నాజీపార్టీవారికి సుముఖుడై వారిదౌర్జన్యపద్ధతుల వంక కనుమూసి, మంత్రివర్గమువారు సోషలిస్టులు కమ్యూనిస్టులపై నిర్బంధముల ప్రయోగించుచుండ ప్రోత్సహించుచు సంఘవిద్రోహము కల్గించుచున్నాడు. కాన, ప్రెసిడెంటునకీయవకాశము, సంఘసేవచేయుటకును, సంఘవిద్రోహము కల్గించుటకును ఉపయోగపడును.

శాసననిర్మాణమందు, రెండుశాసనసభలమధ్య భేదాభిప్రాయములు కల్గి, ప్రజాప్రతినిధిసభవారిచే నంగీకరింపబడిన బిల్లును సెనేటుసభవారు నిరాకరించుచో, రెండుసభ

లనాయకుల బిలిపించి, వారితో దేశావసరముల గూర్చి ముచ్చటించి ఏదేనొకవిధముగా వారిమధ్య సఖ్యతకల్గించి, వివాదగ్రస్థమగుబిల్లును తగురీతి సవరణజేయించి రెండుసభలవలన నయ్యదంగీకరింపబడునట్లు చేయుటకు రాజ్యాంగాధ్యక్షుడు సహాయపడవచ్చును. మంత్రివర్గమందున్న నాయకులు, ప్రతికక్షియందున్న నాయకులు, వియ్యములందుట వారి యనుచరులకు అయిష్టత కల్గించును గనుక, అవసరముకల్గినప్పుడెల్ల ఇరుపక్షములమధ్య నేదోనొక యొడంబడిక నేర్పరచుకొనుటకు ప్రత్యేకముగా కలువవలయుననిన, రాజ్యాంగాధ్యక్షుని పిలుపుపై వారి యధ్యక్షతక్రింద జేరి మంచిచెడ్డల విచారించుకొని రాజ్యాంగావసరముల తీర్చుకొనుటకు నిర్భయముగా ప్రయత్నించవచ్చును.

వంశపారంపర్యాయతా రాజ్యాధికారము బొందు రాజులకు, ప్రెసిడెంటులకంటె హెచ్చు అనుభవముకల్గుట సాధ్యముకనుకను, వారియెడ ప్రజలు హెచ్చుగౌరవము భక్తి కలిగియుందురుకనుకను మంత్రివర్గముపై వారికి ఇంకను హెచ్చుప్రాపకము కల్గుచుండును. కనుకనే జాతీయావసరము, ఆర్థికసంక్షోభమువలనకలుగగా, ఇంగ్లాండునందు, శ్రీమాక్డునాల్డుగారిని జాతీయమంత్రివర్గము నేర్పరచకోరి, ఆయనకు ప్రత్యర్థియగు శ్రీః బాల్డ్విను గారి నామంత్రివర్గమందు జేరునట్లేర్పరచుటకు, ఐదవజార్జిగారికి సాధ్యమయ్యెను.

దేశాంతర్గతముగా విప్లవము తటస్థించినగాని, విదేశములతో యుద్ధముతప్పనియెడలగాని, దేశముపేరిట, దేశీయులందరిని, తగురీతి త్యాగముచేసి, రాజ్యాంగమును రక్షింపుమని కోరుట రాజ్యాంగాధ్యక్షుని ధర్మము. పక్షనాయకుల ప్రకటనలకంటె, ఆతనిప్రకటనసే ప్రజలాదరింతురు. ఆయన యొక్క పిలుపునకే దేశీయులు "ఓ" యందురు. ఆయనే, అట్టి సమయములందు దేశమాతయొక్క ప్రతినిధిగా పరిణమించ గలడు.

---

## పంద్రెండవ ప్రకరణము.

---

రాజకీయ పార్టీలు.

ప్రజాస్వామిక రాజ్యాంగములన్నిటియందును ప్రజాసామాన్యము తమవోటుహక్కును క్రమముగా నుపయోగించి తమ ప్రభుత్వము దేశలాభాభివృద్ధికై దేశీయుల శ్రేయోభివృద్ధికై, ప్రజాభిప్రాయమనుసారము నడచుకొనునట్లు చేయవలెనన్న, తమలోతాము సహకారమొనర్చుకొనుచుండుట గత్యము. ఎవరికివారే యను సిద్ధాంతమనుసారము వోటరులు ప్రవర్తించుచో ప్రజాప్రతినిధులును, వారిపై యేమాత్రమభిమానముంచక స్వాభిమానులై, స్వార్థపరులగుదురు. మంత్రివర్గము నిరంకుశముగా రాజ్యపాలనము చేయ మొదలిడును. ప్రజాప్రతినిధుల నెన్నుకొనుటకు ప్రజలు సంఘీభావమొంది తగుప్రయత్నములు చేయవలసి యుండును. ఎట్టియభ్యర్థుల పంపవలెను, తమ ప్రతినిధు లెట్టికార్యములసాధించపూనుకొనవలెనని తీర్మానించుటలో ప్రజలెల్ల రేకాభిప్రాయులు కాజాలరు కనుకనే కొందరొకవిధమగు అభ్యర్థుల, కార్యప్రణాళికల, మరికొంద రితరఅభ్యర్థుల, కార్యప్రణాళికల బలపరచుట సహజము. ఇటుల ఒకేవిధమగు రాజకీయాభిప్రాయములుకల్గిన వారెల్లరు, శాశ్వతమగు, లేక, తాత్కాలికమగు సంఘీభావము, భ్రాతృభావముబొంది, తమతమసంఘములస్థా

పించుకొనుటయు సామాన్యవిషయము. ఇట్టిసంఘములు, క్రమముగా ఆయా ప్రజలస్వభావమున ననుసరించి, ఒకదానితో నొకటి సమాకారము చేసుకొనుచు దేశము మొత్తమునకు, రెండు మూడు పెద్దపక్షములుగా నేర్పడనగును. ఇదేవిధముగా ఇంగ్లాండు, అమెరికా దేశములందు రెండు లేక మూడు రాచకీయపక్షములు కలవు. మరికొన్ని దేశములందు (ఫ్రాన్సు, జర్మనీ, స్పెయిను, ఇటలీ,) ప్రజలు త్వరితముగా కోపగించుకొనువారును, తమకునచ్చిన యభిప్రాయముల నేమాత్రముగాని, మార్పుజెందించుకొనుట కయిష్టులును, తమ బృందముల వృద్ధియే ముఖ్యావసరమనుకొనువారును హెచ్చుగాయుండుట వలన వివిధరాచకీయ బృందములు నిలబడుటయు సాధ్యము.

ఇట్టిపక్షములు, లేక బృందములు ప్రజలమధ్య రాచకీయవిషయికజ్ఞానము కల్గించుటకు, వివిధవిషయముల గూర్చి తగునభిప్రాయముల ప్రచారము చేయుటకు నుపయోగపడుచుండును. రాచకార్యనిర్వహణభారము వహించుటకు తగు సమర్థులగు నాయకులకు దోహదమునొసంగి, ప్రజాభిప్రాయమును రెచ్చకొట్టుచు, ఆయభిప్రాయమును సక్రమముగా ప్రకటించుచు, ప్రభుత్వచర్యల ప్రజలకు తెలియబరచుచు రాజ్యాంగపుమంచిచెడ్డలగూర్చి ప్రజలకండ్లు దెరచుటయు ఈ పార్టీలధర్మమైయున్నది. ఇందులకుగాను, ప్రతి కాలమునందును, రాచకీయ ప్రచారము సాగించుచుండవలెను. జనర

లు ఎన్నికలు ఒకటిరెండువత్సరములలో రానున్నవనగానే, ప్రజలకు తమరాచకీయపరిణాళిక లెట్టివో, తమనాయకు లెవ్వరో, తమఅభ్యర్థులెవ్వరో, తెలియపరచవలెను. అప్పుడే పౌరులకు తమవృత్తమంతయు తెలియుటకు సాధ్యమగును. అప్పుడే తమమధ్య పౌరులు యోగ్యతాయోగ్యతల తేల్చి తమ యభిప్రాయప్రకారము తమకు ఎన్నికలందు పెత్తనము గట్టుటకు సాధ్యమగును.

కనుక ప్రజలకెప్పుడుకూడ, పేరుపొందిన మంచిన డతకల్గిన యోగ్యమగు నాయకులగత్యము. ఈ నాయకులు తమంతతామే, ప్రజలకు తెలియపరచుకొనుట యీదినములందు దుస్సరము. అటులనే అభ్యర్థులకును, సరాసరిగా, ప్రజలందరికి తమయభిప్రాయముల తెలియబరచుకొనుట దుర్ఘటము. ఎన్నికలందు అభ్యర్థులెల్లరు తమంతతామే ప్రజలమధ్య ప్రచారముచేసుకొనుటచే వారెట్టివారో ప్రజలు తెలుసుకొనుట అసాధ్యము. కనుకనే ప్రజలందరిచే అభిమానించబడు రాచకీయపార్టీలు వీరికిశరణ్యమగుచున్నవి. పార్టీలు ప్రదర్శనశాలలు. వానికార్యప్రణాళికలు ఆప్రదర్శనశాలలందు ప్రథమలక్షణములు. అభ్యర్థులు, వారినాయకులు అందుప్రదర్శించబడు సుందరవిగ్రహములు కనుక రాచకీయపార్టీలు తమయీఅభ్యర్థిప్రదర్శక ధర్మములను సక్రమముగా నిర్వర్తించుట పాడి.

రాజ్యాంగావసరముల దీర్చుచు, ప్రజాస్వామికమును జయప్రద మొనర్చుచు, ప్రజలరాచకీయాభివృద్ధి కల్గించుటకు, రాచకీయ పక్షలుపయోగపడవలెనన్న, ఆపక్షలు రాజ్యాంగవిధానములవలెనే, సాధ్యమైనంతవరకు చిరకాలజీవులై యుండుట శ్రేయము. మాటిమాటికి మార్పులుబొందు పక్షములు, అచిరకాలములోనే అదృశ్యమగు పక్షములు, నిలకడలేని ప్రజలచే నవమానింపబడు నాయకులు గల్గిన పక్షములు దేశమునకు హానికల్గించును. కనుక సాధ్యమైనంతవరకు రాచకీయపక్షములను ధర్మసూత్రములపై నాధారపరచి, ధర్మబద్ధ మొనర్చి క్రమక్రమముగా ప్రజావసరముల కనువగునట్టి మార్పులను వాని కార్యప్రణాళికలందు కల్గించుచుండుట మేలు. అట్టి పక్షములు శాశ్వతముగానుండి ప్రజల యభిమానమును జూరగొనవలయునన్న ప్రజలందరికి వాని యందు జేరుటకు హక్కుయుండుట అగత్యము. ఈపార్టీల యొక్క నాయకులును చీటికిమాటికి తమ కార్యప్రణాళికల మార్చక నిలకడకల్గి నమ్మకస్థులై ప్రజలకు ముందుదారి దీయుచు, ప్రజలమేలునే వాంఛించువారై యుండవలెను.

ఈపక్షములు తమయభ్యర్థుల నెన్నుకొనుటలో నెట్టి జాగ్రత్తగైకొనవలెనో యిదివరకే వివరింపబడెను. వాని కార్యప్రణాళికలుగూడ వానిసభ్యులందరికి ఆమోదితముగా నుండవలెను. ఇందులకుగాను గ్రామ, పట్టణ సంఘములందు

తాలూకా, జిల్లాసంఘములందు జాతీయసంఘములందు ఈ ప్రణాళికలు చర్చింపబడవలయును. ప్రతి ఉపసంఘమునకు సవరణల ప్రతిపాదించునధికారముండవలయును. బహిరంగసభలయందు ప్రజలచే వివిధపక్షములప్రకారము సక్రమముగా చర్చింపబడవలయును. అప్పుడే ప్రజాభిప్రాయమునకు సమ్ముఖముగను, అంగీకారముగను రాచకీయపార్టీల ప్రణాళికలు యేర్పరచబడును. ఈప్రణాళికలయందు రెండు భాగములు చేర్చబడవలెను. ఒకటి, ఏయేసూత్రములననుసరించి రాజ్యాంగజీవనము జరుపబడవలెనో నిర్ణయించుట రెండు, ఆసూత్రానుసారము వెంటనే ఏయేరాజ్యాంగసంస్కరణము లగత్యమో సూచించుట. ఈప్రణాళిక ప్రజలందరికిప్రకటింపబడవలెను.

రాజ్యాంగమునందు ప్రజాభిప్రాయము ప్రకటించుటకై శాసనసభలెట్లు అవసరమగుచున్నవో, ప్రజాస్వామిక రాజ్యాంగపునాడకకు ఆధారమగు రాచకీయపార్టీల కార్యప్రణాళికల స్థిరపరచుటకును, ప్రజలెల్లరికి సర్వస్వాతంత్ర్యముండుటఅగత్యము. కనుకనె కొన్ని అమెరికారాష్ట్రములందు, పార్టీలఅభ్యర్థులు నియమింపబడునప్పుడు, ప్రణాళికలు నిర్ణయింపబడునప్పుడు, ప్రతిపౌరునకు పార్టీల ఉపసంఘసభలయందు పాలుగైకొనునధికార మీయబడుచున్నది. ఇంగ్లాండునందు లేబరుపార్టీయందుమాత్రము ప్రజాసామాన్యాభిప్రాయమునకు

తగుప్రాముఖ్యత యివ్వబడుచున్నది. ఇటలీయందలి ఫాసిస్టు పార్టీలోను, జర్మనీలోని నాజీపార్టీలోను, ప్రజాస్వామికము లేక బాధ్యతాయుత సూత్రమంగీకరింపబడక, నిరంకుశపాలనమె గలదు. రాచకీయప్రణాళికను తయారుచేయుటలోను, అభ్యర్థులనియమించుటలోను, పార్టీనాయకులు సంపూర్ణాధికారముగల్గియున్నారు. ఇటులనే సాధారణముగా, కమ్యూనిస్టు పార్టీలందును, కన్సర్వేటివుపార్టీలందును నిరంకుశతప్రాబల్యము గానున్నది. కనుకనే, ప్రజాసామాన్యమునకు ఇప్పటిపార్టీల ద్వారా తమయాభిప్రాయముల తెల్పుకొనుటకు తగునవకాశములుకలుగకుండుట విచారకరము.

ఇటుల ఏర్పరచబడిన రాజకీయపక్షములు, సాధ్యమైనంతవరకు అల్పసంఖ్యాకములుగుచో లాభకరము. బాధ్యతాయుతమంత్రివర్గపు ప్రభుత్వములుగల్గిన దేశములందు, మెజారిటీపక్షమునకే మంత్రివర్గమేర్పరచ నవకాశముకల్గుచున్నది. గనుక ఆమెజారిటీయందొక్కపక్షమేయున్న అత్యుత్తమము గును. అట్టి మెజారిటీపక్షము తనకార్యప్రణాళిక ననుసరించి, సాధ్యమైనంతవరకు ప్రజలకువలయు రాచకార్యముల నిర్వహించి తమ్మెన్నుకొన్న వోటరులకు సంతృప్తికల్గించుటకు సాధ్యమగును. ప్రజలకును, పెత్తనమందున్న పార్టీ నారెంతవరకు వారికార్యప్రణాళిక నములులో పెట్టిరో, అందువలన దేశమున కెంతలాభనష్టములుకల్గినవో విచారించుటకు సాధ్యము

గును. అటులనే ప్రతికక్షియందును ఒకే పక్షముండుచో, ఆ పక్షపు కార్యక్రమప్రణాళిక యెట్టిదో, అయ్యదెంతవరకు ప్రభుత్వమందలి పార్టీప్రణాళికకంటె యుత్తమమైనదో లేక తగ్గిపోవునదో తెలుసుకొనుటకు, ఆప్రతిపక్షమువారొనర్చు వాగ్దానములనే నమ్మినచో, ఏయే హెచ్చులాభములు చేకూరునో, వోటరులు కన్గొనుటకు సాధ్యము. మరియు, వోటరులు, సాధారణప్రతిభావంతులు, తీరికలేనివారు, రాచకీయ విజ్ఞానమంతగా లేనివారు కనుక వారికి రాచకీయ వ్యవహారములు త్వరగాబోధపడవలయునన్న, రెండేముఖ్యరాచకీయపక్షములుండుటమంచిది అంత ఏయే పార్టీలిట్టిముఖ్యరాచకీయ పద్ధతులకు నిలబడుచున్నవో, పెత్తనమందున్నపార్టీ తాను ప్రకటించిన బాధ్యతలనిర్వర్తింపుచున్నదో లేదో తెలుసుకొనుట సుగమము. ఎన్నికలసమయములందు రెండేపక్షములున్నచో తామెల్లు తమవోటుల నివ్వవలెనో వోటరులకు త్వరితముగా తెలియనగును

రెండుపార్టీలే యుండుచో, రాజ్యాంగాధ్యక్షునకు, ప్రధానమంత్రిని నియమించుటకును, ఆయనద్వారా మంత్రివర్గమును స్థాపించుటకునుసులభసాధ్యము. మరియు రాజ్యాంగాధ్యక్షునకు మంత్రివర్గనిర్మాణమందెక్కువ యధికారము, ప్రాపకము దక్కకుండును. అధికారమందున్నపార్టీ పదభ్రష్టతబొందుచో, మంత్రివర్గమేర్పరచుపక్షమెద్దియో ప్రజలకు

తెలిసియుండును గనుక మంత్రివర్గపక్షము మైనారిటీపక్షముల చరిత్రములను, చర్యలను ప్రజలు జాగ్రత్తగా విచారించుచు, న్యాయాన్యాయములు పాలించి తమవోటుల నెవ్వరికివ్వ నగునో తీర్మానించుకొనగల్గుదురు.

కాని ఫ్రాన్సు, జర్మనీదేశములందును, బ్రిటిషువారి అధినివేశరాజ్యాంగములందును తుదకుమన దేశమందును, రెండుపక్షములే యుండుట దుస్సాధ్యమగుచున్నది. పక్షములకు బదులు, బృందములేర్పడుటయు, అవ్యాపి ఐదారుగాయుండుటయు, అనుభవసిద్ధము. ఇందువలన ఏయొక్క బృందమునకు ప్రజాప్రతినిధిసభయందు, మెజారిటీదొరకుట లేదు. కనుక మంత్రివర్గమెల్లప్పుడు బృందముల సమ్మేళనముల ద్వారాయే యేర్పరుపబడుచున్నది. మంత్రివర్గముల నేర్పరచునప్పుడు, వానిని నిల్పునప్పుడు రాజ్యాంగాధ్యక్షునకు చాలజోక్యము కల్గుటయు, తన్మూలమున బాగోగులం కల్గుటకు అవకాశము కల్గుచుండును. పైగా ప్రజలకు ఎట్టిబృందములు మంత్రివర్గమందు జేరనున్నవో, ఎన్నికలసమయమందు దెలియరాదు. ఏయే బృందములు ఏయేతప్పిదములొనర్చినవో, ఏవియేబృందముల కంటె హెచ్చు శిక్షార్హములో లేక భూషణీయములో విచక్షణచేయుటకు పౌరులకసాధ్యమగుచుండును. కనుకనే అనేకమారులనేకతప్పిదములనొనర్చుచుండు బృందములే ఈదేశములందు పదేపదే ప్రజలయాదరమును బొందుచుండుటతటస్థించుచున్నది.

జర్మనీయందు మాత్రము, ప్రపోర్షనల్ ప్రాతినిధ్యసూత్రము ప్రకారము ఎన్నికలు జరుగుచుండుట చేతను, అభ్యర్థుల జాబితాలను ప్రతిపక్షము తయారు చేయవలసి వచ్చుచుండుట వలనను, ఎన్నికలకు ముందే, అభ్యర్థులెల్లరు తమతమ రాచకీయపక్షముల నిర్ణయించుకొనవలసివచ్చుచున్నది. అటులనే, ఆస్ట్రేలియాయందును, అభ్యర్థులు వివిధపక్షములకు ఎన్నికలకు పోకముందే తెల్పుటకలదు. కాని, ఫ్రాన్సు, ఇండియాలందు మాత్రము సభ్యుల నేకులు, తాము ప్రజాప్రతినిధిసభలకు వెళ్లినపిమ్మట, తమ పక్షముల నిర్ణయించుకొనుచుండుట కలదు. ఇది కొంతయు యాసర్థదాయకమగు అలవాటు. ఇందువలన, వోటరులు మోసమొందుటయు, ప్రజాస్వామికము బలహీనత బొందుటయు జరుగును.

బృందముల ప్రాబల్యత క్రమముగా ప్రతిదేశమందు నొకప్పుడు హెచ్చుచుండెడిదిగాని, వానిసంఖ్యకు యొక పరిమితి కలదు. ధనికుల ప్రాబల్యతకోరు బృందములు కొన్ని, బీదలమేలుకోరునవి కొన్ని, ఇద్దరిమధ్య సామరస్యతగానుండునట్టి ప్రణాళికలనంగీకరించునవి కొన్ని, మూడుతరగతులుగా, ప్రతిదేశమందును, రాచకీయబృందములు కూడుచున్నవి. రెండేపక్షములుండిన, ఇంగ్లాండు, అమెరికా దేశములందుకూడ, మూడుపక్షములు నిలకడజెందుచున్నవి. మూడుసమ్మేళనముల బొందినబృందములద్వారా కొంతవరకు రెండుపక్షములవలన కలుగదగు లాభముల బొందుట కవకాశము కలుగవచ్చును.

ఈ విధపక్షములమధ్య, పౌరులు విచక్షణచేసి కొంద రొకపక్షమును, మరికొందరుమరొకపక్షమును అభిమానించ వలయుననన్న, ప్రతిపక్షము, ప్రజలకుగాప్రిహ్యామగు, త్వరగా గుర్తింపదగు, రాచకీయావసరములకు సంబంధించిన, ప్రధా నసూత్రములను కల్గియుండవలెను. జర్మనీయందు నాజీపార్టీ వారు, ధనికులతరఫున నిరంకుశపెత్తనమునకు, కమ్యూనిష్టు లు కార్మికులతరఫున నిరంకుశపెత్తనమునకు, మధ్యపక్ష ములు ధనికుల పరముగాను, సోషలిస్టులు కార్మికుల పరముగాను, నిలబడుచున్నారని తెలియుచున్నది. అటులనే ఇతరదేశములందును, తామేయేపార్టీలకు, ఏయేప్రత్యేకలా భములకల్గించుటకై తమవోటునివ్వవలెనో ప్రతివోటరు తెలు సుకొనగల్గుటవసరము ఇంగ్లాండునందలి పార్టీలప్రధానసూ త్రములు, పరస్పరముగా భేదించి, గుర్తించతగినట్లున్నవి. కాని అమెరికాయందట్లుగాక, కార్మికులకుసంబంధించినపార్టీ యేకాక, ధనికులకు సంబంధించి, ఒకేవిధమగు రాజ్యాంగ ప్రణాళికలగల్గిన రెండుపక్షము (డెమోక్రాటికు, రిపబ్లికను) లుండుట నష్టదాయకమైయున్నది. కనుక, ఎల్లప్పుడు, ఒకే రాజ్యాంగదృక్పథముకల్గి, ఒకేగమ్యస్థానముజేరదలచిన బృంద ములు, సమ్మేళనములోచేరుచో, సాంఘికసేవచేయనగును. ఇటుల వివిధబృందములమధ్య సఖ్యతకల్గించి, రాచకీయ ప్రధానపక్షముల నేర్పరచువారు ఘనమగుసేవచేయగలరు.

పౌరులు తమరాచకీయాభిప్రాయములు సాఫల్యతనొందుటకుగాను, తమకుసమ్మతమగురాచకీయపార్టీలనుస్థాపించి, నడపుకొనుటకుస్వాతంత్ర్యమగత్యము. ఆపార్టీలు తగుపెత్తనము చేయమొదలిడినపిమ్మట, పౌరులహక్కుల దిక్రమింగకుండను, పౌరులయిష్టానుసారముల గమనించకుండను, నిరంకుశముగా స్వార్థపరులగు, సంకుచితాభిప్రాయులగు అభ్యర్థులనియమించకుండను తగుశాసనబద్ధమగు నియమముల నేర్పరచవలెను. రాచకీయపక్షములు ఎన్నికసమయములందు సక్రమమగురీతి, ప్రచారమొనర్చుటకు హక్కు ప్రసాదించవలెను. కాని, ఇప్పుడు జర్మనీ, ఫ్రాన్సుదేశములందువలె, కమ్యూనిస్టులు, నాజీపార్టీవారు, సాయుధులగు ఐచ్ఛికసేవకులు సిపాయీలసాయముతో, ఒకరితోనొకరు వివాదపడి, ఘోరకృత్యముల నొనర్చుటకూడదు. వివిధవ్యక్తులు ఒకరితోనొకరువివాదపడికొట్లాటలకు దిగకుండుటకై రాచకీయచర్యలను శాంతియుతముగ గౌరవప్రదముగ, న్యాయసూత్రానుసారముగా జరుగుటకై పార్టీలేర్పడుచున్నవి. కనుక, ఆయుధములను పార్టీలు తమచర్యలప్రాబల్యతకై యుపయోగించరాదు. కనుక, ఏపక్షమువారుగాని, సాయుధులగుప్రచారకులనియమించరాదనియు, సాయుధులగు ఐచ్ఛికసేవాదళముల నిర్మింపరాదనియు, శాసించుట అగత్యము. ఇప్పుడు జర్మనీయందు నాజీపార్టీవారికి, ఒకప్పుడు ఇటలీయందు ఫాసిస్టుపార్టీవారికి, ఈవిషయమందు, ప్రభుత్వము సర్వస్వాతంత్రితనిచ్చుచుండుట దురన్యాయము.

రాచకీయపార్టీలకు, ఈదినములందు అత్యధికముగా ధనసహాయమావశ్యకమైయున్నది. పత్రికలను, పుస్తకములను ప్రకటించి, సభలనేర్పరచి, వక్తల బిలిపించి, ప్రచారకులనియమించుటకు ధనమావశ్యకము. దేశమందన్ని యెడల ఉపసంఘములు బెట్టి, సభ్యుల జేర్చి క్రమముగా ప్రజలెల్లరికి, తమతమ పార్టీలెట్టి కార్యప్రణాళికల సాధించుటకై నిలబడియున్నవో తెలియజేయవలెనన్న ధనము కావలెను.

ఈధనసహాయమును, ప్రతిపార్టీయును, తనసభ్యుల ద్వారా, చందారూపకమునను, ప్రత్యేక దానరూపకముగను బొందవచ్చును. ధనికులగు అభ్యర్థులు, తమ యెన్నికలకగుఖర్చులనేకాక, పార్టీకి యెన్నికలందుపయోగించుటకై కొంతధనమిచ్చుచుండుట, పాశ్చాత్యదేశములందు మామూలైనది ఇంతియే కాక, ధనికులు, వ్యాపారులు, ఆదిగాగలవారు, తమతమశక్తి కొలది, పార్టీమూలధనమునకు, దానములొసంగుట పరిపాటిగానున్నది. కాని యీపద్ధతులవలన, అనేకసమయములందు, రాచకీయపార్టీలు, ధనికులకు కృతజ్ఞతజూపవలసియగుచుండుట, ఇంగ్లాండునందు, పారాయనుల తయారుచేయువారికిని, అమెరికాయందు వాణిజ్యాధికారులకును, స్వీడను, నార్వే, ఫ్రాన్సు, జర్మనీలందు ధనికులకును, సాంఘికవాదులు, సమష్టివాదులుతప్ప, మిగతారాచకీయపార్టీలులోబడిపోవుచున్నవి. మనరాజధానియందుకూడనుజస్టిసుపక్షముక్రమముగాజమీం

దారుల, ధనికుల హస్తగతమగుచున్నది. ఈపరిమార్పుప్రజాస్వామికమునకు ప్రజాసామాన్యపుహక్కులకు భంగకరముగనుండుననుకనుకను, రాచకీయపార్టీలు కూడ ప్రజాస్వామికమై, ప్రజాసామాన్యావసరముల దీర్చుటకు నిలబడవలెను కనుక, రాచకీయపార్టీలకు, సభ్యులుమాత్రమే చందాలు యిచ్చునట్లును, సభ్యులెల్లరొకేవిధమగుచందాలు చెల్లించునట్లును, వర్తకవాణిజ్యాదులతో సంబంధించినవారివద్దనుండి, దానముల పొందకుండుటకై తగుశాసననిర్మాణమును చేయుట అగత్యము. కార్మికులపార్టీకి, కార్మికులపై రాచకీయప్రచారమునకుగా కొంతశిస్తువేయు నధికారమొసంగుట శాసనసభల ధర్మమైయున్నది.

రాచకీయపార్టీలు లేనిచో, ప్రజలు రాజ్యాధికారమును చేయజాలరు. ఆపార్టీలవలననే, ప్రజలు సంఘీభావము బొంది, తమస్వాతంత్ర్యము వ్యక్తిపూర్వకముగా మించి, రాజ్యాంగవ్యవహారములందు పెత్తనము చేయగల్గుదురు. పార్టీలబలమున్ననే, మంత్రివర్గము ప్రజాభిప్రాయమునను సరించి, రాజ్యము నడపునట్లు చేయుటకు సాధ్యమగును రాచకీయపార్టీలద్వారానే, ప్రజలందంతర్గర్భితమైనట్టి రాచకీయానుభవముల ప్రకటించి, రాచకీయాభిప్రాయములకు సానబెట్టి, మెరుగుబట్టించి ప్రాముఖ్యతకు తెచ్చుటకు వీలగును. పెత్తనమందున్నపార్టీని అదుపుఆజ్ఞలందుంచి, ప్రజలదృష్టినెల్లప్పుడు ప్రభుత్వచర్యల

వైబరపి, ప్రజాసామాన్యము నిద్రజెందకుండునట్లు జాగ్రత్త పడుటకు రాచకీయపార్టీలత్యధికోపయోగకరములు.

మనదేశమందనేకులు తలంచునటుల, రాచకీయపార్టీలు, సాంఘికైక్యత బోగొట్టి, గ్రామములందు వివాదముల గల్గించి, వ్యాజ్యముల వృద్ధిపరచనగత్యము లేదు. ఏయూరి వారు ఆయూరివరకు అభిమానముకల్గియుండుటవలనను, ప్రతిముఠాదారుడు, తనప్రత్యర్థిముఠాదారుడు తనవ్యక్తిపూర్వకపువిరోధియని తలంచుచుండుటచేతను, అట్టివికరీతములుకలుగుచున్నవి. ఇటులనే, నాజీలును కమ్యూనిస్టులును జర్మనీయందు తగవులాడుచున్నారు. ఈతత్వమును విడనాడవలెను. భేదాభిప్రాయముల బొందినవారియెడ సహనముకల్గియుండుట మనవారు ముఖ్యముగా నేర్చుకొనవలెను. అన్నిపక్షముల వారు దేశసేవాతత్పరులై, ప్రజాక్షేమమును వాంఛించుచో, పార్టీల వలన లాభమే చేకూరగలదు. మరియు, మనగ్రామములందు, ఏయొక్క ముఠాదారుక్రిందనో మూల్గుచుండు ప్రజలకు, పార్టీలందు చేరు స్వాతంత్ర్యముకల్గుచో, రాచకీయదాస్యము పోయి, స్వాతంత్ర్యము ప్రాప్తించి, మానవమాత్రులగుదురు. కులపెద్దలు, పురోహితులు వగైరాలక్రింద దాస్యపుబుద్ధికల్గి మ్రగ్గుచుండు ప్రజలు, పార్టీప్రోత్సాహమువలన, ఆత్మవిశ్వాసముబొంది, తలయెత్తి, స్వతంత్రపౌరులవలె తిరుగగలరు.

కాని మన దేశమందలి రాచకీయపక్షములలో (కాంగ్రెసుతప్ప) నెద్దానికి ఒక రాచకీయ కార్యక్రమపద్ధతిగాని, పేరుప్రతిష్ఠలుగాని లేవు. పార్టీలను సుస్థిరముగా నేర్పరచుట కెట్టి ప్రయత్నములు చేయకుండుటచే, వివిధబృందములు బయలు దేరనున్నవి. ప్రత్యేక సాంఘిక ప్రాతినిధ్యము కూడ నీబృందములవృద్ధికి తోడ్పడును. ఈకులములు, మతములపై నాధారపడు బృందముల చీల్చి చెండాడు, రాచకీయపార్టీలు బయలు దేరునప్పటి కెంత కాలము బట్టునో? మన బృందములు, పార్టీలకు, ఖర్చులకు వలయుధనము చేకూరు టెప్పుడో? మనప్రజలు ప్రభుత్వమును పార్టీలద్వారా నొద్దు అదుపులందుంచు టెన్నటికో?

పార్టీలప్రాబల్యతవలన ప్రజలయందు విద్వేషములు బలియుననికొందరనుమాట కొంతవరకు వాస్తవమే. ఒకపార్టీని బలపరచువారు, తదితరపక్షీయులజూచి అసహ్యించుకొనుటగాని అసమానత జూపెట్టుటగాని సాధారణవిషయము. కాని, ప్రజలయందట్టి, పక్షాభిమానము, సహజమైయున్నది. మామతా, మాకులము, మాజిల్లాయను అభిమానములెట్లో అటులనే మాపక్షము, మాపార్టీధర్మములు, మాప్రకటనలను అభిమానము ప్రజలకు కల్గుట సహజమైయున్నది. పార్టీలు లేకున్న వృధాయగు ప్రజాస్వామికము సకెట్టి, ప్రజలకు "మాపక్షము" అను అభిమానము సహాయభూతమగుచుం

చుచు అంత, తరతరములవారిగా ప్రజలు, తమపార్టీలయెడ నభిమానము జూపుచుండుటయు, వానిద్వారా, మంత్రివర్గములచే ప్రజాసేవ చేయించుటయు సాధ్యము.

రాచకీయపార్టీలు, ప్రజలమధ్యను తీరరాని విభేదముల కల్గించునేమో, దేశీయులమధ్య నైకమత్యమును అదృశ్యపరచునేమోయని కొందరు రాచకీయజ్ఞులు భయమందుచున్నారు. ప్రాన్సు, జర్మనీ ఆదిగాగలదేశములందు రాజ్యాంగపువిధానమునే తల్లక్రిందులు చేయవలెననియు, ప్రజాస్వామికమునకు బదులు నిరంకుశపాలనమే మంచిదనియు, తాము ప్రబోధించు రాజకీయార్థికాశయప్రాబల్యతయె ప్రజాభ్యుదయకారకమనియు, ఇతరకక్షీయులు దుర్మార్గులు, ప్రజాస్వత్వవిద్రోహులు, అమానుషచరితులు, అని బోధించుచు ధనికులతరఫున "ఫాసిస్టు" పార్టీయు కార్మికులతరఫున "కమ్యూనిస్టుపార్టీయు" స్థాపించబడి, ప్రాబల్యతబొందుచుండుట విచారకరము. ఈరెండుపక్షములును, ప్రజలను ఒకరిపైనొకరిని పురికొల్పుచున్నవి. శాంతియుతముగా తమప్రత్యర్థులుకూడ యోగ్యులగుమనుష్యులే యని భావించి వారియభిప్రాయములం దెంతవరకుసత్యము గర్భితమైయున్నదో చూతమను ఆతురత కగిలియుండుటకు మారు, తమప్రత్యర్థులెల్లరు అమానుషులని తలంచుచుండు నీపార్టీలు, ప్రజాస్వామికమునకు, బాధ్యతాయుతప్రభుత్వమునకు వేరుపురుగులవలె

నున్నవి. ఈలాటిపార్టీలే, దేశమునకు శ్రేయోదాయకము లుకావు.

ప్రజలమధ్యకల్గుచుండు ఆర్థికసమస్యల తీర్మానించుట కుగాను వివిధాభిప్రాయములు కల్గినవారు వివిధరాచకీయ బృందముల నేర్పరచుకొనుచుండుట సహజమైయున్నది. కాని ఈబృందములు సమ్మేళనములందుజేరి రెండో, మూడో ముఖ్యమగు రాచకీయపక్షములు సమకూర్చుట రాజ్యాంగ క్షేమమునకు మూలాధారమగును. వ్యవసాయికుల పక్షము కెనడా, ఐర్లాండు, ఆస్ట్రేలియాలయందు ప్రాధాన్యతబొందు చున్నది. లేబరుపక్షముతో పాటు, సోషలిస్టులు బలిష్ఠులగుచు న్నారు. ఇట్టిబృందములు తమకు సహజమగు సమ్మేళనము లందు (కార్మికులు, కర్షకపార్టీ) చేరునంతవరకు దేశోపయో గము జరుగగలదు.

ప్రజలయందు ప్రచారితమైయున్న మతములబట్టియు, జాతులబట్టియు, భాషలబట్టియు, రాచకీయబృందము లేర్పడు చుండుట కొన్నిదేశములందు కలదుగాని, ఆపద్ధతి లాభదా యకముకాదు. ఇటలీ, ఫ్రాన్సు, జర్మనీ, బాల్కనురాష్ట్ర ములు, ఐర్లాండునందు, రోమనుకేథలిక్కులు వేరుగా తమ పార్టీల నేర్పరచుకొనుటవలనను, వారికి ప్రత్యేకముగా ఆర్థి కసాంఘికవిషయములందు, కన్సర్వేటివులతోగాని, లేబరు పార్టీలతోగాని సంపూర్ణైక్యభావము కలుగకుండుటచేతను,

ఆధునికకాలపు ప్రజాజీవితమందు, సాంఘికార్థిక సమస్యలె హెచ్చుప్రాముఖ్యత బొందుచుండుటవలనను, ఈపక్షములు ఆయాదేశములందు, వివిధసమయములందు వివిధపక్షముల తో నేకీభవించుచు, రాజ్యాంగసమస్యలకు వైపరీత్యము కలిగించుచు, మంత్రివర్గములకు ఇదమిత్థమను కార్యవిధానము ను లేకుండ జేయుచు, ప్రజలకు తమవోటుల నెటులివ్వవలె నాయను గొప్పసంశయము తెచ్చిపెట్టుచున్నారు. కెనడా, స్విట్జర్లాండునందిట్లె భాషలబట్టి బృందము లేర్పడుటకలదు, దక్షిణాఫ్రికా, కెనడాలందును, బాల్కనురాష్ట్రములందును, వివిధభాషలకుజెందిన వివిధజాతీయులు, తమప్రత్యేక బృంద ముల నేర్పాటుచేసుకొని, తమలో తమకు సాంఘికార్థికసమ స్యాపరిష్కారముగూర్చి కలుగు భేదాభిప్రాయములకు ప్రక టనాస్వాతంత్ర్యము కలిగించక, అసహజమగు, అవమానకార కమగు జాతియభేదభావసంజనితమగు, బృందముల స్థాపిం చుచున్నారు. ఈయేర్పాటులు ప్రజాస్వామికమును వృథాచే యుటకుపయోగపడుచున్నవి. మనదేశమందిట్లె భాషలు, జాతులబట్టి రాచకీయపార్టీ లేర్పడునట్లు సూచనలు బలము గానుండుట దురదృష్టకరము.

పార్టీలద్వారా ప్రజలు స్వతంత్రాభిప్రాయములను బొంది రాచకీయసమస్యల చర్చించి నాయకులవలన మంచి చెడ్డలు తెలుసుకొని పరమత, సంఘ, భాష, జాతి, పక్షసహన మును అలవడజేసుకొని, ప్రతిప్రభుత్వాచర్యను, నాయకుని

ప్రకటనను, పార్టీపద్ధతిని విమర్శించి తమవోటుకు సార్థకత పరచి తన పౌరసత్వమును సక్రమముగా నుపయోగించు చున్ననే ప్రజాస్వామికమునకు రాచకీయపార్టీలు తగురీతి సేవచేయును. ప్రభుత్వము నెటుల ప్రజలు తమ పార్టీలద్వారా అనుపులజ్ఞలందించవలెనో, అటులనె తమ పార్టీలకూడ కడుంగడు శ్రద్ధతో తమ ధర్మముల నెరవేర్చునట్లు పౌరులు జాగ్రత్తపడవలెను. లేనిచో, అమెరికాయందలి పార్టీలవలెను మన దేశమందలి జస్టిసు మితవాదపక్షములవలెను ఇగ్లాండునందలి కన్సర్వేటివులవలెను పార్టీలునిరంకుశతబొంది తమకు నచ్చినరీతి తమకు ధనమిచ్చినవారికిగాను తమ్మునడపునారి లాభమునకై సంకుచితాభిప్రాయముల వెలిపుచ్చుచు, అనర్థదాయకమగు కార్యవిధానము నంగీకరించి దేశద్రోహకరమగు కార్యములజేయ సాహసించును. ప్రతిపౌరుడును తనకు నచ్చినపార్టీయం దెద్దానియందైనచేరి, తనకు తీరిక గలిగినప్పుడెల్ల పార్టీవ్యవహారముల విచారించి, పార్టీకిసేవ చేయుచు, పార్టీమంచిచెడ్డలగుర్తించి పార్టీనాయకులు ధర్మపథమునందుండునట్లు జూచుచుండవలెను. ప్రజలయొక్క ఆధిపత్యత పార్టీలపైహెచ్చుకావలెను. ప్రజలచేతనేపార్టీలునడుపబడవలెను. పార్టీనాయకులు స్వయంనిర్మితులుగాక, ప్రజాసామాన్యముచే నంగీకరింపబడినవారై యుండవలెను పార్టీకార్యప్రణాళికలు ప్రజలవివిధసంఘములద్వారా నిర్మితమైనవిగా నుండవలెను. అప్పుడే ప్రజాస్వామికము జయప్రదమగును.

## పదమూడవప్రకరణము.

### రషియా, టర్కీ, ఇటలీ రాజ్యాంగవిధానములు.

ఒకే రాజ్యాంగాశయములుకల్గి, ఒకే పక్షాభిమానులగు ప్రజలే ఎల్లప్పుడు రాజ్యాధికారమందుండుటకును, నిరంకుశులగు పార్టీనాయకులపెత్తనమే మొత్తముమీద సాగుటకును, అనాదినుండియు, ప్రయత్నములు జరుగుచునేయుండెను. రోమను సామ్రాజ్యమందు ప్రప్రథమమున "పెట్రీషియను"లె రాజ్యాంగాధికారమెల్లను పొందియుండిరి. అటులనే మనదేశమందును, అధికసంఖ్యాకులగు శూద్రులు, ఛండాలురు, "సామాన్యులు" రాజ్యాధికారముపొందలేకుండిరి. ఆపిమ్మట మధ్యయుగమందు ఇటలీ, హాలాండు దేశములందును పందొమ్మిదవ శతాబ్దారంభమువరకును ఇంగ్లాండునందును, ధనవంతులు, భూస్వాములే రాజ్యాంగములను తమ యధీనమందుంచుకొనుచుండిరి. కనుక ఈశతాబ్దమునందు ఇటలీలో ధనికులు భూస్వాములును రషియాయందు కార్మికకర్షకులును తదితరప్రజనుండి రాజ్యాధికారమును తప్పించి తమహస్తములందే యుంచుకొన బ్రయత్నించుటలో ఆశ్చర్యమేమియు లేదు. ఐతే, ఆకాలమందలి ధనికులు, భూస్వాములు తామొక పక్షమని తలంచి తదితరులకు రాజ్యాంగాధికారమొసంగుటకు తిరస్కరించియుండలేదు. తదితరులు రాజ్యాంగాధికార

ములొందుటన్న నెట్టిదో వారికాకాలమున తలంచరానిదై యుండెను. బీదసాదలపై తాము పెత్తనముజేయుట సహజము దైవదత్తమనివారు తలంచుచుండిరి. ఇప్పుడట్లుకాక ధనికులు, భూస్వాములు కార్మికులను లొంగదీసి, రాజ్యాధికారము తమ పరమునందుంచుకొనకున్నచో తమ స్వత్వములురూపుమాయునని భయమందుచుండుటచేతనే ఇటలీయందు, ఫాసిస్టుపార్టీవారు "డిక్టేటరుషిప్పు" సాగించుచున్నారు. అట్టినిరంకుశరాజ్యాధికారమునే ధనికులు, భూస్వాములు, కర్మాగారాధిపతులు పొందవలెనని 'ఫాసిస్టు పార్టీలను" జర్మనీ, ఫ్రాన్సు, బాల్కనురాష్ట్రములందేర్పరచ ప్రయత్నించుచున్నారు. అదేవిధముగ ధనికులను భూస్వాములను పదభ్రష్టులజేసి, కర్మాగారాధిపతులకు యజమానులకు రాజ్యాధికారములేకుండజేసి, కార్మికుల సార్వభౌమత్వము స్థిరపరచవలెనని రషియాయందు కమ్యూనిస్టులు ప్రయత్నించి చాలవరకు జయముబొందుచున్నారు. వారివలెనే తదితరదేశములందును కార్మికులరాజ్యాధికారము స్థిరపరుప కమ్యూనిస్టుపార్టీవారు ప్రయత్నించుచున్నారు.

ఈరెండువిధములగు పార్టీల రాజకీయమునకు సంబంధించకయే, కొన్నిదేశములందు "జాతీయపక్షములు" తమతమ జాతీయసాంప్రదాయసంరక్షణకై, స్వాతంత్ర్యా

టర్కీ.

భివృద్ధికై తమ నిరంకుశాధికారమును, ఆయా

రాజ్యాంగములపై నేర్పరచుచున్నవి. వీనిలో ప్రధానమైనది టర్కీ దేశపు జాతీయపక్షము. ఆ దేశమునకు "డిక్టేటరు" గానున్న శ్రీ ముస్తాఫా కెమాలుపాషాగారు, పేరునకు ఒక రాజ్యాంగవిధానపుచట్టమును ప్రసాదించెను. అయ్యది బాధ్యతాయుతమంత్రివర్గమును, ప్రజాప్రతినిధిసభను యేర్పరచుచున్నది. కాని, ఎన్నికలజరుపుటలో ఆయనకున్న పలుకుబడివలనను, దేశమందతనికున్న పేరు ప్రతిష్టలవల్లను, ప్రభుత్వోద్యోగులు ఆయనయొక్క ఆధిపత్యమునే ప్రజలయందు ప్రచారమొనర్చుచుండుటవలనను, ప్రత్యర్థిపక్షము తలయెత్తుటకుతగిన రాచకీయస్వాతంత్ర్యము లేకుండుటవలనను, పార్లమెంటునందు శ్రీ కెమాలుపాషాగారిపార్టీయే అత్యధికమెజారిటీపొందుచున్నది. ఇందువలన జాతీయపక్షమే క్రిందటి పన్నెండువత్సరములనుండియు, శ్రీ కెమాల్ పాషాగారి "డిక్టేటరుషిప్పు" క్రింద నిరంకుశముగా ప్రజల యభ్యుదయమునే యభిలషించుచు జరుపబడుచున్నది.

ధనికులు, భూస్వాములు, కర్మాగారాధిపతులు, రషియాయందు తప్ప తదితర దేశములందు, బాధ్యతాయుత రాజ్యాంగములద్వారానే బాదాపుగా సంపూర్ణమగు పెత్తనముబొందుచున్నారు. కాని, లేబరుపార్టీయు దానికనుబంధమగు బృందములును వృద్ధిబొందుచుండుటవలనను, తమయందే, యుదారులగువారు లిబరలుపక్షమును మధ్యతరగతివారి

సాయముతో నేర్పరచుచుండుటవలనను, ప్రజాసామాన్యపు కోర్కెలనంతగా నధిగమింపకుండనే, రాజ్యాంగపు పెత్తనము ను నడుపవలసివచ్చుచున్నది. తమయాధిపత్యము అభివృద్ధి బొంది చిరస్థాయియై యుండవలెననిన, ప్రజాసామాన్యము నందు తమజీవితాధారమునకు మూలసూత్రమైన "వ్యక్తిగత భాగ్యవిభజన" పద్ధతిని హెచ్చుగా ప్రచారమొనరించవలసిన బాధ్యతవారిపైకలదు. ఒక్కొక్కప్పుడు ప్రజలు "సమిష్టి భాగ్యవిభజనపద్ధతిని" ప్రచారముచేయు సోషలిస్టులబోధ ను విని, లేబరుపార్టీవారికే రాజ్యాంగాధికారము నిచ్చుచుం డుటవలననే రెండుమారులింగ్లాండునందును, జర్మనీయందును ఆస్ట్రేలియాయందును పలుమారులును సోషలిస్టులు, మంత్రి వర్గముల నేర్పరచగల్గిరి. లేబరుపార్టీవారి మంత్రివర్గపుపెత్తన ము, కన్సర్వేటివు (ధనికులు, భూస్వాములు, మధ్యతరగతి వారు) లకు రుచింపమి, వారిహక్కులకు కొంతవరకైన భం గకరముగానుండుటచే, అనేకమారులు, బహిరంగముగాను, రహస్యముగాను, లేబరుపార్టీమంత్రివర్గపు రాజ్యమునుతిర స్కరించి ఆమంత్రివర్గపు కార్యవిధానమును చీకాకుపరచు చుండిరి. ఆస్ట్రేలియాయందలి లేబరుపార్టీవారి మంత్రివర్గము ప్రభుత్వముచేనడుపదగు "వ్యాపారనావికాదళము" నేర్పరచుట కై ప్రభుత్వపుఅప్పును లేవప్రయత్నించినప్పుడు ధనికులెల్ల రు సమ్మెకట్టి తమదేశమందెవ్వరును ప్రభుత్వమునకు అప్పు

నివ్వకుండ జేసి, ఇంగ్లాండునందుకూడ అప్పుపుట్టకుండజాగ్రత పడిరి. ఇటులనే, ఇంగ్లాండునందును, 1930 సంవత్సరమందు, లేబరుపార్టీవారి మంత్రివర్గము పతనమొందునట్లు చేయుటకై బాంకులు కుట్రపన్ని ఫ్రాన్సు, అమెరికాదేశముల బాంకరుల సాయముతో ఆర్థికసంక్షోభమును సృష్టించి, సఫలీకృతమనోరథులైరి.

ఇంతమాత్రపు సహాయనిరాకరణముద్వారా, లేబరువారి ఆధిక్యత తగ్గించుటకు, జర్మనురిపబ్లికునందును, ఇటలీయందును, ధనికులాదిగాగలవారికి సాధ్యము కాకుండుటచేతనే, "ఫాసిస్టు" పార్టీలనేర్పరచి నిరంకుశ రాజ్యపాలనము స్థాపించి, కార్మికులనణగద్రొక్కి, ధనికులు, కర్మాగారాధిపతుల రాజ్యాధికారమును సుస్థిరపరచవలయునని ప్రయత్నములుజరుగుచున్నవి. జర్మనీయందలి "నాజీపార్టీ"వారు కొన్ని రాష్ట్రములందు మంత్రివర్గము నేర్పరచకల్గినను, సమ్మేళనరాజ్యాంగమునందలి మంత్రివర్గమునింకను వశపరచుకొనలేకున్నారు కొలదికాలముననే వారికి రాజ్యాధికారము సంప్రాప్తమగుసూచనలు లేకపోలేదు. అప్పుడువారు, ఇటలీయందు ఫాసిస్టులేర్పరచినట్లు సంపూర్ణమగు నిరంకుశాధికారము నేర్పరచెదరేమో చూడవలసియున్నది.

ఇటలీయందు ఫాసిస్టుపార్టీయె సంపూర్ణరాజ్యాధికార మందున్నది. గ్రామములందు, పట్టణములందు ఈపార్టీకి ఉపసంఘములున్నవి. ప్రతిసంఘమునందునుండు అధికారులె ఎవ్వరసభ్యులుగా జేర్చుకొననగునో నిశ్చయించుచుందురు. పట్టణములందలి కర్మాగారములకుగూడ ఫాసిస్టుసంఘము నేర్పరచునధికారముకలదు. రాష్ట్రములవారీగా ఈసంఘముల ప్రతినిధులతో చేరిన గొప్పసంఘములుకలవు. రాజ్యమంతట రాష్ట్రీయసంఘముల ప్రతినిధులందరును ఫాసిస్టుజాతీయసంఘమందు సభ్యులగుదురు. డిక్టేటరగు శ్రీ ముస్సొలీనీగారికి ఈసంఘసభ్యులుగా ఎంతమందినైనను నియమించుటకు అధికారముకలదు. పేరునకు ఈ "జాతీయసంఘము" నకు రాజ్యమెట్టి సూత్రమునను సరించి నడుపబడవలెనో, రాజకీయవిధానమెట్టి దెప్పుడు అవలంబింపబడవలయునో నిర్ణయించు నధికారముండినను, ముఖ్యములగు నిర్ణయములను శ్రీ ముస్సొలీనీగారే సిద్ధాంతీకరింపకలరు. ఇంగ్లాండాదిగాగల దేశములందు దేశమందలి లేబరుపక్షమువారి కార్యక్రమమునకును, పార్లమెంటునందలి లేబరుపక్షపు కార్యక్రమమునకుమధ్య యెంతభేదముకలదో, అంత కెన్నోరెట్లు భేదము శ్రీ ముస్సొలీనీగారవలంబించు రాజ్యాంగకార్యప్రణాళికకును జాతీయ ఫాసిస్టిసంఘ నిర్ణయములకును మధ్యకలదు. కనుక, ఈ "జాతీయ ఫాసిస్టిసంఘము" సలహా నిచ్చుటకుమాత్రము ఇటలీయం దుపయోగపడుచున్నది.

ఇటలీ

ఈ సంఘమునకు సలహానిచ్చు నధికారముకంటె హెచ్చుప్రాముఖ్యతయున్న యెడల, దీనికి కార్యదర్శిగా నుండువారు అచిరకాలముందే శ్రీ ముస్సొలీనీగారివలన మార్చబడుచుండరు. క్రీ॥ శ॥ 1925 సంవత్సరమున ముస్సొలీనీగారి నెదిరించు ప్రత్యర్థిపక్షమును సర్వనాశన మొనర్చిన శ్రీఫారినాస్సీగారు శ్రీముస్సొలీనీగారి యాజ్ఞప్రకారము తనయింటిలో తలదాచుకొనవలసివచ్చెను. మరొక శ్రీ లూయిగీ పెడర్ చోనిగారిని 'సెనెటు' ప్రెసిడెంటుగా బెట్టి నోటికి తాళము వేసెను. తనకు తంటాకోరుగానున్న శ్రీ బాల్బోనిగారిని మాత్రము మంత్రివర్గమునుండు దుంచినాడుగాని, తన పార్టీకొకప్పుడు ప్రాణముబోసి, తనంత సామర్థ్యముకల్గిన శ్రీ గ్రాండిగారిని విదేశాంగ మంత్రిత్వమునుండి లండనులో ప్రతినిధిగా పంపివేసెను. మరినల్గురు ప్రధాననాయకులను రాజ్యాంగప్రతినిధి పదవులనుండి పదభ్రష్టులచేసెను. తనకేమాత్రమైన ఎదురగుదురనువారిని ఆయన తీసివేయుచున్నాడు. ఆయనకు సత్తాకలవారు, పలుకుబడికలవారు పనికిరారు. ఇక ఆయన పిమ్మట రాజ్యాంగము నడపుటకు తగినవా రెట్లు దొరకకలరు ?

సెనెటుసభయొక్క సభ్యులు శ్రీ ముస్సొలీనీగారిచే నియమింపబడుచున్నారు. వీరి పేరులను సూచించుటకు వివిధ వాణిజ్య వ్యాపారసంఘములందలి యజమానులకు కార్మికులకు హక్కుయివ్వబడినది. ఇట్టి సంఘములచే (పదమూడు

కలవు) సూచింపబడిన ఎనిమిదివందలమంది అభ్యర్థుల జాతీయ ఫాసిస్టిసంఘములవారిచే నాలుగువందలమంది అంగీకరింపబడె దరు. ఈయభ్యర్థులజాబితా శ్రీ ముస్సొలీనీగారిచే నామోదిం పబడవలసియున్నది. అంత నాఅభ్యర్థులజాబితాను ప్రజలు తమ ఫాసిస్టిసంఘములద్వారా అంగీకరించుచో, ఆయభ్యర్థు లెల్లరు ప్రజాప్రతినిధి సభా సభ్యులగుదురు. ఈ రెండు శాసన సభలకు స్వతంత్రముగా శాసననిర్మాణము చేయుటకుగాని, కార్యక్రమ విధానము నిర్ణయించుటకుగాని అధికారము లేదు. శ్రీ ముస్సొలీనీగారీసభలకు బాధ్యులుకారు. ఈ శాసన సభలు చేయకల్గునదియెల్ల శ్రీ ముస్సొలీనీగారిచే సూచింప బడిన బిల్లుల, ప్రభుత్వనియమముల చర్చించి, డిక్టేటరుగారి కంగీకృతమగుసవరణలసూచించుట మాత్రమే! ఈ సభలకు తుదకు "జాతీయఫాసిస్టిసంఘము" వారి కున్నంతమాత్రము అధికృతమైనను రాజ్యాంగమందు లేదు.

పేరునకుమాత్రము, ఫాసిస్టి రాజ్యాంగము సర్వపక్షరక్ష ణార్థమై నిల్పబడుచున్నదని శ్రీముస్సొలీనీగారు తెల్పుచున్నారు. వివిధ ఆర్థికబృందములకు కార్మికసంఘములకు సెనెటునందు ను, సభ్యతకల్గునట. ఈ వివిధఆర్థికసంఘములు కార్మికులసం ఘములచే ఆమోదింపబడిన వారిలోనే, సగముమందిని ప్రజా ప్రతినిధిసభకు అభ్యర్థులుగా తానొప్పుకొను చుండునట. ప్రతికార్మికుడును తన "సిండికేటునకు" సంవత్సరమున కొ

క్కుదినపుకూలిని చందాగాయివ్వవలెను. తానందు సభ్యుడై నను, కాకున్నను ఆ"సిండికేటు" యొక్క నియమములకుబద్ధుడై యుండవలెను ప్రభుత్వముచే నిట్టి సిండికేటులు అంగీకరింపబడవలెను. ప్రభుత్వముచే నంగీకరింపబడనిసంఘములశాస్త్రీయమైనవగును. ఈ సిండికేటులందు కార్మికులకు, యజమానులకు సమానమగు ప్రాతినిధ్యము కలదు. కార్మికులకు, యజమానులకు వివాదములుకల్గుచో, వానితీర్చుటకు ప్రత్యేకమగు కోర్టులేర్పరచబడుచున్నవి. సమ్మెకట్టుటకు కార్మికుల కధికారము లేదు. దేశము మొత్తముమీద పదమూడు ప్రధానసిండికేటులుకలవు. ఈ విధానమువలన సర్వజనులకు న్యాయముకల్గునని ముస్సొలీనీగారు ప్రకటించుచుందురుగాని, కార్మికులకు బాధ లెక్కువగుచునే యున్నవి.

జర్మనీయందలి నాజీపార్టీవలెనే ఇటలీదేశపు ఫాసిస్టుపార్టీవారును, ఉత్సాహులగు యువకుల బాలబాలికల తమ "పార్టీసేవార్థమై ఐచ్ఛికసేవకులుగా" జేర్చుకొని వారిని సాయుధులజేసి, మిలిటరీ కవాతు నేర్పుచున్నారు కొన్నిలక్షలమంది యోధులను యిప్పటికి కిట్లు తయారుచేసినారు. వారెల్లరు, ఫాసిస్టీపార్టీకే సహాయముచేసి జీవముల ధారవోయుదుమని ప్రమాణముల జేయుచున్నారు. విద్యాలయములందు, ఫాసిస్టీపార్టీనాయకునికి విశ్వాసము కల్గియుందుమని బిడ్డలచే ప్రమాణములు చేయించుటయు, ఉపాధ్యాయులు

ప్రొఫెసరులచే ఫాసిస్టుపార్టీకి శ్రీ ముసోలీనీకి భక్తులమై యుం దుమని వాగ్దానములచేయించుటయు కలదు. కార్మికులందు ను, కర్షకులందును, ఫాసిస్టుపార్టీయందు చేరనివారిని అనేక బాధలపెట్టుటయు ఫాసిస్టుతత్వమును అంగీకరించనివారను నె పముపై అనేకుల సందేహించి పలుయిడముల బారిచేయుట యు కలదు. రాజ్యాంగములతో యీఫాసిస్టు "డిక్టేటరుషిప్పు" ను పోల్చుచో నిరంకుశులగు రాజుచే పాలితమగు రాజ్యాంగముల కీడువచ్చును. ఈ రాజ్యాంగమందు తుదకు ఫాసిస్టుపార్టీకి చెందినవారికైన రాజ్యాధికారము దక్కుచున్న దనికాని, వారి యభీష్టముప్రకారము రాజ్యాంగ కార్యప్రణా ళిక యేర్పరుపబడుచున్నదనికాని చెప్పుటకు వీలులేదు. "నా యంత వారింకను పుట్టలేదు. డిక్టేటరింకను మనదేశమునకు అగత్యమని నాకు తోచుచున్నది. నే నింకను కొంతకాలము రాజ్యము చేయవలెను" అను శ్రీముసోలినీగారి ప్రకటనయే ఇటలీదేశపు రాజ్యాంగపు లక్షణముల ప్రకటించుచున్నది.

రషియా కమ్యూనిష్టు రాజ్యాంగము.

రషియా దేశమందు యుద్ధారంభమువరకు ఎన్నో శతాబ్దములనుండి 'జారు' అను చక్రవర్తులు రాజ్యపాలనం బొనర్చుచుండిరి. పందొమ్మిదవ శతాబ్దపుమధ్య కాలమువరకు కోట్లకొలది బానిసలు ఆదేశ మందుండిరి. కర్షకులెల్లగు "నిమ్నజాతుల"కు జెందియుండిరి. ఈశతాబ్దారంభమునకుగాని, స్వాతంత్ర్యముబొందన కార్మికులు, కర్షకులు, రాజకీయహక్కు

లకై దాహాముగొనలేదు. జపానువారితో యుద్ధమొనర్చి అపజయమందినపిమ్మట రషియాచక్రవర్తి 1905 లో శాసన సభల (డ్యూమా) నేర్పరచి జిల్లాబోర్డులకు ఆసభాసభ్యుల నెన్నకొను హక్కొసంగెను. పిమ్మట ప్రజలెల్లరు తమ డెలిగేటులను, రాష్ట్రీయపట్టణడెలిగేటు సభలకు ఎన్నుకొనునట్లును ఈసభలు పార్లమెంటుసభ్యుల నెన్నుకొనునట్లును యేర్పాటు చేయబడెను. ఆసమయమందె పౌరులప్రాథమికహక్కులు కూడ నిర్వచింపబడెను. కాని, ఈపార్లమెంటునకు, చక్రవర్తికి తీవ్ర భేదాభిప్రాయములు కల్గుటవలనను పార్లమెంటువారు ప్రజలకు హెచ్చుయధికారములు కోరుటచేతను దానినిచక్రవర్తిగారు తఱచుగా సమావేశపరుపక తన నిరంకుశాధికారమును సాగించుచుండెను.

ఆ నిరంకుశరాజ్యమందు ప్రజల ఆస్థిపాస్థులకుగాని, ప్రాణమానములకుగాని రక్షణలేదాయెను. భూస్వాములు ధనికులు ఆడినదేఆట, పాడినదేపాటగానుండెను. ఉద్యోగస్థులు లంచగొండులై ప్రజల పీడించుచుండిరి. స్వతంత్రవాదుల గ్రంథకర్తల పత్రికాప్రచురణచేయువారి ఉపాధ్యాయుల నెల్లప్పుడు సి. ఐ. డి. వారు వెంబడించుచు, వేటకుక్కలు లేడినితరుమునట్లు తరుముచుండిరి. పౌరులకెట్టి స్వాతంత్ర్యము లేదాయెను. శిస్తులభారము మితిమించిపోవుచుండెను. యావనులెల్లరు తప్పని సరిగా యుద్ధములందు పాల్గొనవలసివచ్చె

ను. ఫ్రాన్సునం దెట్లు విప్లవమునకుముందు ప్రజలు నానావిధ మగు యస్వతంత్రములకు లోనైయుండిరో అటులనే రషియను ప్రజలు చక్రవర్తిపాలనముక్రింద రక్తమును శిస్తులద్వారా ధారవోయుచుండిరి. ఈబాధలకుతోడు ప్రపంచయుద్ధము వచ్చిపడి మూడుసంవత్సరముల పర్యంతము వారి యువకుల దిగమ్రింగెను; వ్యాపారమును నాశనముచేసెను; వ్యవసాయము ను తల్లక్రిందులొనర్చెను. తుదకు 1917 లో విప్లవము బయలుదేరెను. చక్రవర్తిగారిరాజ్యము ఎత్తివేయబడెను. దేశపుభావికాలపు రాజ్యాంగవిధానమును నిర్ణయించుటకు 1917 జూనులో "సోవియటు"లను కార్మిక, కర్షకసంఘముల ప్రతినిధులు 781 మంది పెట్రోగ్రాడులో సమావేశమైరి. కాని, వీరి సూచనప్రకారము నేషనల్ కాంగ్రెసు కూడకుండనే బోల్షివిక్కులు నవంబరు ఆరవతేదీని తాత్కాలిక ప్రభుత్వము నాక్రమించిరి.

ఆపిమ్మట ఐదు 'కాంగ్రెసు'లు సమావేశమై తుదకీక్రింద సూచింపబడిన ప్రధానలక్షణములుకల్గిన రాజ్యాంగ విధానపుచట్టము నంగీకరించెను.

క్రీ॥ శ॥ 1918 సంవత్సరం జూలై అయిదవతేదీని, శ్రీ లెనినుగారి నాయకత్వమున, కాంగ్రెసువారిచే నంగీకరింపబడిన రాజ్యాంగవిధానము ప్రకారము, సాంఘికోపయోగమగుకర్మల జేయు కార్మికులును, రక్షణదళముల సభ్యులును, ఈబృందములకు జెందియు అవిటి

వోటుహక్కు

వారైనవారును, ముదుసలులును, వోటింగుహక్కు పొందుటయు; ఇతరులను తమలాభమునకై కూలికిపెట్టుకొనువారు (క్యాపిటలిస్టులు) తమ కష్టార్జితముపై కాక, పెద్దలిచ్చిపోయిన ఆస్థిపై జీవించువారును, వ్యాపారులును, వాణిజ్యాధికారులును, చిల్లరబేరగాండ్రును, వోటింగుహక్కు పొందజాలక పోవుటయు ప్రధానాంశములు. మరియు, పురోహితులకు చక్రవర్తియొక్క పోలీసుదళసభ్యులను, చక్రవర్తికుటుంబీకులకు గూడ వోటుహక్కు లేదు. ఈయొక్క నియమము ప్రకారము రాజ్యాధికారముపొందదగువారెవ్వరో, రాజ్యాధికారభ్రష్టులెవ్వరో తేలిపోవుచున్నది. ఐతే కార్మికులు, కర్షకులు అత్యధికసంఖ్యాకులుగనుక, వందకు యిరువదిమందికంటె హెచ్చుగా వోటింగుహక్కు లేనివారు యుక్తవయస్కులలో నుండుట అరుదు. ప్రతివోటరు పదునెనిమిదివత్సరములవయస్సు మించియుండవలెను. వోటుహక్కు ఎవ్వరికి నిరాకరింపబడినదో వారికి, రాష్ట్రీయఎన్నికకమీషనరులు, వారు కూలినాలిపై జీవితాధారము, వోటులనిచ్చు సమయమందు, పొందుచున్నారని యోగ్యతాపత్రిము లిచ్చుచో, వారికి వోటులు లభ్యపడవచ్చును.

ఈభేదమింతటితో నాగదు. ప్రభుత్వముచే నేర్పరుపబడిన దుకాణములు, కర్మాగారములు, వగైరాలన్నిటియందు

ను, అమ్మబడువస్తువులను వోటుహక్కు పొందకల్గు కుటుంబములకు తక్కువఖరీదునకును, వోటుహక్కుపొందరానివారికి హెచ్చుఖరీదుకును అమ్మబడుచున్నవి. శిస్తుభారము ప్రథమ తరగతివారిపైకంటె, రెండవతరగతివారిపై హెచ్చుగా మోపబడుచున్నది. సాధారణముగా పౌరులకు దక్కు రాజ్యాంగలాభములేవియు వోటుహక్కు పొందజాలనివారికి లభ్యపడవు.

కమ్యూనిస్టు రాజ్యాంగమునకంతకు పునాది, గ్రామము లేక, చిన్నపట్టణము. ప్రతిగ్రామమునకు మూడువందలమంది

గ్రామసిండికేటు.

జనాభాయున్న ఒక్క "సిండికేటు" కలదు. ఈ సిండికేటు సంవత్సరమునకొక్కమా రెన్నుకొనబడుచుండును. మనకు పంచాయితీలెట్లో, వారికి సిండికేటులట్లు. గ్రామమునందు, చుట్టుపట్లనుండు పౌరులెల్లరు "సిండికేటు" సభ్యులనెన్నుకొందురు. ఇటులనె బస్తీలందును, కర్మాగారములు, విద్యాలయములు, వ్యాపారశాలలు, దుకాణములు, తదితర కార్మికుల సముదాయములు, ఐదువందలమంది వోటరుల కొక్కనిచొప్పున, బస్తీ 'సిండికేటు' సభ్యుని సంవత్సరమునకొక్కమారు యెన్నుకొనవలెను. ఇటుల ఐదువందలమందివోటరులు ప్రతినిధియోజకవర్గమందు జాగ్రత్తగా జేర్చబడుచుందురు. అటులనె, చిన్నిచిన్నిగ్రామ

ములందలి పౌరులు, మూడువందలనుండిని జేర్చి ఒక్క "సండికేటుగా" నేర్పరుచుట కుకలదు.

ప్రతిసిండికేటుకూడ, ఒక్క కార్యనిర్వాహకసంఘమును నియమించును. గ్రామసిండికేటులు, మాసమునకు రెండుమారులును, బస్తీ "సిండికేటులు" హెచ్చుమారులు సమావేశపడుచుండవలెను. ఈసిండికేటులసభ్యులను ప్రజలు తమకు తోచినప్పుడు పదభ్రష్టులజేయుటకు (Recall) అధికారముకలదు.

ఈగ్రామ 'సిండికేటు' "తాలూకా గ్రామ్యసోవియటును" (ఘోలొస్తు) ఎన్నుకొనును. ఈతాలూకాసోవియటు

తాలూకా సిండికేటులు.

నకు గ్రామసిండికేటులు, తమకున్న జనాభాలో ప్రతివందనుండి కొక్కరుచొప్పున "డెలిగేటులు"గా నెన్నుకొనవచ్చును. ఈ తాలూకాసిండికేటులుకూడ ముగ్గురునుండి ఏడుగురువరకు కార్యనిర్వాహకవర్గసభ్యులుగా నెన్నుకొనును. ఈకార్యనిర్వాహకవర్గము వారు సాధారణవ్యవహారములు, రక్షణ, భూమిపాలనము గూర్చి శ్రద్ధచేయుదురు. ఈతాలూకాసిండికేటులు సంవత్సరమునకొకమారు సమావేశముకావలెను. కాని, గ్రామసిండికేటుల అధ్యక్షులు, కార్యదర్శులు, అనేకమారులు అవసరముబట్టి, తాలూకాసిండికేటుయొక్క అధ్యక్షుని సహకారముతో సమావేశమగుచుందురు.

"జిల్లాసోవియటు" (ఉయ్యెజ్దు) సభ్యులనుకూడగ్రామసోవియటులె వెయ్యిమంది ప్రజల కొక్కప్రతినిధిచొప్పున ఎన్నుకొనుచుండును. ఇయ్యది యీసంవత్సరమున కొకమారు సమావేశముకావలెను. ఇందుమూడువందలమంది సభ్యులకంటె హెచ్చుయుండరాదు. దీని కార్యనిర్వాహకవర్గమువారు పన్నెండు డిపార్టుమెంటులపై యాజమాన్యముచేయవలెను. ఉద్యోగులపైయజమాయిషి, శాంతిరక్షణ, కార్మిక, సాంఘికసేవ, విద్య, ఆర్థికము, వ్యవసాయము, తినుబండారములు, ఆరోగ్యము, అను వ్యవహారములగూర్చి యీడిపార్టుమెంటులుశ్రద్ధ చేయవలెను.

జిల్లా సోవియటులు.

రాష్ట్రీయసోవియటు (గూబర్నియ) నందును, మూడువందలకు మించకుండా సభ్యులుండనగును. వీరు సంవత్సరమునకొకమారు సమావేశమయ్యెదరు. ఈసోవియటునందు తాలూకాగ్రామ్య సోవియటుల యొక్క ప్రతినిధులును పట్టణసోవియటుల ప్రతినిధులునుందురు. కనుక, ఇయ్యది జిల్లాసోవియటువలెకాక రాష్ట్రమందలి అన్నివిధములైన సోవియటులకు ప్రాతినిధ్యత వహించుచుండును. తాలూకాసోవియటు తనకున్న పదివేల మందిజనుల కొక్క "డెలిగేటు" చొప్పునను, పట్టణసోవియటు రెండువేలమందివోటరుల కొక్కరిచొప్పునను, రాష్ట్రీయసోవి

రాష్ట్రీయసోవియటులు.

యటునకు ప్రతినిధుల నెన్నుకొనును. ఐతే, ఈ యెన్నికలు కొలది కాలములోనే జరుగనుండునప్పుడే కనుక, "జిల్లాసోవియటు"లు సమావేశమగుచో, తాలూకా సోవియటులకు బదులీజిల్లాసోవియటులే రాష్ట్రీయసోవియటులకు, గ్రామ్యవాసులకు అగ్రామగు ప్రతినిధులను, పదివేలమంది కొక్కరిచొప్పున నెన్నుకొందురు. ఈరాష్ట్రీయసోవియటుయొక్క కార్య నిర్వాహకవర్గముక్రింద పదునైదు డిపార్టుమెంటులు కలవు; అనగా, జిలాసోవియటునందుండిన డిపార్టుమెంటులు కాక, న్యాయస్థానములు, పోస్టుటెలిగ్రాములు, అసాధారణ న్యాయస్థానములను మూడుడిపార్టుమెంటులీసోవియటునకుకలవు.

ఈ రాష్ట్రీయసోవియటులపై, దేశీయ సోవియటులు (ఒబ్లాస్టు) కలవు. ఇందు, జిల్లాసోవియటులయొక్కయు, పట్టణసోవియటులయొక్కయు, ప్రతినిధు లుందురు. గ్రామ్యవాసులకు 25,000 మంది కొక్క ప్రతినిధిచొప్పున, జిల్లా"సోవియట్టు"ను పట్టణవాసులకు 5000 మంది కొక్కరుచొప్పున పట్టణసోవియట్టులును, ఈసోవియటు సభ్యుల నెన్నుకొనును. ఐనువందలకుమించకుండా, ఇందుసభ్యులుందురు. వీరును వత్సరమునకొకమారు సమావేశమై తమ సాధారణకార్యభారములను కార్యనిర్వాహక వర్గమువారిద్వారా నడపుచుందురు.

దేశీయసోవియటులు.

రషియారాజ్యమునకంతకు "సోవియట్టుల సమ్మేళన సంఘము"కలదు. ఇందు, పట్టణసోవియట్టులు 25,000 పౌరుల కొక్కరిచొప్పునను, రాష్ట్రీయసోవియట్టులు లక్ష యిరువది ఐదు వేల ప్రజలకొక్కసభ్యుని ఈసంఘమునకు ప్రతినిధిగా పంపును. ఇందు 1921 సంవత్సరమందే 1631 సభ్యులుండిరి. ఇప్పటికి, యీ సభ్యులసంఖ్య రెండు వేలకు మించి యుండవచ్చును. ఈసంఘమువారే రాజ్యాంగపు పెత్తనమంతకు ప్రధానాధికారులగు, సమ్మేళన కార్యనిర్వాహక సంఘము నెన్నుకొనుచుందురు. నాల్గువందలమంది 'సమ్మేళన పార్లమెంటు"ను సంవత్సరమున కొకమారు సోవియట్టుల సమ్మేళనసంఘమువా రెన్నుకొందురు. ఈసంఘమువారు సంవత్సరమునకునాల్గు మారులు సమావేశమగుచుందురు. ఒక్కొక్కమారు సాధారణముగా, పది, పదునైదుదినములు, సమావేశమునందుందురు. ఈసంఘమే శాసననిర్మాణమొనర్చుటకు, ప్రత్యేక ఆర్డినెన్సుల నంగీకరించుటకు, బడ్జెట్టువామోదించుటకు రాజ్యాంగమునకంతకు, రాజనీతివిధానమును నిర్ణయించుటకు అధికారియై యున్నది. ఈసంఘమునకు రాజ్యాంగవ్యవహారముల నిర్వహించవలసిన బాధ్యతయు,. న్యాయమూర్తిత్వమును ఆరోపింపబడుచున్నవి.

రషియా రాజ్యసమ్మేళన సోవియటు కాంగ్రెసు

ఈసంఘసభ్యు లెల్లరు, వీరోనొక సోవియటుయొక్క కార్యనిర్వాహకవర్గమునందు సభ్యులైయుండవలెను. కనుక, వీరు రాజ్యాంగవ్యవహారములం దనుభవపరులై యున్నారు. జిల్లాయందలి, గ్రామసిండికేటుల అధ్యక్షులు, కార్యదర్శులు చేరి జరుపుసభలవలెనే, ఈపార్లమెంటునందును, రాజ్యాంగ మందలి సిండికేటుల కార్యనిర్వాహకులు సమావేశమగుచుం దురు. వీరే, సమ్మేళనరాజ్యాంగపు కార్యనిర్వాహకసంఘ ముక్రింద నుద్యోగులైయుండెదరు. కనుక, అరుదుగా నీసంఘ మువారు సమావేశమగుచుండినను, వీరికుండు అనుభవాధి క్యతవలన తమకు నిశ్చితమైన కార్యములను సక్రమముగా, సంతృప్తికరముగా, సమర్థతతో నిర్వహించకలరు.

ఈసంఘము రెండు ఉపసంఘములను, తన సభ్యుల తోడనే, నిర్మించుచున్నది. ఒకటి, ప్రజలకమీషనరుల

కమీషనరుల కౌన్సిలు.

కౌన్సిలు, రెండవది, స్థాయిసంఘము. ఈకౌ న్సిలువారే, రాజ్యాంగమంతకు కార్యనిర్వా హకసంఘముగానుందురు. ఇందు, పందొమ్మి దిమంది డిపార్టుమెంటుల అధ్యక్షులు కలరు, వీరు రాజ్యమం దలి దేశీయ, రాష్ట్రీయ, జిల్లా, తాలూకా, గ్రామపట్టణ సిండి కేటుసభలకు తమయుత్తరువుల జారీచేయుచు, ఆయాసిండి కేటుల సహకారముతో రాజ్యాంగకార్యభారమును నిర్వ హించుచున్నారు. తదితరదేశములందు మంత్రులెట్టి స్థానమం

దుందురో, అట్టిబాధ్యతనే యీకమిీషనరులు నెరవేర్చు చుందురు. అసాధారణ పరిస్థితులందును, ఈకౌన్సిలువారిచే నిర్ణయింపబడిన సమయములందు తప్ప, సాధారణావ్యవహార ములలో ఈకౌన్సిలుసభ్యుల యాజ్ఞలను, వివిధసిండికేటులు శిరసావహించి రాచకార్యముల నిర్వర్తించవలసియున్నది. ఈకౌన్సిలుయొక్క అధ్యక్షుడు గూడ, పార్లమెంటుచేతనే యెన్నుకొనబడును.

ఈకౌన్సిలుగాక, కార్మికుల, రక్షకదళముల పరిపాలక సలహా సంఘమొకటికలదు. కౌన్సిలునందలి ముఖ్యులగు

కార్మికులపరిపాలకసలహా సంఘము.

వారును (యుద్ధమునకు, కార్మికులకు, రహదారులకు, వ్యవసాయమునకు తినుబండారములకు చెందిన డిపార్టుమెంట్లయొక్క మంత్రులు) రషియాసమ్మేళన రాజ్యాంగపు ట్రేడుయూనియను సంఘమువారి ప్రతినిధియు సభ్యులైయుండును. ఈసంఘము కౌన్సిలుయొక్క వివిధడిపార్టుమెంటులకు తగుకార్యవిధానము నాలోచించి రాజ్యాంగరక్షణమును సుస్థిరపరచి ఆర్థిక పునరుద్ధరణను ప్రోత్సాహపరచుచు, కౌన్సిలునకు నాయకత్వము వహించుచుండును. ఈసంఘము వివిధ ఆర్థిక, సాంఘిక సమస్యల విచారించి తగుసలహాలనిచ్చుటకుగాను, "ఆర్థికవిచారణసంఘములు" నియమించుచుండును. ఈసంఘపుతీర్మానములు, ఆజ్ఞలు, సరాసరి సభ్యసిండికేటులకు ఆచరణార్థమై

పంపబడవు. ఆయాజ్ఞలును, తీర్మానములును, కౌన్సిలుసభ్యులద్వారా (కమీషనరులు) సభ్యసిండికేటులకు పంపబడుచుండును.

స్థాయిసంఘము.

అన్నిటికి మించి, రాజ్యాంగాధికారమును ఏవిధముగా కౌన్సిలువారు నడుపవలయునో, ఎటుల "కార్మికుల, రక్షణదళముల పరిపాలకసంఘము" తన పెత్తనమును సాగించనగునో నిర్ణయించుచుండుటకు స్థాయిసంఘము కలదు. ఈస్థాయిసంఘమువారు అవసరమగుచో, కౌన్సిలువారి తీర్మానములగాని, తీర్పులగాని, ఆజ్ఞలగాని రద్దుచేయుటకు అధికారము కలదు. సభ్యసావియటులసభ్యము, అధికౌన్సిలర్లసభ్యము ఎంతెంత ఎట్టెట్టి రాజ్యాధికారము పంచియుండనగునో, ఈసంఘమువారే నిర్ణయించ కలరు. పార్లమెంటువారు చర్చించదగు కార్యక్రమమును తయారుచేయుభారము వీరిమీదనేకలదు. వీరు, పార్లమెంటు యొక్క నయనములు; హస్తములు; ప్రాణములునై యున్నారు. ప్రభుత్వమును నడపుచుండు కౌన్సిలర్లపై పార్లమెంటు వీరిద్వారా తన యాజమాన్యము నెల్లప్పుడుచేయగల్గుచున్నది. తాను సమావేశముండక పోయినను పార్లమెంటు తన ప్రతినిధులగు స్థాయిసంఘమువారిద్వారా రాజ్యాంగవ్యవహారములనన్నిటి సంపూర్తిగా విచారించి కౌన్సి

లర్లు ప్రజలయభిప్రాయముల ననుసరించి, ప్రజాభ్యుదయము మునకై రాజ్యపాలన చేయునట్లు జాగ్రత్తపడుచున్నది.

ఇవియే రషియాదేశపు రాజ్యాంగవిధానప్రభవన భాగములు. ఇందు మనము ప్రత్యేకముగా గమనించవలసినవి పది ప్రధానాంశములు కలవు. ఒకటి, కష్టించి జీవనోపాధి సంపాదించుకొనువారికే, ఈరాజ్యాంగమందు వోటుహక్కు సాధారణముగా ప్రసాదించబడుచున్నది. ఇందువలన, రషియాయందు సర్వజనపౌరసత్వము లోపించుచున్నదని దిగులొందపని లేదు. స్వాయముగా వస్తువిషయముల సృజించువారెల్లరికి పౌరసత్వహక్కు ప్రసాదించబడును. కనుక, నూటికి తొంబదిమంది యుక్తవయస్కులకు వోటుహక్కు చేకూరుచున్నది. మధ్యతరగతికి, భూస్వాములతరగతికి చెందినవారు కూడ కార్మికకర్షకవృత్తుల నవలంబించుచో వోటుహక్కును పొందగలరు. రెండు; స్థానికస్వపరిపాలనము, ఇతరదేశములందుకంటె చాల హెచ్చుగా రషియాయందు ఏర్పరచబడినది. తాలూకా సిండికేటులయొక్క కార్యభారము, అంతగా లేకున్నను జిల్లాసిండికేటులయు, రాష్ట్రీయసిండికేటులయు, కార్యభారము చాలముఖ్యమైనదైయున్నది. సమ్మేళనరాజ్యాంగపుకౌన్సిలువారు అనేక రాజ్యాంగవ్యవహారములందు తమఆర్డరులను, నియమములను పంపించుచున్నను, కౌన్సిలువారిపెత్తనము జాతీయావసరములకు సంబంధించిన

దగుటచే, స్థానికవ్యవహారములగు విద్య, ఆరోగ్యము, వ్యవసాయము, రహదారులు, వగైరాల పాలించుటలో ఈసిండికేటులకు చాలస్వతంత్రమగు పెత్తనముకలదు. మరియు, ఇంగ్లాండునందు స్థానికసంస్థలు తమ వ్యవహారములనె నిర్వహించుచుండ జాతీయప్రభుత్వకార్యముల ప్రత్యేకాధికారులు నడపుచున్నారు. ఫ్రాన్సు, జర్మనీలందెట్లో అటులనే రషియాయందును, స్థానికస్వపరిపాలన వ్యవహారములతో బాటు జాతీయప్రభుత్వవ్యవహారములనుకూడ, స్థానికాధికారులు (ఫ్రాన్సు జర్మనీలందు పెర్ఫేగారు, రషియాలో సిండికేటులకార్యనిర్వాహకవర్గము) నడువవలసియున్నది. విప్లవమునకు పూర్వముండిన చెమ్‌స్తోవ్రులకంటె యీ "సిండికేటులు" హెచ్చుయధికారముల కల్గియున్నవి. ఫ్రాన్సు, జర్మనీలందుకంటె రషియాలో స్థానికప్రభుత్వ నిర్వహణమందు ప్రజాసామాన్యమునకు అధికఆధిక్యత సంప్రాప్తమగుచున్నది. ఈసిండికేటులద్వారా రషియనుప్రజలకు రాచకీయానుభవము సులభముగా కల్గుచున్నది.

మూడు: ఈమధ్య ఇంగ్లాండులో లేబరుప్రభుత్వము తమ మంత్రివర్గమునకు సలహాలనిచ్చుటకై యెటుల "ఆర్థికసలహాసంఘము"ను, ఆర్థికశాస్త్రవేత్తలు వాణిజ్యనాయకులతో నేర్పరచిరో, అటులనే, రషియాయందును కౌన్సిలువారికి జాతీయరక్షణకార్యములందును, ఆర్థికాభివృద్ధికారక

వ్యవహారములందు సలహాలనిచ్చుటకుగాను, ముఖ్యులగుకౌన్సిలర్లును, లేబరు ప్రతినిధియొకరును కలసి ఒక "సలహాసంఘము"గా నేర్పడుచున్నారు. ఐతే, ఇంగ్లాండులోనిసంఘమునకు సలహాయిచ్చు నధికారమేయుండ రషియాలోని యీ సంఘపుతీర్మానములు కౌన్సిలర్లకు, మంత్రులకు, ప్రమాణములగుచున్నవి.

నాల్గు: రాజ్యాంగమునకంతకు యుపయుక్తమగు, అవసరమగు కార్యక్రమవిధానము గూర్చి ఆలోచించుచు రాజ్యాంగావసరముల జాగ్రత్తగా కన్గొనుచు, ఆర్థిక సాంఘిక సమస్యల చర్చించుచు, దేశాభ్యుదయకారకమగు, కార్య ప్రణాళికను తయారుచేయుచు, పార్లమెంటు అభిప్రాయము ప్రకారము కౌన్సిలర్లు రాజ్యపాలనము చేయునట్లు జాగ్రత్త చేయుటకు స్థాయిసంఘము కలదు. ఈ సంఘమునకు ఏయొక్కడిపార్టుమెంటును నడపుకార్యముతో నేమాత్రమును సంబంధము లేదు. కనుక దేశీయులెల్లరి కగత్యమగు గొప్ప కార్యములగూర్చి విచారించుటకు సావకాశము కల్గుచుండును. వివిధడిపార్టుమెంటులను స్థాయిసంఘమువారి యాజ్ఞలననుసరించి, కౌన్సిలుయొక్క తీర్మానముల ననుసరించి 'కార్మికులు రక్షణదళముల పరిపాలకసంఘముల' సలహాలననుసరించియు పాలించుటయె కౌన్సిలర్లధర్మము. ఇట్టి సంస్థలే యీకాలపు

రాజ్యాంగవ్యవహారముల నడపుటకెల్లెడల యగత్యమగుచున్నది.

ఐదు: ఇంగ్లాండాదిగాగల ప్రజాస్వామిక దేశములందు పార్లమెంటునకు, స్థానిక సంఘములకు, ప్రజలే తమ ప్రతినిధుల సరాసరి యెన్నుకొనుటకలదు. అమెరికాయందు ప్రెసిడెంటును, సెనెటు ప్రజాప్రతినిధిసభ్యులను, ఆస్ట్రేలియాయందు, రెండుసభలసభ్యులను సభ్యరాష్ట్రముల శాసనసభాసభ్యులను ప్రజలే సరాసరి యెన్నుకొనుటకలదు. రషియాయందిట్లుగాక, ప్రజలు స్వయముగా వోటుచేయునది యెల్ల గ్రామసోవియటు పట్టణసోవియటు ఎన్నికలందే. ఆపిమ్మట తాలూకా, జిల్లా, రాష్ట్రీయ, దేశీయ, రాజ్యాంగ సోవియటుల కవసరమగు ఎన్నికలందు వారికి సరాసరిసంబంధమే కల్గుటలేదు. వారిచే నెన్నుకొనబడిన గ్రామ, పట్టణ సిండికేటుసభ్యులు, తాలూకా, జిల్లా, రాష్ట్రీయ సిండికేటుల నెన్నుకొనుటయు, దేశీయసిండికేటుల జిల్లా సిండికేటులు, పట్టణసిండికేటులను సమ్మేళనసిండికేటును, పట్టణసిండికేటులు, రాష్ట్రీయ సిండికేటులును, ఎన్నుకొనుచుందురు. ఈపద్ధతివలన, ప్రజాసామాన్యమునకు సమ్మేళన సిండికేటులు, రాష్ట్రీయ దేశీయసిండికేటులపై కల్గు పెత్తనము నామమాత్రమగుటయు, సమ్మేళన దేశీయ రాష్ట్రీయ సిండికేటుల కార్యనిర్వాహకులు, ప్రజలపైనంతగా తాము ఆధారపడియుంటి

మను సంగతి జ్ఞప్తియందుంచుకొను నగత్యము కల్గుట లేదనియు తోచుచున్నది. ఐతే అంతస్థుల వారీగా యున్న యీ సిండికేటుల మేడలో, పునాదియగు గ్రామ పట్టణ సిండికేటులపై మిగిలిన అంతస్థు లాధారపడియున్నవి కనుక సమ్మేళన రాజ్యాంగపు కౌన్సిలర్ల ప్రవర్తన స్థాయిసంఘముయొక్క కార్యపరిణాళిక సంతృప్తికరముగా లేనిచో, వారి క్రిందటి అంతస్థువారు అనగా, రాష్ట్రీయసిండికేటులు, పట్టణసిండికేటులు, సమ్మేళనపార్లమెంటు సభ్యులను (Recall) పదభ్రష్టుల చేయవచ్చును. అటులనే, పైవారిని క్రిందివారు, అంతస్థుల వారీగా పదభ్రష్టుల చేయుటకు సాధ్యపడును. ఈ యాయుధము ద్వారా వారి నాయకులు తమ యభిప్రాయ ప్రకారము పైనున్న సిండికేటులు వాని కార్యనిర్వాహక వర్గములు పరివర్తించుకొనునటుల జేయుటకు ప్రజలకు కొంతవరకు సాధ్యమగును. కాని యింతవరకు బోల్షివిక్కు పార్టీ వారు, తమ వివిధసిండికేటు సభ్యులు, ఈ యధికారము నుపయోగించుటకు తగు నవకాశము నొసంగుట లేదు కాన, ప్రజాస్వామ్యము సంపూర్తిగా (వోటరులకు సంబంధించినంతవరకైన) రషియాయందు అమలులోనికి వచ్చినదని చెప్పజాలము.

ఆ॥: రషియాయందు పట్టణములకంటె గ్రామములే ఆర్థికముగ, సాంఘికముగ జనసంఖ్యబట్టి, విస్తీర్ణతబట్టి ఎన్నోరెట్లు హెచ్చుప్రాముఖ్యముగనున్నను, రాజ్యాంగ విధాన

మందు పట్టణములకు గ్రామములకంటె అనేకరెట్లు హెచ్చు ఆధిక్యత యివ్వబడినది. రాష్ట్రీయసిండికేటులలో గ్రామవాసులు 10,000 మందికొక్క సభ్యత్వమివ్వబడగా, పట్టణవాసులు 2,000 మందికొక్కటి లభ్యమగుచున్నది. దేశీయ సిండికేటులో, 25,000 మంది గ్రామవాసులు, 5000 మంది పట్టణవాసులు, సమ్మేళనపార్లమెంటులో 25,000 మంది గ్రామవాసులు, 25,000 మంది పట్టణవాసులు సమానప్రాతినిధ్యతబొందుచున్నారు. అనగా పట్టణవాసుడొక్కొక్కనికి, ఐదుగురు గ్రామవాసులకున్న ప్రాముఖ్యత యివ్వబడుచున్నది. అంతియేకాక, తాలూకా జిల్లా సిండికేటులకు మాత్రము గ్రామసిండికేటులు తమప్రతినిధులను ఎన్నుకొనవచ్చును. కాని, రాష్ట్రీయ, దేశీయ, సమ్మేళనసిండికేటులకు పట్టణసిండికేటులు తమ ప్రతినిధుల నెన్నుకొనుచుండ గ్రామసిండికేటుల కట్టియధికారము లేదు. తాలూకాసిండికేటులు రాష్ట్రీయసిండికేటులకు, జిల్లాసిండికేటులు దేశీయసిండికేటులకు, రాష్ట్రీయసిండికేటులు సమ్మేళనపార్లమెంటునకు గ్రామస్థుల తరపున ప్రతినిధుల నెన్నుకొనవలసియున్నది. ఇందువలన పట్టణములకు ఆధిక్యత అధికముగా నివ్వబడుచున్నది. ఇందులకు కారణము పట్టణములందలి కార్మికులు బోల్షివిజమును అంగీకరించి బోల్షివిక్కుల బలపరచుచుండుటయు గ్రామస్థులు ఈ "కార్మిక కర్షక ప్రభుత్వవిధానము" నంతగా అభిమానించక

"కుర్యాలక్సు" అను వ్యాపారులు భూస్వాముల పలుకుబడికి లొంగియుండుటయే! పట్టణములకు సంబంధించి నంతవరకు ఈ రాజ్యాంగవిధానము ప్రజాస్వామికమైనదనియే చెప్ప వచ్చును.

ఏడు: బోల్షివిక్కు-పార్టీవారే పెత్తనమందుండి "కార్మిక కర్షకప్రభుత్వవిధానము" నంగీకరించువారే ఆపార్టీయందు జేరుచు సిండికేటుల నడపుచుండుటవలన స్వాతంత్ర్యాభి ప్రాయ ప్రకటన కంతగా నవకాశము కల్గుటలేదేమోయని సందియము కలుగవచ్చును. కాని, ఇతరదేశములందు "వ్యక్తిగతభాగ్యవిభజనపద్ధతి" నంగీకరించు ప్రజలె రాజ్యాంగాధికార మొనర్చుచున్నను "సమిష్టిభాగ్యవిభజనపద్ధతి" నభిమానించు కమ్యూనిస్టులకు తమప్రచారము సాగించుకొనుటకు వలయు స్వతంత్రతను కొంతవరకు అరికట్టుచునేయున్నారు. మరియు, యుద్ధకాలమం దెట్లు ఇంగ్లాండాదిగాగల దేశములందు స్వతంత్రహక్కుల నిరోధించుట జరిగెనో, అటులనే తమ రాజ్యాంగము స్థిరతబొందువరకు, "వ్యక్తిగతభాగ్య విభజనపద్ధతియే" మంచిదని వాదించువారికి స్వతంత్రత ఒసంగరాదని రషియనులవాదము. యుగయుగములనుండి క్రైస్తవ మతగురువులు, ప్రజలు భూస్వాములకు చక్రవర్తిలొంగి యుండవలెనని బోధించుచు ప్రజాసామాన్యము రాజ్యాధి కారమునకు తగదని ప్రచురము చేయుచుండుటచే, ఇప్పటి

బోల్షివిక్కులు అమితగురువులన్న ద్వేషము కల్గియుందురు. కనుక గురువులు బోల్షివిక్కులపార్టీ నెదిరించి, "వ్యక్తిగతభాగ్యవిభజనపద్ధతిని" ప్రచారమొనర్చుచో, వారిని శిక్షాపాత్రుల జేయుచున్నారు.'' కర్షక కార్మికప్రజల ప్రభుత్వము" ను నిరసించువారిని రాజ్యాంగవిద్రోహులుగా పరిగణించి శిక్షించుచున్నారు ఈనూతనరాజ్యాంగవిధానము నంగీకరింపనివారును, "సమిష్టిభాగ్యవిభజనపద్ధతి నంగీకరింపనివారని అనుమానింపబడినవారును" అనేక యిబ్బందులకు లోబడచేయబడుచున్నారు. ఈ నిర్బంధ విధానము ప్రజల నైతికాభివృద్ధికి చాల భంగకరము. భోజనమున్నను, మన స్వాతంత్ర్యము లేకుండుచో ప్రజలు బాగుపడుట అరుదేగదా! ఐనను సాంఘికసేవయందు, మానవసేవయందు ప్రజలకు ఆదరణకల్గించుచున్న యీసిండికేటులను పూర్తిగా నిరసింపజాలము. మరియు విప్లవమునకుపూర్వము చక్రవర్తి సాంఘికవాదులకు కల్గించిన యిబ్బందులుతలచుకొనుచో బోల్షివిక్కులు తెచ్చిపెట్టిన నిర్బంధనిధానము క్షమార్హ్యమగును.

ఎనిమిది: ఇంగ్లాండాదిగల దేశములు ప్రజాస్వామికములైనను, ఇతరప్రజల, దేశముల, జాతుల, లోబరచుకొని వారిని స్వతంత్రముగానుంచి వారివలనకల్గు లాభముల దుర్న్యయముగాబొందుటకు సంశయించుటలేదు. ఇంగ్లాండునందు, ఫ్రాన్సునందు, అమెరికాయందు పౌరులప్రాథమికహక్కులను

సుస్థిరపరచుచు ఆదేశీయులు తమకున్న సామంత రాజ్యము లందలి ప్రజలకట్టి వాక్కుల నిరాకరించుచుండుట వైపరీత్యమే కాక దుర్మార్గముకూడను. ఈవిపరీతమునకు రషియా లోబడుట లేదు. ఆరాజ్యాంగము యే దేశములనావరించినదో వానికెల్లను సిండికేటులద్వారా సర్వస్వాతంత్ర్యముల నొసంగి ఆయాప్రదేశములందెల్లను "కర్షక కార్మిక"పై తన మేర్చరచి "సమిష్టి భాగ్యవిభజనపద్ధతిని" అనుభవమునందు పెట్టుచున్నది. ప్రపంచమందలి ప్రజాస్వామిక దేశములన్నిటికీ విషయమందు రషియాజ్ఞానదీపమును వెల్గించి, ధర్మమార్గము జూపెట్టుచున్నది.

తొమ్మిది: తదితర దేశములందెల్లను ప్రజా సామాన్యమునకు జెందినట్టియు, ప్రజాసామాన్యాభివృద్ధి కోరునట్టియు ప్రజాసామాన్యముపై నాధారపడు ప్రతినిధులకు ఆయా ప్రజాప్రతినిధిసభలయందు చాలతక్కువ సభ్యతకల్గుచున్నది కదాచితుగతప్ప ఆ దేశములయందు లేబరుపక్షమువారు జనసంఖ్యబట్టి వందకు డెబ్బదియైదుమందికంటె హెచ్చుగానున్నను ప్రజాప్రతినిధిసభలందు వారికి వందకు ముప్పదిస్థానములైనను దక్కుటలేదు. రషియా యందట్లుగాక ప్రజాసామాన్యమునకే అన్నిసోవియటులందును సంపూర్ణాధిక్యత కల్గుచున్నది. కనుక రషియాయందే ప్రజాసామాన్యమునకు సంబంధించిన ప్రజాస్వామ్యపురాజ్యాంగ మున్నదని చెప్పవచ్చును.

పది: తదితరదేశములందు వర్తక వాణిజ్యములు, వ్యవసాయము, తదితరవృత్తులు వ్యక్తుల యిష్టాయిష్టములపై, సమర్థతాసమర్థతలపై ఆధారపడి యుండుచున్నవి. "వ్యక్తిగత భాగ్యవిభజనపద్ధతి" ననుసరించి ఆదేశముల ఆర్థికజీవితము నడుపబడుచున్నది కనుక కొలదిమంది ధనికులును అనేకులు బీదలునై కోటీశ్వరులయొద్ద ధనము మూల్గుచుండ బీదలు తిండిలేక మలమలమాడుచుండుట తటస్థించుచున్నది. మరియు ఒకప్రక్క వర్తకవాణిజ్యములందు వస్తునిర్మాణశక్తి హెచ్చుగాయున్నను, మరొకప్రక్క బలాఢ్యులగు కష్టించ నిష్టపడు కార్మికులు కొల్లలుగాయున్నను ఒకవంక వస్తువులు తయారుచేసి విక్రయించుటకు వ్యాపారస్తులున్నను మరొక వంక లక్షలకొలది ప్రజలు తినుటకు తిండి, ధరించుటకు వస్త్రముల, కోరుచున్నను "వ్యక్తిగతభాగ్యవిభజనపద్ధతి" ప్రాబల్యమువలన ఒకరితోనొకరికి సంబంధము లేక ఆర్థికసంక్షోభములు కల్గి, కొనువారు లేక వర్తకులు వస్తువుల తయారుచేయుట మానుటయు, వస్తునిర్మాణమూపబడుటచే కార్మికులు నిరుద్యోగులగుటయు, నిరుద్యోగము ప్రబలుటచే వస్తువులకొను వారు తగ్గుటయు అంత నందరు దరిద్రదేవతకు బలియగుటయు చూడనగును. ఈదౌర్భాగ్యత పోగొట్టుకొనుటకు ప్రభుత్వము ప్రయత్నించి సఫలతబొందవలయునన, రషియామార్గమే శరణ్యము.

రషియాయం దిట్టి “వ్యక్తిగతభాగ్యవిభజన” పద్ధతి నిరాకరింపబడినది. జమీందారులు వెడల నంపబడిరి. భూమి సాధారణరైతులమధ్య పంచబడినది. వర్తకములు, వాణిజ్యములు, అన్నియు ప్రభుత్వవశమందున్నవి. చిన్నచిన్న దుకాణములుతప్ప, మరి యితర ఆర్థికజీవిత విధానమెద్దియు, వ్యక్తుల ప్రత్యేకపెత్తన మందులేదు. భూవిభజన యందు కూడను, సిండికేటులచే సాగుచేయబడు భూమి విస్తీర్ణత హెచ్చుచున్నది. స్వంతభూమిని స్వయముగా సాగుచేయుకొను వారి సంఖ్య, శిస్తుల భారమధికమగుటవలన నేమి, కార్మికులు దొరకకుండుటచే నేమి, క్రమముగా తగ్గుచున్నది. కనుక కొలదికాలముననే ఆర్థికజీవితమంతయు సిండికేటుల పెత్తనముక్రిందకు వచ్చును. ఈ “సమిష్టిభాగ్యవిభజన” పద్ధతి ననుసరించి, ఆర్థికజీవితమునంతను ప్రభుత్వమే నడపును, సిండికేటులద్వారా కర్మాగారములు, తదితర వాణిజ్యముల సాగింపుచు, కార్మికులకు జీవితాధారమునకు వలయు జీతభత్యముల నిచ్చుచు, అవిటివారికి, అనాథలకు, చూలాలురకు, ముసలివారికి, బిడ్డలకు తగు పోషణకల్గించుచు, సిండికేటుల కౌన్సిలువారు ప్రజామోదకరముగా రాజ్యముచేయుచున్నారు. ఇతరదేశములందు, కార్మికులమధ్యను, యజమానులమధ్యను పోటీలు, పోట్లాటలు కల్గుచుండుటచేతను, నిరుద్యోగము ప్రబలుటవలనను, వస్తునిర్మాణశక్తి తగ్గుచుండ,

రషియాయందు, కార్మికు లెల్లరు, తమ సిండికేటులకొరకై, తమ పెత్తందారులమాటచొప్పున, తమకు నచ్చిన ప్రణాళికలే యమలుపరుపబడుచుండుటచే, శక్తివంచన లేకుండా, నిరంతరము కృషిచేసి, వస్తునిర్మాణమును వృద్ధిపరచుచున్నారు సంపాదించిన సొత్తువంతయు, ప్రజాభ్యుదయముకొరకై మాత్రమే, సిండికేటు లుపయోగించుచుండుటచే, ప్రజాసామాన్యము, క్రమముగా, తదితర దేశములందుకంటె, సులభముగా సౌఖ్యమందగల్గుచున్నది. తదితర ప్రపంచమునందంతట, నిరుద్యోగబాధచే, లక్షలకొలది ప్రజలు కృశించుచుండ, రషియాయం దీనాడు, “పంచవత్సరముల” “ఆర్థికనిర్మాణకార్యక్రమవిధానము”ను సాధించుటకై ప్రజలెల్లరు నిమగ్నులైయుండుట, ఎల్లరికీ ఆశ్చర్యముగొల్పుచున్నది. ఆదేశమునందంతట, కర్మాగారములు లేపబడుచున్నవి. రహదారులు వేయబడుచున్నవి. ఎలెక్ట్రికుసప్లై గ్రామగ్రామములకు వచ్చుచున్నది. వ్యవసాయము, శాస్త్రరీత్యా సాగించబడుచున్నది. కార్మికులకు, పయోజనవిద్యయు, బాలబాలికలకు ప్రాథమికవిద్యయు, ప్రజాసామాన్యమునకు, వివిధ చిత్రకళల పరిచయము, ప్రచారమొనర్పబడుచున్నవి.

స్త్రీపురుషుల మధ్య, చక్రవర్తి కాలమున ఆర్థిక సాంఘిక హక్కులందుగల విభేదములు రద్దుచేయబడినవి. “డివోర్సు” ను (వివాహమునుండి విడాకులు) పొందుటకు పురుషులకెంత స్వాతంత్ర్యముకలదో, అంతస్వేచ్ఛ

స్త్రీల కొసంగ బడుచున్నది. కర్మాగారములందు కూలి చేయుటకు, స్త్రీపురుషులు సమానమగు కూలిపైననే నియమింపబడు చున్నారు. చూలాలురగు స్త్రీలకు ప్రత్యేక రక్షణయివ్వబడుచున్నది. బిడ్డను గన్నతల్లికి, కొంతధనము, దుస్తులు బహుమతిగా యివ్వబడుచున్నవి. స్త్రీలసంఘము లేర్పరచబడుచున్నవి. స్త్రీపురుషుల ఆరోగ్యాభివృద్ధికై తగు శ్రద్ధతీసుకొనబడుచున్నది. "ఐదువత్సరముల ఆర్థికనిర్మాణ కార్యక్రమవిధానము" దాదాపుగా సాధించబడినది. కనుక, కార్మికులకు, కృషీవలులకు, స్వంతసౌఖ్యములకై హెచ్చు ఖర్చులజేసుకొనుటకు స్వాతంత్ర్యము కొంచెము హెచ్చుగా నివ్వబడనున్నది. ఇంతవరకు, తమ కాదర్శప్రాయమగు "సమిష్టిభాగ్యవిభజనపద్ధతి" జయముందుటకై, తమరాజ్యము, తదితరపాశ్చాత్యరాజ్యములవలె, వాణిజ్యాభివృద్ధిబొందుటకై, సంశయరహితులై, ప్రజలు తగుత్యాగముల చేయుచుండిరి. క్రిందటిసంవత్సరము, కరవువలన యిబ్బందికల్గినను, రైల్వే సదుపాయములు తగినంత లేకుండుటచే, తినుబండారములు ఒక ప్రాంతమునుండి మరొకప్రాంతమునకు తీసుకొనిపోవుటకు వీలు లేకున్నను, భోజనపదార్థములు (తుదకు పంచదార, రొట్టె, వెన్న, గ్రుడ్లు) తక్కువైపోయినను, ఓర్చుకొని, క్రిందటి ఐదువత్సరములనుండి, అమెరికన్, జర్మను, ఫ్రెంచి యింజనీయరుల రప్పించి, ఇనుము, ఉక్కు తెప్పించి, మెషినుల దిగుమతిచేసి, రాజ్యాభివృద్ధి కల్గించుచున్న రష్యా

యను ప్రజలు శ్లాఘాపాత్రులు. అన్నిటికంటెను అత్యద్భుతకరమైన విషయము, బోల్షివిక్కునాయకులు, విసుగు విరామములేక, తాము ప్రేమించిన, వాంఛించిన గమ్యస్థానము చేరుటకై క్రిందటి పదునైదువత్సరములనుండి, ఇంతింతన రాని కష్టములకోర్చి న్యాయముగా, ధర్మబద్ధముగా, ప్రజాపాలనం బొనర్చుటయే. ఏదేశమందైన లంచగొండులగు మంత్రులున్నట్లు వినగల్గుచున్నాము కాని, రషియాయందీమాట వినరాదు. రాజ్యాధికారమంతయు తమ హస్తగతమైనను, శ్రీ లెనినుగారు, ట్రాట్స్కీగారు, తుదకు ఇప్పటి స్టాలినుగారు తమ లాభమునే మాత్రము వాంఛింపక, తమ సౌఖ్యము కోరక, ప్రజల మేలే కోరి అహోరాత్రములు స్వరాజ్యాంగ సేవ చేయుట కడుంగడు శ్లాఘనీయము. వీరికి, పందలకొలది ముస్సొలీనీగార్లు గాని, పదులకొలది రామ్సేమాక్డునాల్డుగార్లు గాని సరిరారు. మన మహాత్ముడు వారిశిష్యులుమాత్రమే వీరితో పోల్చదగినవారు. క్రీస్తు మతమందు వీరికి నమ్మకము లేకున్నను, మానవకళ్యాణమందు, క్రిస్తియనులకు దేవునియందుండు ప్రేమకంటె హెచ్చుప్రేమ ఆదరము కలదు. బోల్షివిక్కునాయకులు ధన్యులు, మానవసేవకులు, ధర్మపాలకులు, రషియాదేశమునకు, ఇంతవర కిట్టి నాయకులు సంప్రాపించియుండలేదు. శ్రీటాల్‌స్టాయి, మాక్సిమ్‌గోర్కిన్, ప్రిన్సుక్రోపోట్కిన్ గారలకు తగిన యనుచరులు వీరు.

# పదునాల్గవ ప్రకరణము

## స్థానిక స్వపరిపాలన

ప్రజాస్వామిక రాజ్యాంగము జయప్రదము కావలె నన్న ప్రభుత్వవ్యవహారముల నిర్వహించుటయందు, ప్రజా సామాన్యమునకు, సరాసరిగా గాని, వారి ప్రతినిధులద్వారా గాని, ఆవ్యవహారముల చర్చించి, వాని నడపురీతిని నిశ్చయించి, వాని స్వరూపమునే నిర్ణయించుటకు, తగినన్ని అవకాశములు కలుగ జేయుట అత్యావసరము. రాజ్యాంగమునకంత కొక్క ప్రజాప్రతినిధి సభ నేర్పరచి, ఆసభాసభ్యుల నెన్నుకొనుటకు ప్రజలెల్లరికి హక్కునిచ్చినంతమాత్రమున, ఆసభకే బాధ్యతవహించు మంత్రివర్గమువారిని, వారి ఆజ్ఞలందు, తగినంతగా నుంచుట కసాధ్యముగు నున్నదని చూచితిమి. అమెరికాయందువలె, శాసనసభల జీవితకాలము రెండేసంవత్సరములవర కుంచుటవలన, ఆసభలకు ప్రభుత్వ వ్యవహారముల సమర్థతతో విమర్శించుటకు అవకాశముకల్గుట లేదనియు ఇంగ్లాండునందువలె, ప్రజాప్రతినిధి సభవారు ఐదువత్సరముల వరకు ఎన్నుకొనబడుచో, ప్రజాభిప్రాయమును నిర్లక్ష్యపరచ వచ్చునసియు, ఎటులైనను, ప్రజాశయములకు తగిన సమాధానము, ఇప్పటి శాసనసభలద్వారా కల్గుట లేదనియు తెలుసుకొంటిమి. ఇంగ్లాం డాదిగాగల దేశములందువలె, మంత్రి

వర్గము వారికి, తమ ప్రజాప్రతినిధి సభవారు ప్రజాభిప్రాయ మును ప్రకటించుటలేదని సందియముకల్గుచో, ఆసభనంత మొందించు నధికారమున్నది. కాని అప్పటికి, ప్రజాభిప్రాయ ప్రకారము, శాసనసభలు ప్రవర్తించుట దుర్ఘటమగుటయు, మంత్రులు ప్రజల యిష్టానుసారమే వర్తించుట అరుదగు టయు కాననగును. అమెరికా రాష్ట్రములందు, స్విట్జర్లాండు నందువలె, అసంతృప్తికరముగా ప్రవర్తించు శాసనసభా సభ్యుని, పదభ్రష్టునిచేయుటకు, వోటరుల కధికారముండినను కూడ, సంపూర్ణ సంతృప్తికల్గుటలేదు. దినదినము, సాంఘికా ర్థిక రాచకీయపు ఏర్పాటులు, అవసరములు క్షిప్రగతిబొం దుచుండుటచే, ప్రభుత్వపు కార్యభారము త్వరితగతి హెచ్చు చుండుటచే, శాసనసభలకు, అవసరమగుచున్న శాసననిర్మా ణమును సంతృప్తికరముగా జేయుటకు గాని, బిల్లులను మంత్రి వర్గమువారైన సమగ్రముగా పరిశీలించుటకు గాని సాధ్యప డుటలేదు. అందువలన, బిల్లులు సివిలుసర్వీసువారిచే తయా రుచేయబడుటయు, శాసనముల కనుబంధనియమములను సివి లుసర్వీసువారే నిర్ణయించుచుండుటచే, ప్రభుత్వకార్యనిర్వ హణభారమంతయు, సర్వీసులపై నుంచబడుటయు ఈవ్యవహా రములం దెద్దానినైనను, సంపూర్తిగా, సంతృప్తికరముగా, విచారించి, పరీక్షించి, తగినట్లు పరిష్కరించుటకు, మంత్రు లకు గాని, శాసనసభలకు గాని సావకాశముకలుగుట లేకుం డుటయు అనుభవసిద్ధములు.

ఇట్టి పరిస్థితులందు, సెనేటుసభ నేర్పరచిన గాని, ఆర్థిక శాసనసభ నేర్పరచినగాని, ఉన్న యిబ్బందులు తగ్గుట సాధ్యము కాదు. ప్రభుత్వ కార్యముల విమర్శించుటకును, ప్రభుత్వ కార్యక్రమవిధానమును నిర్ణయించుటకును, ఈసభలు, ప్రజాప్రతినిధి సభ వారికి, మంత్రివర్గములకు సహాయము చేయకల్గునే కాని, ప్రభుత్వ కార్యనిర్వహణభారమందు, కొంత తగ్గించుటకు మాత్రము ఈసభలు సహాయకారి కాజాలవు. ప్రతి డిపార్టుమెంటుచర్యల పరీక్షించుటకు, జాతీయ ఆర్థిక, సాంఘిక సమస్యలగూర్చి సలహాల నిచ్చుచుండుటకు, జిల్లాలయందలి, వివిధ ప్రభుత్వోద్యోగులకు, తమ కార్యనిర్వహణమందు సలహాలనొసంగుటకు, పౌరుల యొక్కయు శాసనసభాసభ్యుల యొక్కయు, స్థాయిసంఘము లుపయోగపడును. ఈసంఘములు, ప్రభుత్వపు వివిధశాఖలు, ప్రజాభిప్రాయము ననుసరించి, శాసనసభల తీర్మానముల ననుసరించి, నడుపబడుచుండుటను జాగ్రత్తపడి, మంచిచెడ్డల ప్రజలకు తెలియపరచుటకే సహాయపడకలవు కాని, ప్రభుత్వపు కార్యభారమును తగ్గించి, మంత్రులకు జాతీయసమస్యలపైననే జాగ్రత్తకల్గియుండుటకు సావకాశము కలుగజేయుటకు నుపయోగపడజాలకున్నవి.

మరియు, స్థానికముగా, ప్రతిజిల్లా, తాలూకా, గ్రామములకు సంబంధించిన, సాముదాయకావసరముల దీర్చుటకు,

కేంద్రప్రభుత్వము ప్రయత్నించుట నష్టదాయకము. గ్రామ పంచాయితీ వ్యవహారముల తెల్పుకొనుటకు, మనవారు, మద్రాసువరకు వెళ్ళి, పంచాయితీల ఇన్‌స్పెక్టరు జనరలు గారివద్ద మనవి చేసుకొనవలసి వచ్చుటవలన, ఎంత మానసిక వ్యసనమునకు ధననష్టమునకు తదితర యిబ్బందులకు లోనగు చున్నారో అనుభవైకవేద్యము. సాధారణస్థానికావసరము లగు, పాఠశాలల యాజమాన్యత, రహదారుల నిర్మాణము, ప్రజల ఆరోగ్యము, పశువ్యాధుల నివారణ, అనాథలకు పోషణ, మంచినీటి వసతులు కల్పించుటకు, ఏయే పద్ధతుల నెంతెంతవర కుపయోగించదగునో, ఎంతధన మగత్యమో ఆధన మెవ్వరెవ్వరినుండి వసూలుచేయదగునో, నిర్ణయించు టకు, కేంద్రప్రభుత్వమున కధికారమిచ్చి, దానిని ప్రజల ప్రతినిధులద్వారా పరీక్షించ బ్రయత్నించుటకు మారు, స్థానికముగనే, ఆ యా వ్యవహారముల నిర్వహించుటకు తగు ప్రభుత్వకార్యకలాప భారమును, స్థానికముగనే యుండు ప్రజలపై మోపుట యుత్తమము. అందువలన, స్థానికావసరములు హెచ్చు తృప్తికరముగా ప్రజలకు కలుగజేయబడుటకు స్థానికప్రభుత్వమును ప్రజలు, వెంటవెంటనే సులభముగా నడుపుచు తమ అదుపుఆజ్ఞలందుంచుటకు సాధ్యమగును.

మరియు, ప్రజాస్వామికమందు, అనాదిగ్రీసుదేశము నందెట్లో, అటుల ఎంత హెచ్చుమందికి, ప్రభుత్వవ్యవహారము

లపై పెత్తనముకల్గుచున్న, అంతలాభము, ప్రజాసామాన్య మునకు, ప్రభుత్వమునకుకల్గును. ప్రభుత్వకార్యనిర్వాహకా నుభవము, శాసనసభలందు, స్థానికస్వపరిపాలనా సంస్థలందు వివిధస్థాయిసంఘములందు జేరిననేగాని, ప్రజానాయకులకు కలుగదు. ప్రతివ్యక్తికి ఇట్టియనుభవము బొందుటకు అవకా శములకల్గించుట దుస్తరమే! కాని యాయనుభవము పొందు టకు, ఎంతవరకు సాధ్యమో, అంతవరకు అవకాశముల సృష్టిం చుట మేలుకదా! ఒక్కపౌరుడు, ప్రభుత్వ కార్యనిర్వాహణా నుభవము, ప్రజాభిప్రాయ ప్రకటనానుభవము బొందుచో, ఆయనను బలపరచు వేలకొలది ప్రజలకాయనుభవ ప్రభా వము సంప్రతించుటయు, వారందరికి తాముకూడ రాచకా ర్యనిర్వహణముతో కొంతసంబంధము కల్గియున్నవారమను సంతృప్తికల్గుటయు, అందువల్ల తమతమ యభిప్రాయముల ప్రకటించి, ఆయభిప్రాయములు ప్రభుత్వకార్యముల రూపక ముగా సార్థకతబొందించవలెనని ఆతురతజెంది, తగుప్రయ త్నముల జేసి, ప్రభుత్వకార్యముల జాగ్రత్తగా విమర్శించుచుం డువారి సంఖ్య హెచ్చుచుండుటయు సాధ్యము. కనుక, కేం ద్రప్రభుత్వముపైనుండు కార్యభారము తగ్గించి, మంత్రివర్గ మునకు కొంతవరకు, జాతీయావసరములదీర్చ హెచ్చుసావ కాశము కల్గించి, శాసనసభలయొక్క కార్యభారముచు తేలి కపరచి, జాతీయావసరములపై దృష్టి నిగుడ్చుటకు వీలు

కలుగజేసి, స్థానికావసరములను ప్రజాభిప్రాయముల కనువ యముగాదీర్చి, ప్రజలకు ప్రభుత్వకార్యములందు కొంతవర కైన హెచ్చుసంబంధము కలుగజేయుటకు, స్థానికస్వపరి పాలనసంస్థలగత్యమగుచున్నవి.

ఈస్థానిక స్వపరిపాలనాసంస్థలు వివిధదేశములందు వివిధరీతుల నేర్పరచబడుచున్నవి. అమెరికాయందు, తాలూకా, జిల్లాబోర్డుల సభ్యులేకాక, ఆబోర్డుయుద్యోగులు కూడ, ప్రజలచే యెన్నుకొనబడుచున్నారు. ఫ్రాన్సు, జర్మనీ బ్రిటిషువారి ప్రజాస్వామ్యపురాజ్యములందు, నార్వే స్వీడనులందు, మనదేశమందును, ఈ బోర్డుల సభ్యులెల్లరు ప్రజలచే ఎన్నుకొనబడుచున్నారు. మనదేశమునందుతప్ప, తదితరదేశములందెల్లను, యుక్తవయస్కులగు స్త్రీపురుషులెల్లరువోటు హక్కుపొందియున్నారు. అమెరికాయందు తప్ప, మరియేయితరదేశములందును, బోర్డులు, మ్యునిసిపాలిటీల యుద్యోగులను యెన్నుకొనుట లేదు.

స్విట్జర్లాండునందును, కొన్నిఅమెరికను రాష్ట్రములందును, బోర్డులయొక్కయు, మ్యునిసిపాలిటీ కౌన్సిళ్లయొక్కయు సభ్యులను, వోటరులు పదభ్రష్టులజేయుటకు అవకాశము కలదు. ఈ 'రీకాల్' అను "పదభ్రష్టతనొందించు" నధికారము, వోటరులకుండుటచే, తమప్రతినిధులు, స్థానిక (స్వపరిపాలనా) సంస్థలయందు, ప్రజాభిప్రాయము ననుసరించియే

ప్రవర్తించునటుల జేయుటకు సాధ్యమగును. కనుకనే యీపద్ధతిని యింగ్లాండునందుకూడ ప్రవేశపెట్టుట యుక్తమని రాజ్యాంగవేత్తలు ప్రచార మొనర్చుచున్నారు.

స్థానికసంస్థల వ్యవహారముల నిర్వహించుటకు వలయు ప్రధానోద్యోగుల నిర్ణయించునధికారము, అమెరికాలో, ప్రజలు, తమయందేయుంచుకొనుచున్నారు.

ఉద్యోగులు:- అమెరికా,

అచ్చటి మేయరులు కొందరుద్యోగులను, వివిధప్రధానోద్యోగులు తమక్రిందివారిని, నియమించకలరు. కాని, మేయరులు, తదితర ప్రధానోద్యోగులు ప్రజలవలననే ఎన్నుకొనబడుచున్నారు. ఆరాజ్యాంగమున ప్రాధాన్యతవహించిన రిపబ్లికను డెమోక్రాటికు పార్టీలు, స్థానికసంస్థలందు శ్రద్ధవహించుచున్నదికనుక, ఏయేపార్టీవారు, ఏయేయుద్యోగస్థానములను, ఎన్నికలద్వారా సంపాదింతురో, ఆయా డిపార్టుమెంటులందలి యుద్యోగములన్నింటికి తమపార్టీవారినే నియమించుచుండుటకలదు. ఈవిధముగా అప్పుడప్పుడు, స్థానికసంస్థల యుద్యోగులెల్లరు, వివిధరాజకీయపక్షముల ప్రాబల్యత ననుసరించి మారుచుండుట కలదు. ఈవిధముగా, వివిధడిపార్టుమెంటులు, వివిధరాజకీయ పక్షముల వశమగుచుండుటచేతను, మెయరుల కన్నిడిపార్టుమెంటులపై తగినంత పెత్తనములభించకుండుటచేతను, ఏస్థానిక సంస్థయందును ఒకవిధమగు రాజ్యాంగకార్యక్రమము

అమలుజరుపబడకుండుటచే, ఆసంస్థ యెట్టికార్యమును త్వరగా సాధించలేకున్నది. ప్రతిడిపార్టుమెంటును తన కార్యముల నిర్వహించవలెనన్న మిగతా డిపార్టుమెంటుల సహకారము పొందవలయునుగదా! విద్యాశాఖవారు బాలబాలికల ఆరోగ్యమునుగూర్చియు విద్యాలయముల నిర్మాణముగూర్చియు శ్రద్ధచేయక తప్పదు. కాని ఆరోగ్యశాఖయు ఇంజనీయరింగుశాఖయు ప్రతిపక్షీయుల వశమందుండుచో, విద్యాశాఖోద్యోగు లెట్టి కార్యములసాధింపజాలరుగదా! కనుకనే ఆదేశమందు వోటరులు స్థానికసంస్థలయెన్నికలందు జాగ్రత్తచేయుచుండుటయు, స్థానికసంస్థలవ్యవహారములు ప్రజావసరముల సంతృప్తికరముగా నడుచుచుండుటయు జరుగుచున్నవి. కొన్నిరాష్ట్రములందుమాత్రము సంస్కారవాదులు ఈవిధోద్యోగుల నెన్నుకొనుపద్ధతిమాన్చి మేయరులమాత్రమెన్నుకొని వారిపైననే స్థానికసంస్థల ప్రభుత్వనిర్వహణభారమునుంచి స్థానికసంస్థల యుద్యోగులను పోటీపరీక్షలద్వారా, రాజకీయపక్షేతరముగా నియమించునట్లు తగుశాసనముల నిర్మించుచున్నారు.

భారతదేశము.

మనదేశమందు పంజాబులో నింకను, 26 జిల్లాబోర్డులలో మూడింటికిమాత్రము ఎన్నుకొనబడిన ప్రెసిడెంటులు కలరు. మిగతాబోర్డుల ప్రెసిడెంటులు ప్రభుత్వముచేనియమింపబడిన యుద్యోగులే! బెంగాలు

బోర్డులు మ్యునిసిపాలిటీలందిప్పటివఱకున్న ప్రభుత్వనియామాకములగు సభ్యత్వముల తీసివేయుటకు ఆరాష్ట్రపుశాసనసభ యంగీకరించదాయెను. రాఁగాపోఁగా మన రాష్ట్రమందు మాత్రము స్థానికసంస్థలన్నిటికి (ఏజెన్సీబోర్డులుతప్ప) ఎన్నుకొనబడిన అధ్యక్షులే కలరు. నామినేటెడు స్థానములన్ని బోర్డులనుండియు (ఏజెన్సీబోర్డులు కాక) తీసివేయఁబడినవి. అన్ని స్థానికసంస్థలకును తమ అధ్యక్షుల నెన్నుకొను నధికారము కలదు. మద్రాసునగరపు కార్పొరేషనుకుతప్ప మిగతా అన్ని సంస్థలకు తమ కగత్యమగు యుద్యోగుల నియమించుకొను నధికారముకలదు. మద్రాసు కార్పొరేషనుయొక్క ప్రధానోద్యోగియగు కమీషనరును మాత్రము ప్రభుత్వము నియమించును. మిగతా యుద్యోగులనందరిని కార్పొరేషను కౌన్సిలువారి యనుమతిపైననే నియమింపఁదగును. మన స్థానిక సంఘముల యుద్యోగులలో కెల్లను ఇంజనీయరులు మాత్రము రాష్ట్రీయసర్వీసులకు చెందినవారు. మిగతా యుద్యోగులు కూడ నిట్టి సర్వీసులకే చెందియుండుట సబబని స్థానికసంఘసభలందు తీర్మానింపబడుచున్నది. ఏవో కొన్నిబోర్డులు మ్యునిసిపాలిటీలు (మధురముఖ్యమైనది) తమకార్యముల చక్కబెట్టుకొనలేక ప్రజయందసంతృప్తి అత్యంతముగాకల్గించుచో, వాని కౌన్సిళ్లను రద్దుపరచి స్పెషలుఆఫీసరుల వేయుటకు ప్రభుత్వమునకు హక్కుగలదు. మద్రాసులో మాత్రము స్థాయి-

సంఘములకు ఆయా డిపార్టుమెంటుల అనుదినకార్యముల చర్చించి అన్నివిషయములను ముందుగా కౌన్సిలునకు నివేదించవలెను. కౌన్సిలువారిచే నంగీకరింపబడని యేతీర్మానముకూడ అమలుజరుపుటకు కమీషనరునకధికారము లేదు. మిగతా స్థానికసంస్థలందిట్లుగాక కౌన్సిళ్ల చైరుమనులు బోర్డుల ప్రెసిడెంట్లు తమ కౌన్సిళ్లు బోర్డులు సమావేశనుందు లేనప్పుడు తామే అధికారులై తమకు సబబని తోచినవిధమున ఆజ్ఞల నిచ్చి తమ యుద్యోగులచే స్థానికప్రభుత్వ కార్యముల నిర్వహించుచుండనగును. వారి ఆజ్ఞలు నియమములు కార్యములు స్థానికసంస్థలచే నంగీకరింపబడవలసియున్నవి. ఐనను సాధారణముగా తమతమ సంస్థలందు మెజారిటీలను ఈయధ్యక్షులు కల్గియుండెదరు కనుక వీరిపరిపాలన సాధారణముగా యామోదించబడుచుండును. ఈసంస్థలవలన యేర్పరచబడు స్థాయిసంఘములు అధ్యక్షులకు సలహాలమాత్రమివ్వకల్గును. తుదకు అమలుపరచదగిన తీర్మానముల జేయునది అధ్యక్షులే! అనగా స్థానికసంస్థలయనుమతిపై ఆజ్ఞలపై వాని అధ్యక్షులు మనరాష్ట్రమందు స్థానికస్వపరిపాలనమును నడపుచున్నారు. స్థానికసంస్థ సభ్యులెల్లరు ఆపరిపాలకుల నడుపు నాజ్ఞలందుంచుటకుమాత్రము అవకాశముకల్గి యున్నారు.

యూరపు ఖండము.

ఫ్రాన్సు, ఇటలీ, జర్మనీ, ఆదిగాగల యూరపియను దేశములందు (ఇంగ్లాండునందుతప్ప) స్థానికసంస్థల పాలనమంతయు, ప్రభుత్వముచే నియమింపబడు 'ప్రీఫే' ల వశమందున్నది. ఈ "ప్రీఫే"లు, సివిలు సర్వీసుసభ్యులైయుందురు. వారు, స్థానికసంస్థలపరిపాలనమును నడపుచుండుటయే గాక, మనదేశమందలి కలెక్టరులవలెనే, ప్రభుత్వకార్యనిర్వాహణమును చేయుచుందురు. అనగా, పంజాబునందలి జిల్లాబోర్డులు, 1920 కి ముందుమన రాజధానియందలిబోర్డులు ఎట్టిస్థితియందుండెనో, అట్టిస్థానమందె, యూరపియను స్థానికసంస్థలుకలవు. ఈ 'ప్రీఫే'లు మద్రాసులోనికమీషనరునకంటె హెచ్చుఅధికారములు కల్గియుందురు. వీరె స్థానికస్వపరిపాలనా ప్రభుత్వమునకు వలయు నుద్యోగులనియమించి, ఆప్రభుత్వమును, మనరాష్ట్రములోని బోర్డుల ప్రెసిడెంటులవలె నడపుచుందురు. సంవత్సరమునకు, ఒకమారు, రెండు లేక నాల్గుమారులు సమావేశమగు తమ స్థానికసంస్థలకు, ఈప్రీఫేలు తమ ప్రభుత్వకార్యనివేదికను సమర్పించుచుందురు. తమ అనుదినపత్రమందు ప్రజాభిప్రాయమును, స్థానికసంస్థలయభిప్రాయమును తమకు తెలియజేయుటకై, స్థాయిసంఘములుపయోగపడుచుండును. బడ్జెట్టుల తయారుచేయుటకుమాత్రము స్థానికసంస్థలకు దాదాపుగా సంపూర్ణహక్కు కలదు. కాని అత్యంతముగా ముఖ్యమగు

ప్రభుత్వఖర్చుల తగ్గింపజూచుటకుగాని, హెచ్చింపప్రయత్నిం చుటకుగాని, ఆయాసంస్థలకు సంపూర్ణమగు హక్కు లేదని చెప్పవలయును. ఈసంస్థలు ప్రతిపాదించు తీర్మానములు, ఉపశాసనములు (Bye-laws)ఏవి చట్టసమ్మతములో, ఏవిచట్ట విరుద్ధములో విచారించి, చట్టవిరుద్ధమైనవిగా తమకు తోచు వానిని నిరాకరించుటకు ప్రీఫేలకు నధికారముకలదు. మరి యు, జిల్లా తాలూకాలందలి ప్రభుత్వవ్యవహారముల నెరవు టకీయుద్యోగులు నియమింపబడియుందురుగాన, వీరిప్రాపక ము, ఏదోయొకవిషయమందు సంపాదించుటకు దాదాపు ఎల్లరుసభ్యులు ప్రయత్నించుచుందురు గనుక వీరికి స్థానికసంస్థ లందు, నిరంకుశాధికారము సంప్రాప్తించుచున్నదన్న ఆశ్చర్య మేమి? కనుకనే, ఈదేశములందలి వోటరులు ఈసంస్థల యెన్నికలన్న, శ్రద్ధబుచ్చుకొనుట లేదు. శాసనసభాసభ్యు లీయుద్యోగులను విమర్శించుటకు భయమందుచుందురు.

బ్రిటిషువారి రాజ్యాంగములన్నిటియందును, ఇంగ్లాం డునందములోనున్న స్థానికస్వపరిపాలనా సంస్థమాదిరి సంస్థ లే కలవు. ఇంగ్లాండునందలి యీసంస్థలన్నిటి

ఇంగ్లాండు.

యందును ఎన్నుకొనబడినసభ్యులేకలరు. పౌరు లెల్లరు ఈసభ్యులనెన్నుకొనుచుందురు. మనదేశమందు 1930 సంవత్సరమువరకు ఆచరణమందున్న పద్ధతివలె తాలూకా బోర్డుసభ్యులె జిల్లాబోర్డు సభ్యులనెన్నుకొను యాచరణ

అమలునందు లేదు. అన్నిబోర్డుల సభ్యులు ప్రజలచే సరాసరి యెన్నుకొనబడుచుందురు. ఆదేశపు స్థానికసంస్థల యుద్యోగులెల్లరు స్థానికసంస్థలవలననె నియమింపబడుచున్నారు. స్థానికసంస్థలన్నిటికి, మేయరులుకాని, అధ్యక్షులుగాని కలరు. వీరు సభ్యులచే నెన్నుకొనబడెదరు. ఈసంస్థల కార్యనిర్వాహణ భారము వివిధస్థాయిసంఘములపైనున్నది. ఈస్థాయిసంఘములను, స్థానికసంస్థలెన్నుకొనుచుండును. స్థానికసంస్థలు సమావేశమైనప్పుడీ స్థాయిసంఘాధ్యక్షులు, తమకు సంబంధించిన డిపార్టుమెంటునందు ఏయే వ్యవహారము లెట్లుచేయుట సబబో సూచించుచు, ఆసంస్థలకు నివేదింతురు. తమకిష్టముండునంతవరకు, స్థానికసంస్థలు ఆస్థాయిసంఘములయధ్యక్షుల సూచనలనంగీకరించుచుండును. ప్రతిస్థాయిసంఘపు ఉద్యోగవర్గమునకు నడపుటకై, ఒక యుద్యోగికలడు. ఈయన సాధారణముగా, బారిష్టరై సాంఘికశాస్త్రమునందు తరిబీతై యుండును. ఈవిధముగ బ్రిటిషువారి స్థానికస్వపరిపాలనమందు మన దేశమందువలె అధ్యక్షులే యధికారులై యుండుటకుమారు, స్థాయిసంఘములు చాల ప్రాముఖ్యతజెందియుండును. స్థాయిసంఘములసూచనలే హెచ్చుగాయంగీకరింపబడినను, సంపూర్ణాధికారము, స్థానికసంస్థలయందే మూర్తీభవించియుండును. కార్యనిర్వాహణమందనుభవము బొందుటకు మన రాజధానియందువలె ఏకొక్కయధ్యక్షునకే గాక స్థాయిసంఘముల సభ్యులెల్లరకు అవకాశము కల్గుచుండును.

అన్ని దేశములందు పట్టణస్థాయిసంఘాధ్యక్షుల "మేయరు" లనుట వాడుకయైయున్నది. వీరిని అమెరికాలో ప్రజలే యెన్నుకొనుచుందురు. ఫ్రాన్సు, బ్రిటిషు వారి రాజ్యాంగములు, తదితర దేశములందు, మునిసిపలుకౌన్సిళ్లు, ఎన్నుకొనుచుండును. ఈమేయరులకు అమెరికాయందు కొన్నిపట్టణములలోను మనదేశమందన్ని పట్టణములందును (కలకత్తా, బొంబాయి, మద్రాసు) మునిసిపలు వ్యవహారనిర్వహణభారము పూర్తిగా నివ్వబడుచున్నది. వీరే తమమునిసిపాలిటీ ప్రభుత్వమునకు ప్రధానాధికారులై ప్రజలకు తమకౌన్సిళ్ళకు బాధ్యులైయుందురు. ఈస్థానములకు అధికముగు పోటీయెల్లప్పుడు జరుగుచుండును.

అధ్యక్షులు.

బ్రిటిషువారి ప్రజాస్వామిక రాజ్యాంగములందును స్విట్జర్లాండునందును మాత్రము, ఈమేయరులు, అధికారనిర్వహణమందు మాత్రము స్థాయిసంఘాధ్యక్షులుగాకంటె, హెచ్చు ఆధిక్యతబొందజాలరు ప్రతిమేయరు, ఒకటో, రెండో స్థాయి సంఘములకధ్యక్షుడుగానుండి మిగతా సంఘములన్నిటియందును సభ్యుడైయుండును. రాజ్యాంగపు గొప్పయుద్యోగులు రాచకీయనాయకులు, సాంఘికపెద్దలు, మతవేత్తలు, తమ పట్టణములకువచ్చినప్పుడు ఇతరదేశములందలి మేయరులవలెనే, వీరును తమప్రజలతరఫున ఆపెద్దలనాహ్వానించి, ఆదరించి ఆతిథ్యమిచ్చుచుండవలెను. ఈపదవియందుండవలయునన్న

చాలాధనము ఖర్చగును కాబట్టియు ప్రత్యేకపట్టణపరిపాలనాధికారము కలుగదు గనుకను ఈస్థానములకు పోటీపడువారీదేశములందు హెచ్చుగానుండరు. గనుకనే పార్టీలవారీగా వరుసప్రకారము హెచ్చుకాలము కౌన్సిల్ సభ్యులగువారిని స్థాయిసంఘాధ్యక్షులగువారిని మేయరులుగా సంవత్సరమునకొకమారెన్నుకొనుటకలదు. మరలమరల వీరెన్నుకొనబడుటకు హక్కుకలదు.

తాలూకా, జిల్లాబోర్డుల ప్రెసిడెంటులు, అమెరికాయందు ప్రజలచేతను తదితరదేశములందు బోర్డుసభ్యులచేతను ఎన్నుకొనబడుచున్నారు. అమెరికాయందు ఒకటి లేక రెండువత్సరములకొకమారు ఇండియాయందు మూడువత్సరములకొకమారు ఇంగ్లాండాదిగాగల దేశములందు ప్రతివత్సరము వీరు నెన్నుకొనబడుచుందురు. ఫ్రాన్సు, జర్మనీ తదితర యూరపియను దేశములందు, బోర్డులకు తమప్రెసిడెంటుల నెన్నుకొనుహక్కులేదు. వానికి ప్రభుత్వోద్యోగులగు "ప్రీఫే"లే అధ్యక్షులైయుందురు. మేయరులవలెనే, బ్రిటిషువారి ప్రజాస్వామిక రాజ్యాంగములందు స్థాయిసంఘాధ్యక్షులవలెనే బోర్డులప్రెసిడెంటులును ఒకసంఘమునకధ్యక్షులైయుండి గౌరవోద్యోగులుగా వ్యవహరించుచుందురు. ఇండియాయందును, యూరపుదేశములందును వీరుబాబాపుగా ప్రధానపూరుషులైయుండి తమబోర్డులపాలనమును నడపుచుందురు.

రషియాదేశమందు జిల్లాసిండికేటులు, రాష్ట్రదేశీయ సిండికేటులసభ్యుల నెన్నుకొనునట్లె మనదేశమందు 1930 ముందు తాలూకా బోర్డులసభ్యులు జిల్లాబోర్డులసభ్యుల నెన్నుకొనునట్లే, ఫ్రాన్సునందలి, జిల్లా తాలూకా బోర్డుసభ్యులు, సెనేటుసభ్యుల నెన్నుకొనుటకు వోటుహక్కు బొందియున్నారు. మనదేశమునందును స్టేటుకౌన్సిలుసభ్యుల నెన్నుకొనుటకు తాలూకా, జిల్లాబోర్డులకధ్యక్షులుగా నున్నవారు వోటరులై యున్నారు తాలూకా జిల్లాబోర్డు మునిసిపాలిటీలసభ్యులు మనదేశమందు, విశ్వవిద్యాలయ సెనేటునకు జిల్లాకొకసభ్యుని యెన్నుకొనుటయుకలదు. ఇంగ్లాండునందును, మనదేశమందును, స్థానికసంస్థలసభ్యులు టెంపరెన్సుకమిటీ దేవాలయములకమిటీ ఎడ్యుకేషనల్ కౌన్సిలు వగైరా సంఘములకు సభ్యుల నెన్నుకొను హక్కుగల్గియున్నారు.

రాచకీయ పార్టీలు.

అన్ని దేశములందును, స్థానికసంస్థల వ్యవహారములందు రాచకీయపార్టీలు శ్రద్ధదీసుకొనుచున్నవి. కేంద్రప్రభుత్వములను ప్రజలకు బాధ్యతవహించియుండునట్లు చేయుటకై యెటుల రాచకీయపక్షములగత్యమగుచున్నవో, అటులనే, స్థానికసంస్థలవ్యవహారములు సక్రమముగ ప్రజాభిప్రాయమును ననుసరించి నడుపబడవలయునన్న, రాచకీయపక్షములగత్యమగుచున్నవి. రాచకీయపక్షములు లేకున్నచో, ఏవ్యక్తి కావ్యక్తి అభ్యర్థిగా నిల

బడుచు, ఎవరికివారు వోటులనీయ ప్రారంభించుచో, అభ్యర్థు లుగానుండువారు స్వార్థపరులు, స్వాభిమానులు, స్వగౌరవ వాంఛితులు అను భిన్న ప్రజలను కల్గుటయు, ఎవ్వరికి పట్టె నిపెత్తనము తామచేయుచున్నప్పుడు తమలాభమును తా మెందుకు జూచుకొనగూడదని సభ్యులు తలంచుటయు, అందువలన స్థానికసంస్థలు దుర్మార్గుల, అప్రయోజకుల, స్వార్థపరుల వశమగుటయు తటస్థించును. స్థానికసంస్థలసభ్యు లను, పార్టీలకు మినహా, అనుపుఆజ్ఞలందుంచు వారెవ్వరు? పార్టీసాయము లేనిచో, ప్రజలు తమకేమియుగత్యమో, వివిధ సమస్యలగూర్చి తమ యభిప్రాయములెవ్వియో, తమ తీర్మాన ములెట్లుండవలెనో, తమ తాలూకా జిల్లాబోర్డులకుజెందిన భూభాగములకెట్టి యవసరములుకలవో నిర్ణయించుకొనుట యెట్లు? రాజకీయపార్టీలు మనస్థానికస్వపరిపాలనావ్యవహార ములందు లేకుండుటవలననే దేశమందెల్లెడల వినవచ్చు చుండు కనవచ్చుచుండు దుర్మార్గములు సాధ్యమగుట! పార్టీల సాయము లేకుండుటచే, వేలకు వేలమంది అభ్యర్థులు ధనమాన ముల పోగొట్టుకొనుటయు, ప్రజలకు తగు సదుపాయములు కలుగకుండుటయు అనుభవమగుచున్నది. ఇంగ్లాండునందు పార్టీ ప్రాబల్యత హెచ్చుగానున్నను, మెజారిటీయందున్న పార్టీవారే, స్థాయిసంఘసభ్యత్వముల నన్నిటికాని ఆసంఘ ముల అధ్యక్షస్థానములకాని, మేయరుస్థానములకాని, సంప్రా

ర్తిగా తామేయాక్రమించుట లేదు. వివిధపార్టీలకు వారివారి బలాబలములననుసరించి ఈస్థానములనన్నియు ధర్మమార్గమున ఆచారవతు పంచియిడబడుచున్నవి. ఇందువలన ప్రజాభిప్రాయమును ప్రకటించుటలో రాచకీయపార్టీలుపయోగపడినను గౌరవస్థానములనాక్రమించుటలో సర్వపక్షసామరస్యత జూపబడుచున్నది. మనదేశమందట్లుగాక, ఏయేనాయకులయనుచరులు ఆయాసంస్థలయందు మెజారిటీ సంపాదింతురో, ఆ నాయకులే ఆస్థానికసంస్థలందున్న గౌరవస్థానములు, అధికారస్థానముల, ఆక్రమించుచు, మైనారిటీయందున్న వారియనుభవమును స్థానికసంస్థలకు సంపాదించుటలేదు. ఇటు ప్రజాభిప్రాయమూ సరిగా ప్రచురమగుటలేదు. అటు సర్వమతాల సహాకారమూ సంపాద్యమగుటలేదు. ఇదియ మనస్థితి.

స్థానికసంస్థ లన్నిదేశములందును, తమకు సంబంధించిన భూభాగములందు, ప్రాథమికవిద్యాలయములు, అనాథశరణాలయములు, రస్తాలు, బాటలు, ఆరోగ్యవసతులు, ఆస్పత్రులు, పిచ్చి, మూగ, గ్రుడ్డివారికి విద్యాలయములు, ఏర్పరచవలసియున్నది.

ఈసంస్థల ధర్మములు.

మ్యునిసిపాలిటీలందును రహదారులపైనను వెల్తురుదీపముల బెట్టవలెను. త్రాగుటకు నీటిసప్లైని ప్రసాదించవలెను. ఇవన్నియు సాధారణముగాకల్లు స్థానికావసరములు. వీనినితీర్చుటకు, స్వయముగాగాని, కంట్రాక్టరులద్వారాగాని, స్థానిక

సంస్థలు ప్రయత్నించవచ్చును. మన దేశమందలి మునిసిపాలిటీలు, ఎలెక్ట్రికు సప్లై, రస్తాలు వేయుట, తప్ప, మిగతా కార్యములన్నిటి న్యాయముగానే చేయుచున్నవి. మునిసిపాలిటీలు బోర్డులు రస్తాల నిర్మాణము కంట్రాక్టరుల వశముందుంచుచున్నవి. కొన్ని మునిసిపాలిటీలు, తమ తమ ఎలెక్ట్రికు సప్లైని, ట్రాంకారులను, కంట్రాక్టరుల ద్వారా పొందుచున్నవి. ఇంగ్లాండునందు, ఈ ధర్మములనన్నిటి, ఇప్పుడు స్థానిక సంస్థలే స్వయముగా నిర్వర్తింపుచున్నవి.

స్థానిక సంస్థలు, వ్యాపారములందు జోక్యము కల్గించుకొని, స్థానికముగానందు ప్రజల ముఖ్యముగు భోజనావసరముల, తదితర ఆర్థికావసరముల తీర్చ ప్రయత్నించుట మంచిదను అభిప్రాయము, ఫ్రాన్సు, జర్మనీలందు ప్రచారమైయున్నది. జర్మనీయందీ యభిప్రాయము అధికారులచే ప్రోత్సాహించబడుటచే, అనేక మునిసిపాలిటీలు, అనేక మిల్లుల బెట్టుటయు బాంకుల స్థాపించుటయు, రొట్టె, పాలు, వగైరాల సప్లై చేయుటయు, కొన్ని నాటకశాలల స్థాపించుటయు జూడనగును. అనేక స్థానిక వాణిజ్యముల సంస్థలందు కొంత భాగపు ధనమును స్థానిక సంస్థలే యిచ్చి, ఆ సంస్థల పరిపాలనమందు శ్రద్ధబుచ్చుకొనుచుందురు. కొన్ని సంస్థలు, స్థానిక రైల్వేలను కూడ వేయించుచున్నవి. ఇందువలన, ప్రతివత్సరము, అనేక స్థానిక సంస్థలు, లక్షలకొలది ధనమును లాభముగా బొందుచున్నవి.

కనుక, (రేటుపేయరులు) శిస్తులచెల్లించవలసిన పౌరులపై పడుశిస్తుభారము చాలావరకు తగ్గుచున్నది. మరియు, ప్రజల యారోగ్యాభివృద్ధి కత్యవసరమగు, పరిశుభ్రమగు పాలు, రొట్టె, మాంసమువగైరాలను, స్థానికసంస్థలు, సప్లై చేసినటుల, వ్యాపారులుచేయరుగదా? ఇంగ్లాండునందిప్పుడిప్పుడు, స్థానికసంస్థలు ఈవ్యాపారములందు జోక్యము కల్గించుకొనుచున్నవి. బర్మింగుహాము మునిసిపాలిటీ బాంకులనేర్పరచుచున్నది. కొన్నిమునిసిపాలిటీలు, చాకిరేవులను, కొన్ని కటికశాలలను, కొన్నిరొట్టెలను తయారుచేయు మిల్లులను నిర్మించుచున్నవి.

సాంఘికవాదులనేకులు స్థానికసంఘముల యావరణమందు నివసించు ప్రజలకు అగత్యమగు భోజనపదార్థములు ఉడుపులు, వినోదార్థమువలయువస్తువులు తయారుచేయుటకు స్థానికసంఘములు పూనుకొని వ్యాపారులకు ఇప్పుడు పోవులాభముల నరికట్టుట ప్రజలకు శ్రేయోదాయకమనియు, "సమిష్టిభాగ్యవిభజనపద్ధ"కి ప్రోత్సాహకరమనియు వాదించుచున్నారు. కార్మికులకు, భూవసతికల్గించి భూమిని తీరికసమయములందు సాగుచేయుటవల్ల వారు ఆరోగ్యము బొందుట కవకాశముల కల్గించుటకుగాను, మునిసిపాలిటీలు తమచుట్టుపట్లనున్న భూమిని సంపాదించు టగత్యమని వీరు ప్రచార మొనర్చుచున్నారు.

స్థానికస్వపరిపాలనాసంస్థలకును, కేంద్రప్రభుత్వమునకును ఎట్టిసంబంధముండవలయును? కేంద్రప్రభుత్వము నిర్మించుశాసనముల ననుసరించియే, స్థానికసంఘములు వ్యవహరించుచుండును. స్థానికసంఘములు అనుబంధశాసనములచేయవచ్చునుకాని, వానిలో నెద్దియు, శాసనసభవారి శాసనమునకు, ఏమాత్రము వ్యతిరేకముకాకూడదు. అట్లు వ్యతిరేకమగు అనుబంధశాసనము చట్టవిరుద్ధమని ప్రకటించుటకు న్యాయమూర్తులకధికారముకలదు. వ్యాపారములు, వాణిజ్యములలో స్థానికసంఘములు, తమప్రజలయిష్టముపై సంబంధముకల్గించుకొనవచ్చును. తమచేనడుపబడు విద్యాలయములు అనాథశరణాలయములు, ఆస్పత్రులు, రహదారులు, వగైరాలకగు ఖర్చులలో అనేకజాతీయావసరములనుకూడ దీర్చునంతవరకు కొంతభాగమును జాతీయప్రభుత్వము చెల్లించుచుండును గనుక, ఆప్రభుత్వమునకా సంస్థలనెట్లు స్థానికసంఘములు నడపుచున్నవో పరీక్షించుట కధికారముండవయును. మరియు, విద్య, ఆరోగ్యము, రహదారులు, దేశాసరములబట్టి స్థానికసంఘములు ప్రజలకు ప్రసాదించవలెను గనుక, అట్టిసదుపాయముల కల్గించుటకుముందు, కల్గించిన పిమ్మట జాతీయప్రభుత్వముయొక్క ఆమోదమును, స్థానికసంఘములుపొందుటకు ప్రయత్నించుచుండవలెను. వర్తకవాణిజ్యములందు తాము సంబంధముకల్గించుకొనకముందు

స్థానికసంఘములు జాతీయప్రభుత్వపు సలహాలబొందనగును. ఇట్టివ్యాపారములందు జోక్యముకల్గించుకొనుచో, అవసరమగుధనమునకై పబ్లికు అప్పులను లేవదలచుకొన్న స్థానికసంఘములు జాతీయప్రభుత్వపు అనుమతిపొందనగును. ఈవిషయములందు, జాతీయప్రభుత్వపు అధికారమును తగ్గించుట సముచితముకాదు. ఐనను, వివిధస్థానికసంస్థలు వివిధప్రయత్నములజేయుచు వానివలనకల్గు మంచిచెడ్డల కన్గొనుచో, వానియనుభవము తదితరస్థానికసంస్థలకు ఉపయోగముకనుక అట్టిపరీక్షలు జరుగనిచ్చుటద్వారా జాతీయప్రభుత్వము ప్రజాసేవచేయుగలదు. మనదేశమందిప్పుడు రాష్ట్రీయప్రభుత్వము ప్రతిస్థానికసంఘముపైనను అత్యధికనిరంకుశతజూపుచు ఏలాటిస్వతంత్రప్రయత్నము చేయనీకుండుట దురదృష్టము. జాతీయావసరములరక్షింప ప్రభుత్వమునకు స్థానికసంఘములపై యాజమాన్యతయిచ్చుట భావ్యముకాని, ఆప్రభుత్వనిర్వాహకులు తమధర్మమును మరచి మంచిచెడ్డల నారయక, స్థానికసంస్థలు తమయిష్టానుసారము నడచుకొనవలెనని దుర్భ్రమచెందరాదు. ఇటుల ప్రభుత్వము నిరంకుశముగను సంకుచితాభిప్రాయముగను ఉండుటవలననే, గ్రామమునందు, స్థానికస్వపరిపాలనము నేతిబీరకాయవతుగానున్నది.

## పదునైదవ ప్రకరణము.

---

## న్యాయస్థానములు, న్యాయమూర్తులు.

పురాతన కాలమందు రాజే న్యాయమూర్తిగా యుండెడివాఁడు. ఏ రాజువద్దకు కష్టములందు తగుల్కొనినప్రజలు చేరుటకు హెచ్చయిన అవకాశములు కలవో, ఏ రాజు తనసముఖమందు పెట్టబడుపివాదముల త్వరగా నిష్పక్షపాతముగా పరిష్కరించుచుండెనో, ఏ రాజు తన ప్రజలందరి నొకేరీతిగా ధర్మశాస్త్రసూత్రానుసారము చేసినతప్పులను సమానముగా శిక్షించెడివాఁడో అతఁడు ధర్మరాజని ప్రసిద్ధి బొందుచుండెను. మనదేశమందు అనాది కాలమందు ప్రతికులమందును, కొందరుపెద్దలు పంచాయితీ తీర్చియుండి కులజనులు పరస్పరముగా కల్గించుకొనెడి వివాదముల తీర్చుచుండెడివారు. అటులనే గ్రామపంచాయితీదారులుకూడ, గ్రామస్థులందుకల్గెడి వివాదములందు శిక్షార్హుల శిక్షించుచుండెడివారు. వీరికిమించిన గొప్పవివాదములు వీరితీర్పులపైన అప్పీలుచేయబడిన వివాదములనుమాత్రము రాజు ఆతనిచే నియమితులగు న్యాయాధిపతులు పరిష్కారమొనర్చుచుండెడివారు. నిందితులు తప్పొనర్చిరో లేదో కన్గొనుటకు కఠినతరమగు ఈనాటిమనకు హృదయభేద్యమగునట్టి విపరీతపరీక్షలకు నిందితులను, నిందించువారిని ఆకాలపున్యాయమూర్తులు లోనుగాజేయుచుం

డిరి. వేడి వేడి సీసమునందు వ్రేళ్లనుంచుట, అగ్నిలోనికురుకుట, క్రాగుచున్నద్రవము మ్రింగుట, ఆదిగాగల అగ్నిపరీక్షలందు నెగ్గినవారు నిందార్హులుకారని నిర్ణయించుచుండిరి. అట్లైనను ప్రజలెల్లరొకేవిధమగు పరీక్షలకులోనై ఒకేవిధమగు శిక్షకుపాత్రులైయుండినచో, ఆనాటి న్యాయపరిపాలనము మానవులకు తగునట్లు ధర్మబద్ధమైయుండెనని చెప్పుటకు వీలగును. కాని ఛండాలురకు విధించుశిక్షకంటె శూద్రునకు తక్కువశిక్షయు, అంతకంటెతక్కువశిక్షలు వైశ్య, క్షత్రియులకును, అందరికంటె తక్కువశిక్ష బ్రాహ్మణులకును నిర్ణయించుటవలన అధర్మపాలనమునకు తావాకాలమున నొసంగబడుచుండెనని చెప్పకతప్పదు. ఈకాలమున మనదేశమందు రాజ్యమేలుచున్న తెల్లవారికి తక్కువశిక్ష వేయుట, వారిని వేరువిధముగా పరీక్షించుట తగదని వాదించి జయమందుచున్న జాతీయవాదులకీపురాతనపుపద్ధతి అధర్మబద్ధమని తోచకపోవునా ?

బ్రిటిషువారి ప్రజాస్వామిక రాజ్యాంగములుకల్గిన దేశములందన్నిటియందును అమెరికా, దక్షిణఅమెరికా దేశములందును సాధారణన్యాయశాస్త్రమే (Common Law) అందరికిని గౌరవనీయముగుచున్నది. గొప్పవారు, నీచులు, ధనికులు, బీదలు, ఉద్యోగులు, నిరుద్యోగులు, ప్రముఖులు, సాధారణప్రజలు అనుభేదముల గమనించక, అందరిని న్యాయ

మూర్తి సమానులగానే పరిగణించుట ఆచారమైయున్నది. ఒకేతప్పును ఈవివిధజాతులకు జెందిన ప్రజలొనర్చుచో, అధమము ఎల్లరికొకే శిక్ష విధించబడును; లేదా, చదువుకున్న వారిపై, ధనికులపై, పేరుప్రతిష్టలుకలవారిపై హెచ్చుదండనము విధించబడును; ఈభేదమునకైన కారణము లేకపోలేదు; అజ్ఞానులు, సామాన్యులట్టిదుష్కార్యములొనర్చుచో క్షమార్హములగును కాని, విద్యాధికులు, పెత్తనదారులొనర్చినచో కఠినముగా శిక్షార్హములగును. కనుక న్యాయమూర్తి దృష్టియందా దేశములందు ప్రజలెల్లరు వారియందున్న సాంఘికార్థిక మతరాచకీయ భేదములతో నిమిత్తము లేకుండా సమానస్థానమునే యాక్రమించుచున్నారు.

తమకు నిర్ణీతమగు అధికారధర్మముల నిర్వర్తించుటలో, హెచ్చుతగ్గులేవైన యొనర్చి తన్మూలమున పౌరులెవరికైనను, ఏమాత్రమైనను, ఏయుద్యోగియైనను ధనమాన ప్రాణనష్టము కలిగించినచో, ఆతడు సాధారణపౌరునివలెనే న్యాయస్థానములందు నిందితుడై, చేసినతప్పునకు శిక్షార్హుడగును. ఆతనిచర్యవలన నష్టమొందిన వ్యక్తికి తగినట్టి నష్టపరిహారమొసంగుటయు, అవసరమగుశిక్ష ననుభవించుటయు, ఆయుద్యోగునికి కల్గు పర్యవసానము. అట్టియుద్యోగులనేకులైయుండి, వారిచర్యవలన కలిగిననష్టము అపారమైయుండి, వారానష్టపరిహారమును చెల్లించలేని దుస్థితియందుండినచో,

వారిచర్యలు ప్రభుత్వాజ్ఞలననుసరించియె నడుపబడియున్న చో, ప్రభుత్వము ఆనష్టపరిహారమును, వారితరఫున చెల్లించ వచ్చును. అసాధారణపరిస్థితులందు శాంతిరక్షణార్థమై జన సమూహములపై తుపాకుల కాల్చుటకు మేజస్ట్రేటు అనుజ్ఞ నిచ్చినచో, ఆయాజ్ఞప్రకారము పోలీసువారు ప్రవర్తించిన చో, కల్లు ప్రజలయందు మరణములు, గాయములు, ఆస్థి పాస్తుల నాశనమునకు, ఎవ్వరు బాధ్యులు? మేజస్ట్రేటు గారి చ్చిన ఆజ్ఞ చట్టసమ్మతమై పోలీసువారిచర్య ఆయాజ్ఞనే పాలించునంతవరకేయున్న ఆయుద్యోగులు నిందార్హులు కారు కాని, న్యాయమూర్తుల యభిప్రాయప్రకారము మేజస్ట్రేటు యొక్క యాజ్ఞయే అన్యాయముగుచో, లేక, పోలీసులు ఆయాజ్ఞకుమించి ప్రవర్తించి దుర్మార్గములు చేయుచో, వారి చర్యలవలన కలిగిన పర్యవసానములకు వారు బాధ్యులు గానెంచబడి, శిక్షార్హులగుదురు. అట్టిశిక్షలు కఠినతమ ముగుచో, శాంతిరక్షణార్థమై ప్రభుత్వాభిప్రాయప్రకారము ఉద్యోగు లొనర్చిన పొరపాటులు విచారకరణీయమైనను, క్షమార్హములగుచో, క్షమార్పణశాసనము (Indemnity Act) ను, శాసనసభవారిచే నిర్మింపవచ్చును. అంతియేకాని, న్యా యస్థానములందట్టియుద్యోగులు శిక్షార్హులుగానే పరిగణింప బడెదరు. ఈన్యాయస్థానములందుఉద్యోగులు, సామాన్యులు, సమానస్థులను నాచారము, మనదేశమందములులో నున్న

దన్న పేరు కలదుకాని, వాస్తవముగా న్యాయమూర్తులవలన గాని, ప్రభుత్వమువలనగాని, ఇయ్యది గౌరవింపబడుట లేదు. ఈనడుమ ఉద్యోగులకును ప్రజలకును కలిగిన అనేక వివాదములందు తప్పులొనర్చినప్రభుత్వోద్యోగులను, రాచకీయావసరము లనుకారణములపై, అనేకమార్లు మన న్యాయమూర్తులు వదలివేసిరి. ఈ ఆచారమును న్యాయమూర్తులు గౌరవించుచో ఉద్యోగులనుండి పౌరులకేమాత్రము భయముకలుగుట కవకాశముండదు. ఈయాచారమును అమలుపరచకున్నచో యూరపుఖండమందు (ఇంగ్లాండు మినహా) ఆచరణమందున్న "అడ్మినిస్ట్రేటివ్ లా" అమలునకు రాకున్నచో ప్రభుత్వోద్యోగులు అధికారమదాంధతబొంది ప్రభుత్వావసరము లనుపేరున అనేక దుష్కృత్యములను చేయుచుందురు.

ఇంతమాత్రమున సంతృప్తిపొందిన లాభములేదు. అధికారులుచేసిన తప్పిదములను సాధారణకోర్టు విచారించకముందే "ఇండెమ్నిటీలా" అనగా "అధికారులరక్షించు శాసనము" అంగీకరింపబడుచో, అధికారుల దుర్న్యాయముల విచారించుటెట్లు? నష్టమొందినప్రజలకు నష్టపరిహారమొసంగినను, అధికారులుచేసిన దుర్న్యాయములకు వారినితగువిధమున దండించుటెట్లు? కనుక దురంతములు "మార్షలులాకోర్టుల" తదితర స్పెషలు కోర్టులద్వారా జరుపబడినమానసములోపల

సాధారణకోర్టులకెవ్వరైన అప్పీలు చేయుచో . హైకోర్టువారట్టికేసులవిచారించి దుండగీడులగు అధికారుల శిక్షించుచు ప్రభుత్వోద్యోగుల దుష్టచర్యలప్రకటించవసగును. అంత "అధికారులరక్షించుశాసనము" నిర్మించవలయునన్న శాసనసభవారు ప్రభుత్వోద్యోగుల దుర్నయములనెరిగియుందురుగాన సమ్మతించరు. ఒకవేళ మెజారిటీయందున్న పార్టీ ఆశాసనను నిర్మించప్రయత్నించినను న్యాయము వమ్ముకాకుండుటకై అట్టి శాసనసభయందలిమూడింట రెండువందలమంది సభ్యులు సమ్మతించవలెనను నియమముగత్యము.

యూరపుఖండమందు "అడ్మినిస్ట్రేటివ్‌లా" యను న్యాయశాస్త్రము అమలునందున్నది. దీనిప్రకారము ప్రభుత్వోద్యోగులెవరైనను ప్రభుత్వపుకార్యనిర్వహణ మొనర్చుచున్నప్పుడు ఎవరికైన ఏలాటినష్టము లేక, కష్టము కలిగించుచో, ఆయుద్యోగులు, బ్రిటిషువారి ప్రజాస్వామిక రాజ్యాంగములందువలె తదితరప్రజలవలెనే, సాధారణ న్యాయస్థానములందు ప్రజలెల్లరికనువర్తించుశాసనముల ప్రకారము విచారింపబడరు. వారిని "అడ్మినిస్ట్రేటివ్‌కోర్టు"లందే విచారించవలెను. వారిని, "అడ్మినిస్ట్రేటివ్‌లా" ప్రకారమె విచారించవలసియున్నది. ఈన్యాయశాస్త్రము ప్రకారము నిందితులైన ఉద్యోగులను ప్రభుత్వపు ప్రాసిక్యూటరుగాని లేక ప్లీడరు సమర్థింతురు ఆయుద్యోగులునిందార్హులని తేలుచో ఆనష్టపరిహార

మును, ప్రభుత్వమే కట్టియిచ్చును. అంతకుమించి నిందార్హులైన యుద్యోగులు జైలునకుకూడ పంపనగుచో, వారికట్టి శిక్షవిధించుటా, లేదాయని విచారించి తుదితీర్మానమునకు వచ్చుటకు ప్రభుత్వమునకే అధికారముకలదు. ఐతే, ఈ "అడ్మినిస్ట్రేటివ్ కోర్టుల" న్యాయమూర్తులు ప్రభుత్వముచే నియమింపబడి వారి అనుదినయాజమాన్యమునకు లోబడి యుండెదరు కనుక, సాధారణముగా ఈన్యాయమూర్తులు ప్రభుత్వమునకు, ప్రభుత్వోద్యోగులకు విరుద్ధమగు తీర్పుల నిచ్చుటలేదు. ఇందువలన, ప్రభుత్వోద్యోగులు అధికార రీత్యా చేయుదుండగములకు తగుశిక్ష ప్రాప్తించకుండుట సర్వసామాన్యమగుచున్నది.

ఆదేశములందు సామాన్యపు ధర్మశాస్త్రముప్రకారము ప్రజాసామాన్యమే శిక్షార్హమగును ప్రభుత్వోద్యోగుల కయ్యది అనువర్తించదు. ప్రభుత్వోద్యోగులచర్యలలో ఎయ్యది సాధారణన్యాయమూర్తుల యధికారముక్రిందకువచ్చును, ఎయ్యది "అడ్మినిస్ట్రేటివ్ న్యాయమూర్తుల సమక్షమునకురావచ్చును," అను సందేహమును తీర్చుటకు, ప్రభుత్వప్రతినిధులకే మెజారిటీగల "దేశీయరాజ్యాంగపుకోర్టు"నకధికారముకలదు. కనుక, ప్రతివిషయమునందును, ఉద్యోగులకు సంబంధించినంతవరకు వివాదమును, "అడ్మినిస్ట్రేటివ్ కోర్టుల"కే పంపించబడుచుండును. ఈవిధానమువలన ప్రభు

త్యోద్యోగులకు రాజ్యాంగమందు ప్రత్యే ఆధిక్యతకల్గుచు న్నది. ఈపరిణామము ప్రజాసామాన్యపుహక్కులను సంకు చితపరచుచున్నది.

ప్రపంచమందలి ప్రజాస్వామికమైయున్న రాజ్యాంగ ములన్నిటియందును, ఏవ్యక్తియు, కారణము లేకనే నిర్బం ధింపబడరాదనియు, నిర్బంధింపబడిన ప్రతివ్యక్తిని, ఏపౌరుని దరఖాస్తుపైనైనను, ఇరువదినాల్గుగంటల కాలములోపల మేజస్ట్రీటువద్దకు తెచ్చి, ఆతనిపై ఆరోపింపబడు నేరమెద్ది యో, నేరమారోపించుటకు, ప్రాసిక్యూషనుకు ఎట్టిసాక్ష్య ముకలదో చూపెట్టవలయునను సూత్రములంగీకరింపబడినవి. ఒకప్పుడు రాజు తలచుకొన్న ఎవ్వరినైననుపట్టినిర్బంధించుట కధికారముండెను. ఏకారణమును ఆతను చూపెట్టనక్కర లేదు. ఎప్పుడు తాను ఆవ్యక్తిని విచారణకు తెచ్చునో, ఆ రాజు ప్రకటించనగత్యములేదు. ఈయధికారము రాజున కుండుటచే, ఎప్పుడు తమపై రాజునకు ఆగ్రహముకల్గునో, ఎప్పుడు తమ్ము నిర్బంధించునో, ఎంతకాలమూ నిర్బంధబాధ కల్గునో తెలియకుండుటచే, ప్రజలెల్లరు రాజుదృష్టిని, మంచి కిగాని, చెడ్డకుగాని, ఆకర్షించకుండమండవలెనని ఆతురత పడుచుండిరి. కాని రాజుయొక్క యుద్యోగులు దేశమునం దెల్లెడలనుండిరి గనుకను, ఆయుద్యోగుల కాగ్రహముకల్గిన

రాజుయొక్క యధికారముల వారే యుపయోగించకలరు గాన, ప్రజలెల్లరు, నక్కుచు, వంగివంగి సలాములిడుచు, మొత్తముమీద స్వతంత్రులుగాక, తలయెత్తి తిరుగలేక బాధపడుచుండెడివారు. యుద్ధమునకుపూర్వము రషియాలో నిట్టిబాధలు కల్గుచుండెను; పందొమ్మిదవశతాబ్దారంభమున కల్గిన విప్లవమునకు పూర్వము ఫ్రాన్సునందును, వేలకొలది న్యాయవర్తనులగు పౌరులు, నిష్కారణముగా "బాస్టిలు" అను జైలునందు విచారణలేకనే మ్రగ్గుచుండిరి. ఇప్పటికిని మనదేశపు స్వదేశసంస్థానములందు ఇట్టి దుర్భరదుస్థితులు ప్రచారమందున్నవి. బ్రిటిషు యిండియాయందుకూడ ఇట్టివిధముననే అనేకులను ప్రభుత్వము నిర్బంధమునందుంచుచున్నది. కావున నిట్టి చర్యలు సాధ్యపడకుండుటకై "ఏవ్యక్తియు కారణము లేకనే నిర్బంధింపబడరాదు" అను ధర్మసూత్రమును అమలుపరచవలసియున్నది. కాని, నామమాత్రపు కారణములపై ప్రభుత్వమెప్పుడైన, ఏవ్యక్తినైన నిర్బంధించుచో, ఆకారణములు అవ్యక్తిని నిర్బంధించుటకు తగినవా, కావాయని విచారించుటకై, ఆవ్యక్తి నిర్బంధింపబడిన యిరువదినాల్గుగంటల లోపుగా మాజిస్ట్రేటు వద్దకు అతడు తేబడవలెనను రెండవధర్మసూత్రము ఆచరణీయము కావలెను. మాజిస్ట్రేటుసమ్ముఖమునకు తేబడిన ప్రతివ్యక్తియు, తన తప్పేమియో తన

మీద ఆరోపించబడిన నేరమెట్టిదో తెలిసికొనుటకును, తానట్టి తప్పులొనర్చలేదని నిరూపించుకొనుటకును తగు నవకాశములబొంది అవసరమగు సాక్షులరప్పించి న్యాయవాదుల రక్షణబొందుటకును అర్హుడైయుండవలెను. పోలీసువారు ఆవ్యక్తిని నిర్బంధించుటకు జూపెట్టిన సాక్ష్యము బలహీనమగుచో, మేజస్ట్రీటుగారట్టి నిందారోపణను నిరాకరించి ఆవ్యక్తిని వదలివేయుమని పోలీసువారికి అనుజ్ఞనీయవచ్చును.

అటులగాక ఆమేజస్ట్రీటునకు పోలీసువారు జూపెట్టిన కారణములు సహేతుకములుగానుండి, నిర్బధింపబడిన వ్యక్తి వెంటనే స్వతంత్రుడైన సంఘవిద్రోహ మొనర్చునని తోచుచో, అతడు ఆవ్యక్తిని నిర్బంధమునందేయుంచి, పోలీసువారు తమ సాక్ష్యకలాపమును సంపాదించుకొనుటకు వాయిదా వేయవచ్చును. ఈమధ్యగల వ్యవధియందు ఆరోపింపబడిన నేరముబట్టి జామీనుమీద ఆవ్యక్తిని వదలుటకువీలుండుచో వానినటుల వదలివేయవచ్చును. నిందితుడైన వ్యక్తి బీదవాడైయుండి న్యాయవాదులకు ఫీజు చెల్లించజాలనిచో, అతనికి ప్రభుత్వపుఖర్చుపై అతడుకోరుకొనిన న్యాయవాదులసాయమును కల్గించవలసియున్నది. ఈసదుపాయముల కల్గించుటకు మనదేశపుప్రభుత్వము మీరటుకేసుఖైదీలవిషయములో సందేహించుట విచారకరము.

చార్జిషీటు పెట్టుటకే కొన్నిదినముల వాయిదా కావలె ననియు, అప్పటివరకు నిందితుని నిర్బంధమున నుంచుటకధి కారమీయవలెననియు, పోలీసువారు కోరినప్పుడు, మేజ స్ట్రీటు, పోలీసువారిఆలోచనల పరిశీలించి, న్యాయముగా, నిర్బంధితుడగువ్యక్తిపై నేరము మోపకల్గియూ, లేక, అతని పృథాగా ప్రించుటకా పోలీసువార్లు కోరుటయని వితర్కించవలెను ఆతడారోపింపబడిన తప్పుచేయగల్గువాడే యని తనకుతోచినచో, ఆతనిని "రిమాండునందు" పదునైదుదిన ములవరకుంచుటకు మేజస్ట్రేటు తీర్మానించవచ్చును. కాని, వందలకొలది కేసులలో, మనదేశమందు అనేకుల రిమాండు నందుంచి అనేక బాధలకు లోనుగాజేసి పిమ్మట వారిపై చార్జి షీటు పెట్టకుండనె పోలీసువారు వదలివేయ వారిపై ఏమేజ స్ట్రీటును చర్యతీసుకొనకుండుట చాల యసంతృప్తికరముగా నున్నది.

న్యాయమూర్తులు తాము ప్రభుత్వముయొక్క యవ సరముల మరువకనే న్యాయశాస్త్రసూత్రముల ప్రకారము పౌరులయొక్క స్వత్వముల కాపాడుటకై యుంటిమను ప్రధా నసూత్రము నెల్లప్పుడు మనస్సునందుంచుకొనవలయును. పౌరసత్వపుహక్కులు అన్నిదేశములందును ప్రజలకు రా జ్యాంగవిధానముల ప్రకారము ప్రసాదించబడుచున్నను వానిని అమలుపరచు ప్రభుత్వము తగ్గించుటకుగాని, వాని మొనర్చు

టకుగాని, ప్రయత్నించుచో, ప్రజలతరపున అట్టివి విరోధింపవలసిధర్మము న్యాయమూర్తులపైనున్నది. ఇంగ్లాండునందనేకమారులు ప్రభుత్వము వ్యక్తులస్వాతంత్ర్యమపహరింప బ్రయత్నించగా న్యాయమూర్తులు ప్రభుత్వపు ప్రయత్నముల విఫలపరచి, ప్రజలహక్కుల రక్షించి పేరుపొందిరి. ఈవిధముగా మనదేశమందును, ప్రభుత్వమునకు కంటకమైనను ప్రజాస్వాతంత్ర్యముల పునరుద్ధరించ న్యాయమూర్తులు కొంతమంది ప్రయత్నించిరి.

ఇట్లు న్యాయమూర్తులవలన ప్రజాస్వాతంత్ర్యములురక్షణబొందుట, యూరపుఖండమందలి దేశములలో (ఇంగ్లాండు, ఐర్లాండుతప్ప) సాధ్యమగుటలేదు. "అడ్మినిస్ట్రేటివు కోర్టులచ్చట అమలునందుండుటే యిందుకు కారణము. రాచకీయ ద్రోహనేరారోపితుల విచారించుట కేర్పరుపబడు న్యాయమూర్తులు ఎట్టివారైయుండవలెనో నిర్ణయించు అధికారము సాధారణ న్యాయమూర్తులకుండవలెను. మనదేశమందువలె ప్రభుత్వాంగమగు రినీన్యూడిపార్టుమెంటువారె, క్రిమినలులాను, అమలుపరచుటకై మేజస్ట్రేటుల నియమించరాదు. మనదేశమందలి మేజస్ట్రేటులను మనహైకోర్టుపెత్తనముక్రింద నేయుంచవలెను. ఇప్పుడు బెంగాలులో జరుపబడుచున్నట్లు వి. లిటరీఆఫీసరులను మేజస్ట్రేటులుగా నియమించుట తగదు.

అట్టి యేర్పాటు హైకోర్టు వారి యధికారమునకు భంగకరము కల్గించును.

రాచకీయ కేసులందుగాని, క్రిమినలు కేసులందుగాని, నిందితులను, న్యాయమూర్తులు తమంతతామే విచారించి శిక్షార్హులైన శిక్షించుటతగదు. "క్రిమినలులా" కాలానుగుణ్యముగా ప్రజాభిప్రాయము, ప్రజాచారముల ననుసరించి వ్యాఖ్యానము చెప్పబడవలెను కనుక, శాసనములనే చదువుచు, గ్రంథస్థములగు విషయములనే ఆలోచించుచుండు న్యాయమూర్తులకు అట్టి వ్యాఖ్యానముల జేయుటకు సాధ్యము కాదు గనుక, ప్రజాభిప్రాయము తెలుపుటకు ఏ కేసైనను, ప్రజలకెట్లు కన్పడునో తెల్పుటకు "జూరీ" యను, పంచాయితీదారుల సహాయము పొందవలెను. పౌరులైనవారిలో ఏ పదిమందినైనను పిలిపించి వారిని "పంచాయితీదారులు"గా నేర్పరచి వారి సహాయముతో కేసుల విచారణచేయనగును. ఈ పంచాయితీదారులకు తగుబత్యము నిచ్చుట అగత్యము. కానిచో బీదలు పంచాయితీదారులుగా రాజాలరు. అట్లు, ఏర్పరచబడిన పంచాయితీదారులలో నేరినైనను నిరసించి మరొకరి నేర్పరచుమని కోరుటకు, నిందితునకు హక్కుయుండవలెను. లేనిచో, ప్రాసిక్యూషను వారు ఆతనికి బలవద్విరోధులగు వారి నట్టి పంచాయితీ సభ్యులుగా నేర్పరచవచ్చును.

సివిలు క్రిమినలు వ్యవహారములందు ప్రజలయందే పరస్పరముగా కల్గు వివాదములలో ధనికులు, బీదవారలు, న్యాయమూర్తుల సమక్షమందు సమానముగా జూడబడినంత మాత్రమున ప్రజలకు న్యాయముకలుగజాలదు. ధనికులు సమర్థులగు న్యాయవాదులబెట్టియు అవసరమున్న సాక్షుల రప్పించియు, కేసులకాలపరిమితి హెచ్చించియు, తుదకు తీర్పు తమపరముగనే యుండునట్లు చేయగలరు. బీదవారగు నిందితులుగాని, అప్పుపడ్డవారుగాని, యుక్తియవకాశముల బొందజాలక, న్యాయమూర్తులకు తమనిర్దోషిత్వమునుకాని, ధనికుల నిందార్హతకాని, నిరూపించజాలక, అనేకయిడుమ లబడుచున్నారు. శిక్షింపబడవలసిన ధనికులు తప్పించుకొనుటయు, రక్షింపబడవలసినబీదలు శిక్షింపబడుటయు, ఎల్ల దేశములందును తఱచుగా యనుభవసిద్ధమగుచున్నది. మనదేశమందే జమీందారులపై వ్యాజ్యముల వేసిన రైతులుగాని, జమీందారులచే వ్యాజ్యములందు జేర్చబడిన రైతులుగాని, సర్వనాశనమగుచుండుటయు, శిక్షలబొందుటయు తమపరముననే న్యాయమున్నను వ్యాజ్యములఖర్చుల బాధలకోర్వజాలక, తమహక్కుల నెన్నిటినో విడి, జమీందారులతో రాజీలనేర్పరచుకొనుటయు రైతులకగత్యమగుచుండుట జూచుచున్నాము. ఇటువంటి దౌష్ట్యములు జరుగకుండుటకై, కేసులనడవుట, చౌకగాజేయుటయు, బీదవారికి సమర్థులగు

న్యాయవాదులు తక్కువఫీజునకే సహాయము చేయపూను కొనుటయు, వ్యాజ్యపుఖర్చుల భరించ లేనివారలకు సహాయము చేయుటకై కార్మిక కర్షకసంఘములు ఒకనిధి నేర్పరచుటయు అత్యవసరమై యున్నది.

ఇంతకంటెను అత్యుత్తమముగునట్టియు, అవసరమైనట్టియు సంస్కరణ పబ్లికు డిఫెన్సుఆఫీసు నేర్పరచి, డిఫెన్సుఆఫీసరుల నియమించుట. పబ్లికు ప్రాసిక్యూటింగు ఆఫీసరులెట్టులనిందితులపై నేరారోపణచేయుట తమ ధర్మమనుకొనుచున్నారో అటులనే యీడిఫెన్సుఆఫీసరులు నిందితులరక్షించుట తమధర్మమనుకొనవలెను. ఆఫీసరులు తమ సహాయము కోరువారిలో ఫీజు చెల్లించగల్గిన వారివద్దనుండి ఫీజు వసూలు చేయవగును. మిగిలినవారినుండి ఏమాత్రము ఫీజుపొందకయే వారికి తగు రక్షణకల్గించవలెను.

ఈ ఆఫీసునకుతోడు "న్యాయసూత్రముల సలహా ఆఫీసు" ఒకటి అవసరము ఇందు బీదలు తమకగత్యమగు వ్యాజ్యములు తమపైకివచ్చు వ్యాజ్యములు, నిందలను గూర్చి సలహాబొందవచ్చును. సాధ్యమైనంతవరకీ ఆఫీసులోని యుద్యోగులు కేసులరాజీకరచ ప్రయత్నించవలెను. వాజ్యములుసాగుట తప్పనిసరియగుచో బీదవారితరఫున కేసు తయారుచేసి సహాయము చేయవలెను. ధనికులనుండిమాత్రము ఫీజును ఈఆఫీసువారు వసూలుచేయవలెను. ఈఆఫీసువారు

"సివిలుసూటుల రాజీకల్గించుకోర్టుల" ద్వారా బీదలకు అప్పులబాధ తగ్గించవచ్చును.

మరియు, క్రిమినలు కేసులందుగాని, సివిలువ్యాజ్యములందుగాని, బీదవారికి, భాగ్యవంతులకు వివాదములు కల్గుచో న్యాయమూర్తులు అన్నిదేశములందును, ఈదినములలో ధనికులు నిందార్హులు కాజాలరనియు, బీదలే నింధార్హులగుట తథ్యమనియు, నమ్ముచుండుటయు, అందువలన అనేకమారులు ధనికులు అన్యాయముగా శిక్షల తప్పించుకొనుటయు, బీదలు అధర్మముగా శిక్షితులగుచుండుటయు అనుభవసిద్ధము. పేరునకు న్యాయస్థానములందు ధనికులు, బీదలు సమానులైనను వాస్తవముగా ధనికులు, జమీందారులు, కర్మాగారాధిపతులకుటుంబములనుండి వచ్చు న్యాయమూర్తులు వారిపరముగనే తీర్పులజెప్పుచుండుట సహజమే కదా! ఈ అన్యాయమును తగ్గించుటకుగాను న్యాయమూర్తులుగా నియమింపబడిన వారెల్లరకును ఒకవత్సరముపర్యంతము బీదసాదల జీవితరహస్యముల విచారించి వారెందులకెట్టి నేరముల జేయుచుందురో తెలుసుకొనుటకు తగుతరిబీతు యిచ్చుటమంచిది. ఈన్యాయమూర్తులందు కొందరు బీదసాదలకుటుంబములనుండి వచ్చినవారై యుండుటలాభకరము. "పంచాయితీల" నేర్పరచుటలోకూడ అధమము సగముమందినైన బీదకుటుంబీకులుగా నున్నవారిగాజూచి నియమించుట భావ్యము.

తాము వేయు శిక్షలవలన ఖైదీల మనోప్రపంచమందెట్టి పరిమార్పులు కలుగకున్నవో తెలుసుకొని, ఆశిక్షితులు జైలు జీవితము వలన మంచిదారులకు వచ్చుటకు తగు నవకాశములున్నవో, లేవో విచారించి, కైదీలు జైలునుండివచ్చునరికి సద్బుద్ధిగలవారైయుండుటకు యెట్టియుపాయములు కలుగవలెనో తెలుసుకొనుట న్యాయమూర్తుల ధర్మము. ఇందులకై వారు కొంతకాలము జైళ్ళనుజూచి అందున్న ప్రజలకెట్టి విద్యాబుద్ధులలవడుచున్నవో గ్రహించి, తమయనుభవము బట్టి ఎంతశిక్ష ఎవ్వరికి వేయుచో ఎంతలాభనష్టములు సంఘమునకు కల్గునో తీర్మానించగల్గినశక్తిప్రతిన్యాయమూర్తి పొందవలెను.

యువకులను, యువతీమణులను, బాలబాలికలను, మొదటిసారి తప్పిదమొనర్చినవారిని, విద్యాబుద్ధులగలచిన వారిని, గ్రహపశాత్తు, శిక్షార్హులైనవారిని ప్రత్యేకజైళ్లకు పంపుచు, వారెంతకాలము ఖైదీలైయుండవలెనో నిర్ణయించుట న్యాయమూర్తులకుపాడి. సాధ్యమైనంతవరకు, శిక్షార్హులైనవారు, తిరిగి సంఘమునందు జేరి, ఉపయోగముగు జీవితముగడపుటకై తగినవారుగాజేయు బాధ్యత తనపైకూడ కొంతవరకుగలదుగాన, న్యాయమూర్తి, అట్టిశిక్షార్హులకు, గార్డియనులుగానుండ దలచుసాంఘికసేవకుల పరమందు వారినుంచుట కంగీకరించవలెను.

దేశశాంతి అకస్మాత్తుగా ప్రజలయందు ప్రబలుచున్న అలజడివలన భంగమగుచో, రాజ్యాంగరక్షణకై, "మార్షలు లా"ను ప్రకటించి, సాధారణశాసనముల నావలబెట్టి సాధారణకోర్టుల పెత్తనము నాపుటకు ప్రభుత్వము చేయువచ్చును. అలాంటి సమయములందు ప్రజలయందు ప్రజ్వరిల్లు అరాచకమును తగ్గింపవలెనన్న "మార్షలులాకోర్టుల" నేర్పరచి వెంటవెంటనే, శిక్షలు వేయుట యగత్యము కావచ్చును. కాని, ఇట్టి కోర్టుల ద్వారా, అన్ని దేశములందును, అన్యాయముల నెన్నిటినో, ప్రభుత్వము కల్గించుచున్నది. ఇట్టికోర్టులకు రెండు వత్సరములకంటె శిక్ష వేయుట కధికారముండరాదనియు, ఈ కోర్టులోని న్యాయమూర్తులు బార్ కౌన్సిలునందలి న్యాయవాదులై యుండవలెననియు, మిగతా నిందితులను సాధారణ న్యాయస్థానములందు విచారించవలెననియు నిర్ణయించుటగత్యము. "మార్షలులా"దుర్నయముల నాపవలెను. "మార్షలులాకోర్టుల" అధికారములతగ్గించవలెను.

రైల్వేలను తదితర వాణిజ్యములను, ప్రభుత్వము స్వయముగనే నడుపుచుండుకొలది, లేక, వివిధ వాణిజ్యములు, శాసనబద్ధముగా నడుపబడుచుండుటకై జాగ్రత్తతీసుకొనుకొలది, ఆవ్యవహార జ్ఞానముకల్గిన, న్యాయమూర్తులను కొందరిని ప్రత్యేకించి, ఒకన్యాయస్థానముగా నేర్పరచుట శుభప్రదము. ఇట్టికోర్టులు ఆస్ట్రేలియాయందేర్పరచబడినవి. మనదేశపు "రైల్వేరేట్సు" కమిటీ యిలాంటిదే!

అటులనే, జమీందారుల రైతులమధ్యకల్గు వివాదములబరిష్కరించుటకు, సాధారణన్యాయమూర్తులు తగినంత విషయజ్ఞానము కల్గియుండరుగనుక, ప్రత్యేకన్యాయస్థానముల నేర్పరచి, అందు రైతుల జమీందారుల ప్రతినిధులను ఒకరిద్దరు సాధారణన్యాయమూర్తులను సభ్యులగానియమించుట న్యాయము. ఇట్టికోర్టులు ఐర్లాండునందును, ఆస్ట్రేలియాయందు నేర్పరచబడినవి. మనదేశమందును వీనిని స్థాపించుట శుభప్రదము. రైతులు వారిసాహుకారులమధ్య, అప్పుసప్పులగూర్చికల్గు వివాదములను తీర్చుటకై, ఈలాంటిమధ్యవర్తి తరపుకోర్టుల కధికారముండవలయును. ఈకోర్టులను "సివిలు సూటులయందు రాజీకల్గించు" నవనిపిల్తురు. వీనిని సెంట్రలు ప్రావిన్సులలో నేర్పరచుచున్నారు. ఈకోర్టులు, అన్నిరాష్ట్రములందేర్పరచుటగత్యము.

కార్మికులు యజమానులమధ్యకల్గు వివాదముల బరిష్కరించుటకుకూడ వారివీరి ప్రతినిధులును, న్యాయమూర్తులు కొందరును కలసి యేర్పడిన ప్రత్యేకకోర్టులగత్యము. ఇటలీ, ఆస్ట్రేలియా, న్యూజిలాండు దేశములందివి స్థాపించబడినవి. ఇంగ్లాండునందప్పుడప్పుడు యేర్పరచబడుచున్నవి.

ఇంగ్లాండు, జర్మనీ ఆదిగాగల దేశములందు ఆరోగ్యరక్షణభీమా నిరుద్యోగనివారణ భీమా చూలాలు రక్షణభీమా యేర్పాటులున్నవి. కార్మికుల అవయవనష్టపరిహారపు

శాసనముల నములుపెట్టవలసియున్నది. ఈ పెత్తనమునిర్వ హించుటలో ప్రభుత్వోద్యోగులు ప్రజాప్రతినిధుల సహాయ ముతో న్యాయస్థానముల నేర్పరచి న్యాయమూర్తులుగా వ్య వహరించవలసియున్నది.

ఇట్టి ప్రత్యేక న్యాయస్థానములం దెట్టినియమముల ననుసరించి ఏవిధముగ విచారణ జరిపించి న్యాయపరిపాలన చేయనగునో నిర్ణయించవలసిన భారము సాధారణ న్యాయ మూర్తులపై కలదు. "మార్షలు లా కోర్టులు" సాధారణ మేజిస్ట్రేటుల కోర్టులు తదితర కోర్టులయందు శిక్షితులైనవారి కేసులను తిరిగి విచారణ చేయుటకు సాధారణ కోర్టు కధికా రముండవలెను. రాజ్యమందలి ఏవిధమగు కోర్టుగాని హైకో ర్టువారి యాజమాన్యమునకు మించి యుండరాదు. కనుక నే మనదేశమందును ఆర్డినెన్సులబట్టి స్పెషలు కోర్టులు విధించిన శిక్షలను తిరిగి విచారించు నధికారము తమకున్నదని బొంబె హైకోర్టువారు తీర్మానించి సాధాణకోర్టుల హక్కుల నిల బెట్టిరి.

న్యాయమూర్తు లెట్లు ప్రభుత్వమునుండి స్వతంత్రిత బొంది మంత్రివర్గమువారిపై నేమాత్రము తనుయధికారము నకై, పదవికై ఆధారపడియుండక ఎవరినిజూచియు భయమం దక భగవంతుని తలంచి ధర్మబద్ధముగా నడువవలెనో అందు లకెట్టి సదుపాయములు వారికి కలుగ జేయవలెనో పైప్రకరణ

మందు తెల్పితిమి. అటులనే న్యాయమూర్తులు తమకు న్యాయమని యుక్తమని తోచిన తీర్పుల జెప్పి న్యాయసూత్రముల సిద్ధాంతీకరించుటకు సర్వస్వాతంత్ర్య ముండవలెను. అప్పుడప్పుడు వారిచ్చు తీర్పులు, చెప్పుమాటలు, ప్రజలకు ప్రభుత్వమునకు తలకంటకముగా నుండవచ్చును. కాని ప్రభుత్వోద్యోగులు కాని మంత్రులు కాని ఆ న్యాయమూర్తుల తీర్పులను అవిచారముగా త్వరపడి విమర్శింపరాదు. న్యాయమూర్తుల తీర్పులు ధర్మవిరుద్ధమగుచో శాసనప్రవాంఛకువిపరీతమగుచో శాసనమునే మార్చవలెను. కాని న్యాయమూర్తుల మాలిన్యము మంత్రులు దూషించరాదు. దూషించుచో న్యాయమూర్తులు భయమంది న్యాయపథమునే యవలంభించి తమ ధర్మముల నిర్వర్తింపజాలరు. ఒక్కమారు తన యుద్యోగము బొందినపిమ్మట, శాసనసభ వారి తీర్మానముపై తప్ప ఏ న్యాయమూర్తిని పదభ్రష్టుని చేయుటకు ప్రభుత్వమునకు అధికారముండరాదు. అప్పుడును శాసనసభ వారు మూండింట రెండువంతుల సహాకారముతోడనే అట్టి తీర్మానము చేయనగును. కాని న్యాయశాఖయందలి ప్రధాన న్యాయమూర్తులకు తమక్రింది యుద్యోగులను అవసరమగుచో, తగురీతి శిక్షించుటకు అధికారముండనగును. కాని వారును, నిందితుడగు న్యాయమూర్తిపై నేరారోపణము ప్రభుత్వముచే చేయించి, నేరమును రుజువుచేసిననే అతడు

శిక్షార్హుడగును. శిక్షార్హుడు కానిచో తిరిగి ఆయన తన యుద్యోగమునందు జేరును. అటగా ఏన్యాయమూర్తినైన ను నిందితుచేసి కోర్టునకు తేవలెనన్న న్యాయశాఖవారందు లకు అంగీకరించవలెను. న్యాయశాఖవారట్లు అంగీకరించు లోపలనే, తగువిచారణను వారు తమశాఖాసూత్రముల ననుసరించి జరిపించి తమకు అతనియెడ నిరూపింపదగిన తప్పున్నదని దృఢమైనప్పుడె నిందితునిగా కోర్టునకు వానిని పంపుట కంగీకరింపగలరు.

ప్రధానన్యాయమూర్తులను అన్ని దేశములందును ప్రభుత్వమే నియమించుచున్నది. రాష్ట్రీయన్యాయమూర్తులు మాత్రము అమెరికాయందు ప్రజలచే నెన్నుకొనబడు చున్నారు కాని ఆపద్ధతి సంతృప్తికరముగాను. న్యాయశాఖ యందలి వివిధోద్యోగులను, ముఖ్యముగా వివిధతరగతుల న్యాయమూర్తుల నియమించునధికారము మొత్తము మీద ప్రధానన్యాయమూర్తులకె యుండుట మంచిదని అనేకులు తలంచుచున్నారు. అటులనె వివిధదేశములందును ఆచారముగా యున్నది. కాని దేశీయులందలి వివిధతరగతు లకు జెందినవారు తగురీతి ఈశాఖయం దుద్యోగులుగా నియమింపబడుట మంచిదికనుకను, ఏయేయుద్యోగమున కెట్టి సమర్థత యవసరమో నిర్ణయించుట శ్రేయముగాన ఈ శాఖోద్యోగుల నియమించుటకు తగుసూత్రముల నిర్ణయించి

ఆసూత్రముల ననుసరించియే, ఉద్యోగుల నియమించుటకై న్యాయమూర్తుల కమీషనొకటి స్థాపింపబడుట ధర్మము. సబుజడ్జీలు వగైరాలను హైకోర్టుజడ్జీలను నాల్గింటమూడు వంతులువరకైనను న్యాయశాఖయందలి క్రింది యుద్యోగుల నుండియే నియమించుట న్యాయము. న్యాయమూర్తులు సూచించిన ముగ్గురు లేక నలుగురు అభ్యర్థులలోనొక్కరిని ప్రభుత్వము నియమించవచ్చును

న్యాయశాఖనునడపుటద్వారా ప్రభుత్వము లాభము బొందగోరుటతగదు. సాధ్యమైనంతవరకు బీదసాదలకు న్యాయమూర్తుల రక్షణబొందుటకు గలయవకాశముల హెచ్చించుటయే న్యాయశాఖయొక్క ధర్మము కనుక న్యాయముబొందుటకై వచ్చువారు చెల్లింపదగు "ఫీజును" తగ్గించవలయును. కడుంగడు బీదవారివిషయమున ఫీజు లేకుండజేయవలెను. అప్పటికిని కొంతనిల్వధనముండుచో దానినొక నిధియందిడి ఆనిధినుండి కడుంగడు బీదలైనవారికి (సివిలు, క్రిమినలు వ్యాజ్యమునకు సంబంధించిన) ఒకపంచాయితీవారి సలహాలపై అవసరమగుచో లాటరీపద్ధతిప్రకారమైనను సహాయము చేయుట యుక్తము.

మనదేశమందిప్పుడు అమలునందున్నట్లు ఏయుద్యోగులైతే ప్రభుత్వకార్యనిర్వాహణభారము వహించవలసియున్నదో వారె న్యాయమూర్తులుగా నాళీనులై రాచకీయ

తదితర క్రిమినలు నిందితుల శిక్షించుట న్యాయసూత్రములకు విరుద్ధము. ఏ మేజిస్ట్రేటు ఒక వ్యక్తిపై నిందారోపణ చేయుచున్నాడో ఆతనే నిందితుని విచారించి శిక్షార్హుడని తీర్మానించుచుండు ఆచారము గర్హ్యనీయము. మన దేశమందు ప్రభుత్వమునకు ప్రజలకు సంఘర్షణ యిప్పుడే కాక ఇంకముందును కులతగాదాలబట్టి మతద్వేషముల ననుసరించి కలుగనున్నవి. అట్టిసమయములందు ప్రభుత్వమునకు లోబడియున్న మేజస్ట్రీటులు ప్రభుత్వముచే నిందితులైన వారిని స్వతంత్రులుగా నిర్ణయించుట దుస్సాధ్యమగును.

శాసనములకు భాష్యము చేసి వానిననుసరించి తమ సమక్షమునకు తేబడు కేసులను పరిష్కారము చేయవలసిన బాధ్యత న్యాయమూర్తులపైకలదు. కాని, కాలపరిస్థితులందు కల్గు మార్పుల ననుసరించి త్వరితగతి శాసనముల సముదాయమును మార్చుచుండుటకు శాసనసభవారికి సాధారణముగా శక్తియుండదు. అందును రాజ్యాంగవిధానపుచట్టమునకు మించి శాసనముల జేయుటకధికారము లేని, అమెరికా, ఆస్ట్రేలియా, ఆదిగాగల దేశములందు ప్రజావసరముల బట్టి మార్పుజెందుచుండు పరిస్థితులననుసరించి అగత్యమగు శాసనముల నిర్మించుటకు శాసనసభలకు సాధ్యమగుటలేదు. ఇట్టిపరిస్థితులందు రాజ్యాంగవిధానపు చట్టము ననుసరించి దేశకాలపాత్రతలబట్టి ధర్మసూత్రముల నిర్వచించుటకు న్యాయ

మూర్తులకు అవకాశముకల్గుచున్నది. అన్ని దేశములందును, దేశకాలపాత్రతలకును, శాసనసముదాయమునకును సంయోగముగల్గించుటకై న్యాయమూర్తులిట్లు ధర్మసూత్రముల నిర్ణయించుట యగత్యమగుచున్నది. కాని, సమ్మేళన రాజ్యాంగములకల్గిన ఆస్ట్రేలియా, అమెరికా దేశములందు, రాజ్యాంగ విధానపుచట్టమునకు విరుద్ధమగు శాసనసభవారి శాసనముల నిరాకరించి ఆచట్టమునకు సంబంధించిన శాసనములనే అమలుపరచుటకుకూడ న్యాయమూర్తులకు స్వత్వముకలదు.

ఇట్టి అసాధారణపుహక్కు నుపయోగించు సమయములందు న్యాయమూర్తులకు "అనుబంధశాసనములా" యనబడు "న్యాయస్థానముల శాసనములు" (Judge made Law) నిర్మించు నవకాశము కల్గుచున్నది. ఇంగ్లాండునందిప్పుడు ప్రజలచే యనుభవించబడుచుండు రాజ్యాంగ హక్కులనేకములిట్టి "న్యాయస్థానముల శాసనముల" ద్వారానే నిలబెట్టబడినవి. జర్మనీదేశమందు సమ్మేళనరాజ్యాంగపుశాసనములతో భేదించు రాష్ట్రీయశాసనముల రద్దుచేయుటకును, అట్టివ్యాజ్యముల పరిష్కరించునప్పుడు రాజ్యాంగవిధానపు చట్టమునకును న్యాయమూర్తులుచేయు భాష్యసూత్రముల "న్యాయస్థానముల శాసనము" లని, ప్రత్యేకగజెట్టునందు ప్రకటించుట యాచారమైయున్నది. ఇటులనే అమెరికాదేశమందును రాజ్యాంగవిధానపు చట్టమునననుసరించి తమ సమక్షమునకు

తేబడు కేసుల పరిష్కరించుచు న్యాయమూర్తులు ధర్మసూత్రముల నిర్ణయించుచో, ఆసూత్రములు "న్యాయస్థానముల శాసనములు"గా పరిగణింపబడును.

ఈ "న్యాయస్థానముల శాసనముల" ను రాజ్యాంగ విధానపుచట్టమునే సవరించుటద్వారా అమెరికా, ఆస్ట్రేలియా ఆదిగాగల దేశములందు రద్దుచేయనగును. ఇంగ్లాండాదిగాగల దేశములందిట్టి " న్యాయస్థానముల శాసనములను " పార్లమెంటువారి శాసనములు రద్దుచేయకలవు.

ఇట్టి "న్యాయస్థానముల శాసనముల" జేయుటకుగాను, న్యాయమూర్తులకెట్టిసమయములందు అధికారముండవలయునో విచారింతము. తమ సమక్షమునకు తేబడిన, ప్రతివ్యాజ్యమును పరిష్కారముచేయుచు, సాధ్యమైనంతవరకు, ఆ వ్యాజ్యమునకు సంబంధించిన శాసనము ప్రకారమే తీర్పుచెప్పుట ప్రతిన్యాయమూర్తియొక్కయు ధర్మమైయున్నది. తాము విచారణజేయు సమయమునకు, ఆవ్యాజ్యపు వ్యవహారముల పరిష్కారముచేయుటకు, అందుకు సంబంధించిన శాసనమును ఎటులనర్థముచేసుకొనవలెనో తీర్మానించుటలో సందేహముకల్గినయెడల, దేశకాలపాత్రతలననుసరించి, అట్టిశాసనము నెట్లుఅర్థముజేసుకొనిన, ఆశాసన నిర్మాతలయాశయములు నెరవేరునో యూహించి ఆయూహపర్యవసానముగా, తమకుతట్టిన ధర్మసూత్రముల నిర్ణయించి, వానిప్రకారము,

న్యాయమూర్తులు తీర్పు చెప్పవలెను. ఇట్టి "న్యాయస్థానముల శాసనముల"ను, వివిధ న్యాయమూర్తులు, ప్రామాణికముగా నెంచి, తాము తమతీర్పుల నాపిష్టుట చెప్పుచుండుట ఆచారమైయున్నది. ఒకవేళ, ఏ న్యాయమూర్తి యైనను, తనకు ముందే నిరూపింపబడిన ధర్మసూత్రముల నంగీకరింపజాలనిచో, తనకుతోచినట్లు తీర్పు చెప్పవచ్చును. కాని ఏతీర్పు, ఏ వ్యాఖ్యానము, హెచ్చుమంది న్యాయమూర్తులచే నంగీకరింపబడినదో, అయ్యది యే "న్యాయస్థానముల శాసనముగా" తదితర న్యాయమూర్తులచే గౌరవింపబడుచుండును.

ప్రజాప్రతినిధులందరు చేరి, ప్రజాభిప్రాయమును తెలుసుకొని, ప్రజావాంఛితముల నెరవేర్చుటకై, శాసనములఁ జేయుట సబబుకాని, న్యాయమూర్తులకిట్టి శాసననిర్మాణాధికారమొసంగుట ధర్మమా ? ఈకాలమునందు నిముషనిముషమునకు మారుచుండు దేశకాలపాత్రతలననుసరించి, శాసనముల మార్చుచుండుట సాధ్యముకాదు గనుకనే, న్యాయమూర్తుల కిట్టిహక్కునిచ్చుట యగత్యముగుట యేకాక, లాభకరము నగుచున్నది. ఐనను, ఈ న్యాయమూర్తులు తమ యీ ప్రధానమగు ధర్మమును సంతృప్తికరముగానిర్వర్తించుటకై తగుజాగరూకతబూనుట యవసరము. అమెరికా యందిప్పటి ఆచరణవలె, తొమ్మిదిమంది సుప్రీముకోర్టు న్యాయమూర్తులలో ఐదుగురేవిధముగ తీర్మానించిన ఆవిధముగనే

"న్యాయస్థానముల శాసన" మేర్పడుచుండుట దేశాభ్యుదయ కారకముగా జాలదుకనుక, అట్టి ప్రధానమగు కార్యనిర్వహణమొనర్చుటకు, తొమ్మిదింట ఆర్గురైనను, ఒక్క యభిప్రాయమునకు వచ్చుట సబబు. ఈలాటినియమము నేర్పరచుట ప్రజాస్వత్వరక్షణకే లాభకరము. అందువలన శాసనసభవారి శాసనము నెద్దానినైన, చట్టవిరుద్ధమని తీర్మానించుటకుగాను న్యాయమూర్తులలో అధమము మూడింట రెండువంతులమంది అంగీకరించవలసియున్నది.

అమెరికాయందు హెచ్చుగాను తదితర సమ్మేళన రాజ్యాంగములందు కొంతవరకును సుప్రీముకోర్టువారు పూర్వాచారపరాయణులై యుందురు. ఆర్థికవ్యవహారములందు ఈసుప్రీముకోర్టు న్యాయమూర్తులు "వ్యక్తిగతభాగ్య విభజన" పద్ధతినే గౌరవించుచు కార్మికులన్న అసహ్యపడుచు ధనికులన్న ఆదరముకల్గి సభ్యరాష్ట్రముల హక్కులనె హెచ్చుగా గౌరవించుచుందురు. ఇట్టి న్యాయమూర్తులు ప్రజాభిప్రాయమును వరించి, కేంద్రప్రభుత్వపు హక్కులను హెచ్చుచేయుటకు ప్రయత్నించుట లేదు. అమెరికా, ఆస్ట్రేలియా, జర్మనీదేశములందు కేంద్రప్రభుత్వమువారే ఆర్థిక సంక్షోభముల తగ్గించుటకు నిరుద్యోగబాధ పోగొట్టుటకు వర్తకవాణిజ్యముల స్వయముగా నడపుట కెంతయవసరమో

కల్గుచున్నది. ఈవిషయములందు న్యాయమూర్తులు ఉదారస్వభావులై యుండకుండుట విచారకరము.

సుప్రీముకోర్టు సమ్మేళనరాజ్యాంగములన్నిటికి అగత్యము. అట్టిరాజ్యాంగములందు రాష్ట్రీయకోర్టు లుండును; వానిపై సుప్రీముకోర్టువారు ఆధిపత్యమువహింతురు. అమెరికా దేశమందీ కోర్టువారికి రాష్ట్రీయ సమ్మేళనశాసనసభల శాసనములు చట్టవిరుద్ధములగునో లేక సమ్మతములగునో నిర్ణయించు నధికారముకలదు. అటులనె ఆస్ట్రేలియాయందును సుప్రీముకోర్టువారికి అధికారము కలదు. దక్షిణాఫ్రికా, కెనడా దేశములందు రాష్ట్రీయప్రభుత్వముల కొసంగబడిన యధికారములకు భిన్నములగు సమ్మేళనరాజ్యాంగపు శాసనములును రాష్ట్రీయప్రభుత్వముల యధికారులకు మించిన, రాష్ట్రీయశాసనములును చట్టవిరుద్ధములని ప్రీవీకౌన్సిలువారు తీర్మానించవచ్చును. జర్మనీయందలి సుప్రీముకోర్టువారు రాష్ట్రీయశాసనము లెవ్వియైనను చట్టవిరుద్ధములగుచో ఆవిషయమును అవసరముకల్గినప్పుడు పరిచురింపవచ్చును. మనదేశమునకును సుప్రీముకోర్టుయొక్కటి అగత్యమనియు అద్దానికి చట్టసమ్మతములుకాని రాష్ట్రీయ సమ్మేళన రాజ్యాంగముల శాసనముల రద్దుపరచుటకు హక్కుయుండుట అవసరమనియు రౌండుటేబులు సభవారు తీర్మానించియున్నారు. మిగతాదేశములందు ప్రధానన్యాయస్థానమువారు ఆదేశపు

శాసనముల ననుసరించి మాత్రమే "న్యాయస్థానముల శాసనములను" అవసరముకల్గినప్పుడు నిర్మించుచున్నారు.

న్యాయస్థానములవల్లను, న్యాయమూర్తుల వల్లను, న్యాయవాదులవల్లను సంఘమునకు తగినంత లాభము కలుగవలెనన్న వారికి తగినట్టి శిక్షణనిచ్చుట యవసరము. వారందరు న్యాయవాదవృత్తికి తగిన డిగ్రీని పొందుటకుగాను, సాంఘికశాస్త్రము, ఆర్థికశాస్త్రము, చరిత్ర, న్యాయశాస్త్రము, తత్వశాస్త్రము పఠించుట యుగత్యము. ప్రజల సాంఘికార్థికజీవిత సూత్రముల గ్రహించనిదె న్యాయవాదులకు ప్రజలకు తగుసహాయము చేయుటకువలయు శక్తికలుగదు. అట్టిప్రపంచవిషయిక జ్ఞానములేనిదే ఏ న్యాయవాదియు న్యాయమూర్తిగా నియమింపబడుట కర్హుడు కాజాలడు.

న్యాయవాద వృత్తియందున్నవారందగు తమవృత్తిలోనివారందరి మంచిచెడ్డల విచారించుటయేకాక తమవృత్తియొక్క పేరుప్రతిష్ఠలు వృద్ధిపొందించుటకు తగుప్రయత్నములు చేయుట అర్హము. మనదేశమందేర్పడుపబడిన "బార్ కౌన్సిలు" వారు ప్రభుత్వపునిర్బంధవిధానమువలన కల్గుచుండు పర్యవసానముల విచారించుటకు వివిధ ఆర్థిక సాంఘికశాసనములవలన కల్గుచున్న పర్యవసానముల కన్గొనుటకు వివిధ శాసనములు అనుభవమందు ప్రజలకు కల్గించు సాధకబాధకములు తెలుసుకొనుటకు తమశక్తియుక్తుల నన్నిటి నువ

యోగించి తమపరిశోధనల పర్యవసానముల తమ పత్రికలయందు ఇతరవార్తాపత్రికలయందు ప్రచురించుచు దేశసేవ చేయవలెను. న్యాయశాస్త్రమునందు తదితరశాస్త్రములందువలెనే పరిశోధనలజేయుట అత్యవసరము.

న్యాయమూర్తులు కూడను తమ అనుభవమందే యే శాసనములు ఏయేసాధక బాధకముల ప్రజలకు కల్గించుచున్నవని కన్పెట్టిరో ఆదృష్టాంతములను "న్యాయశాఖ" వారికి తెలియజేయుచుండుట యుక్తము.

ప్రభుత్వపు న్యాయశాఖవారు "ధర్మసూత్రములు, న్యాయశాస్త్రపరిశోధనశాఖ" నేర్పరచి అందు బారు కౌన్సిలువారు న్యాయమూర్తులు సూచించు శాసనసవరణలు, నూతనశాసననిర్మాణోపపాదనలు నిష్పక్షపాతముగ విచారించుచుండుట శ్రేయోదాయకము. ఇందువలన శాసనముల నమలుపరచు న్యాయమూర్తులు శాసనములబట్టి వాదించు న్యాయవాదులు శాసనముల నిర్మించు ప్రభుత్వము పరస్పరముగా సహాయముచేసుకొనుచు శాసననిర్మాణ కార్యము సంతృప్తికరముగా నిర్వర్తింపసాధ్యమగును.

---

## పదునాఱవ ప్రకరణము.

### —: ఆర్థికజీవితము - రాజ్యాంగము :—

ప్రజలజీవితము సౌఖ్యప్రదముగను, శాంతియుతముగను, అభివృద్ధిదాయకముగను, కళాప్రపూర్ణముగను, మానవలోక కళ్యాణప్రదముగను ఉండుటకు తగినంతసాయము చేయుటయే, రాజ్యాంగ సంస్థలయొక్క-పరమార్థమైయున్నది. ఏరాజ్యాంగ సంస్థలద్వారా యిట్టిసదుపయోగములు కలుగజాలవో, ఆసంస్థలు వ్యర్థములగుటయే కాక, మానవలోకమునకే కంటకములగును. ఎట్టిరాజ్యాంగజీవితమందు, ప్రజలందరిక్షేమార్థమై కాక, ఏకొలదిమందికో భోగభాగ్యములులభించుటయు, జనసామాన్యమంతయు దుర్భర దారిద్ర్యమందు మున్గి తేలుచుండుటయు తటస్థించునో, అట్టిజీవితము అనర్థదాయకమగును. అనుదినము పెరుగుచుండు దేశభాగ్యము ఏకొలదిమందికో హస్తగతమగుచుండుటయు, చెమటోర్చి కష్టములభరించి, కృషిచేయు కార్మికులకు కటికరాళ్ళ వంటి రాగిముద్దలు మాత్రమే దొరుకుచుండుటయు, అల్పసంఖ్యాకులు హంసతూలికతల్పములందు ఉయ్యాలలూగుచు, పంచభక్ష్యపరమాన్నముల నారగించుచు, సఖీసల్లాపసుఖములందు తాండవమాడుచు, కాలము తమయాజ్ఞాబద్ధమై యుండ, ధనము తమ పిలుపుకొరకై వేచియుండ, ప్రపంచము తమ

సంజ్ఞలజూచినంతనే తనరహస్యముల నారగింపుచేయుచుండ ఎదురాడు వారు లేక వారెల్లరు ఆనందధామములందు సంతుష్టులైయుండ, జనబాహుళ్యమంతయు అన్నమోరామచంద్రాయటంచు తమచే సృజింపబడుచుండు భౌతిక ప్రపంచసౌఖ్యస్వరూపములగాంచి తమకు వానిని అనుభవించుట కర్హత లేదుగదాయని నిట్టూర్పువిడుచుచు జీవితాధారమునకగత్యముగు కోర్కెలతీర్పజాలక, ఇడుమలంబడుచుండుటయు, నే రాజ్యాంగమందు తటస్థించుచుండునో, అయ్యది వికలాంగమైనదనియు, నష్టదాయకమైనదనియు, స్వధర్మచ్యుతిబొందినదనియు చెప్పబడును. దురదృష్టవశాత్తు ఈదినములందు ఆచరణయందున్న రాజ్యాంగములన్నిటిలో ఒక్కరషియాదేశపు కమ్యూనిష్టు రాజ్యాంగము తప్ప, మిగిలినవన్నియు ఈవిధముగనే స్వధర్మచ్యుతిబొందియున్నవని చెప్పకతప్పదు. ఐనను కొన్నిరాజ్యాంగములు తదితరముల కంటె కొంతవరకు స్వధర్మచ్యుతిబాసి స్వధర్మ నిర్వహణకార్యమునకు గడంగుచున్నవని యొప్పుకొనవలసియున్నది. ఆఫ్రికాఖండమందలి నీగ్రోజాతుల చిన్నచిన్నరాజ్యాంగములకంటె యూరపుఖండవాసులచే రంగుజాతులవారిపై నేర్పరుపబడిన రాజ్యాంగములు కొంతవరకు మేలనియు, ఇట్టి సామంతరాజ్యాంగములకంటె "మాండేటెడు" భూములపాలనము మేలనియు, వానికంటె భారతదేశమువగైరా రాజ్యాంగములు నాణ్యమనియు ,వాని

కంటెను స్వరాజ్యము బొందినను, నిరంకుశులపెత్తనముక్రిం దనున్న ఇటలీ, జుగోస్లావియా అదిగాగల రాజ్యాంగములు సుగుణదాయకములనియు, అంతకంటెను, ప్రజాస్వామికరా జ్యాంగముల బొందినదేశములు శుభస్థితియందున్నవనియు, వానియందును కార్మికకర్షకుల యభివృద్ధికోరి, ధనికుల, భూస్వాములనుండి, శిస్తులరూపకముగా ధనసహాయముబొంది ప్రభుత్వాదాయమును క్రమముగా ప్రజాబాహుళ్యపుక్షేమా ర్థమై హెచ్చుగా ఖర్చిడుచుండు రాజ్యాంగములు మేలనియు, వానియందును, "సమిష్టిభాగ్య వృద్ధిజనపద్ధతి"కే హెచ్చు ప్రాముఖ్యతనిచ్చుటకు ప్రయత్నించుచున్న రాజ్యాంగము అ త్యుత్తమమైనదనియు చెప్ప నొప్పును. ఇప్పటి కమలునం దున్న రాజ్యాంగములన్నిటిలో ప్రజాసామాన్యమున కంతకు, సాధారణ రాజ్యాంగ, ఆర్థిక, సాంఘిక సదుపాయముల కల్గిం చుటే పరమార్థముగా నెంచి, స్వధర్మముల నిర్వహింపబూను కొనుచున్నది బోల్షివిక్కుల రాజ్యాంగమైయున్నది. దాని పిమ్మట, డెన్మార్కువారి రాజ్యాంగమును, ఇంగ్లీషువారి రాజ్యాంగమును, ఆస్ట్రేలియావారి రాజ్యాంగమును, జర్మను వారిరాజ్యాంగమును పేర్కొనదగియున్నవి.

## II

అనాదికాలమునుండియు ప్రజలు, తమతమ బృందము లందును, కులములందును, తమకుచితమైన సాంఘికజీవితము

ననుసరించి, ఆర్థికసంపదలబొందుచుండ, తమజీవితార్థములకు భంగముకలుగకుండుటకై, తమసాంఘికజీవితమందు భూస్వాములగు క్షత్రియులు, వారిపెద్దలగు రాజులు తమ్ము రక్షించవలెనని యభిలషించుచుండిరి. కాని, అనాదిభారతదేశమందును, గ్రీకు, రోమనురాజ్యములయందు, చైనాదేశమందును మానవులజీవితపు సర్వాంగసౌభాగ్యతకగత్యమగు సర్వకార్యముల నిర్వహించుటయె రాజ్యాంగముయొక్క ధర్మమని ఆనాటిప్రజలచే విశ్వసింపబడుచుండెను. మతము, నైతికజీవితము, ఆర్థికవ్యవహారములు సాంఘికకట్టుబాటులు అన్నియు, రాజ్యాంగముయొక్క నియమబద్ధమైయుండెడివి. ఇందేది దేనికంటె హెచ్చని వాదించుట కాకాలమందు అవసరముండెడిది కాదు. అన్నియు పరస్పరముగా నగత్యమనియు, ప్రజలెల్లరు సర్వలక్షణసమన్వితులై సర్వసౌభాగ్యాభివృద్ధులబొందవలెనన్న, ధర్మార్థకామమోక్షాభిలాషులైయుండి, తమ రాజ్యాంగమే మతము, నీతి, ఆర్థికజీవితముగా ప్రతిబింబించవలెననియు, ఆకాలపుప్రజలు విశ్వసించుటయేకాక తమజీవితమందు ఆయాధర్మములను అనుభవమునకు దెచ్చిరి.

కనుకనే, వివిధజనబృందములెట్టినియమబద్ధులై, ఏయే విధముగ తమ ఆర్థికజీవితము పెంపొందించుకొని, నియమపాలకులై, సంఘజీవితము సౌఖ్యదాయకముగ జేయవలెనో ఆనాటిరాజ్యాంగవేత్తలు సూత్రములనిర్వచించుటయేకాక,

అనుభవసిద్ధముగ సాంఘికపు ఏర్పాటుల నమలులోనికి దెచ్చిరి. ఏయే కార్యములనొనర్చు కార్మికుల కెట్టెట్టి భృతిని గ్రామప్రజలొసంగవలెనో, అనాథలగువారి కెట్టిసౌకర్యములు తదితరప్రజలుకల్గించవలెనో, రైతులు తమకార్మికుల కెట్టిజీవనభృతినొసంగవలెనో, బ్రాహ్మణులు లేక మతాచార్యులెట్టి జీవనోపాధిబొంది, ఏయే ధర్మముల నిర్వర్తించవలెనో, క్షత్రియులెంతవరకు అవసరముబట్టి ప్రజలనుండి, శిస్తుల రుసుముల బహుమానములనంది ప్రజలనెట్లు తమ్ము, తమనుండి ఇతరుల బాధలనుండిరక్షించి సాంఘికాంతర్గతమగు నియమములనెల్లరు పాలించునట్లు జాగ్రత్తపడవలయునో, మనదేశమందును, చైనాదేశమందును, పూర్వీకులు నిర్ణయించియుండిరి. ఆపద్ధతులప్రకారము రాజ్యాంగజీవనము కొనసాగినంతకాలము, ఒకరుతినుచుండ మరొకరు బలవంతముగా పస్తుపరుండుటగత్యము కాదయ్యెను. ఎల్లరకొకేవిధమగు జీవనోపాధి కలుగకయున్నను వివిధకర్మల ననుసరించువారికి ఆ కాలమున వారివారికి ఎంతెంతజీవనభృతిచాలుననుకొనబడెనో, అంతంత జీవనోపాధి సాధ్యమగుచుండెను. ఈ కాలమందువలె నిరుద్యోగబాధ తీవ్రముగా కల్గుటకాని, అనాథలకాశ్రయము మరుదగుటకాని, చెవిటి, గ్రుడ్డి, కుంటి, ఆదిగాగల అవిటివారికి రక్షణ దూరమగుటకాని, ఆకాలపు నియమముప్రకారము వీలులేదు. ఒక్కొక్క గ్రామమందలి భూమి

యంతయు గ్రామస్థుల రక్షణకై యున్నదనియు, దానిని సేద్యమునందు కుశలులైనవారు సేద్యమొనర్చి, తమకుసా యపడు వివిధతరగతులవారికి తగినట్లు భోజనసదుపాయము లకల్పించి, కృషిచేయలేని అవిటివారు, బిడ్డలు, వృద్ధులాది గాగలవారికి పోషణకలుగజేసి, గ్రామమునకు, దైవతారాధ నద్వారా, ఆయుధపూజద్వారా, సకలవిధములగురక్షణ అభి వృద్ధికల్గించువారికి, భక్తిశ్రద్ధలతో గౌరవభృతి నొసంగుచుం డుట యుక్తమని ఆకాలమందు ఎల్లరచే విశ్వసింపబడుచుండె ను. అనగా ధర్మబద్ధమై, గ్రామజీవితమునడుపబడవలెననియు సత్యసంబంధమై దేశజీవితము గడుపవలెననియు, సర్వజన సౌఖ్యదాయకమై రాజ్యాంగమువర్థిల్లవలెననియు, ప్రజలు నమ్ముచుండిరి.

మతమునుగాని సాంఘికపుయేర్పాటులనుగాని ఆర్థిక జీవిత నియమములనుకాని నైతికాదర్శములనుకాని రాజ్యాం గముతో సంబంధ మంతగాలేక నడుపజూచుట ఆకాలపు వారికి విపరీతముగా నుండెడిది. రాజ్యాంగజీవితమన్న నే ప్ర జల వ్యక్తిగత సమిష్టి సంఘజీవితమంతను ఆవరించి వారు దేవునకు జరుపు అనుదిన ప్రార్థనాది సంప్రదాయముల తోగూడి దేశీయులెల్లరి సంతోషస్వరూపులుగా జేయుచుం డు జీవితమనియే ఆకాలమువారికి తోచుచుండెను. కనుకనే "రాజునకు ప్రజ శరీరమనియు" ప్రజకు రాజు ఆత్మయనియు

ఎల్లదేశములందును వేలకొలది వత్సరములక్రితము భావింప బడుచుండెను. ఈవిధమగు రాజ్యాంగవిధానపు ధర్మముల గూర్చిన భావోద్రేకులైన క్రీస్తులోకచక్రవర్తులగు పోపులు శ్రీసప్తమ గ్రెగరీయిత్యాదుల నాయకత్వమున పాశ్చాత్యుల జీవితమును సౌఖ్యదాయకముగ జేయ ప్రయత్నించిరి. వారిపిమ్మట వివిధదేశములందు పెత్తనమునకువచ్చిన రాజులును, చక్రవర్తులును ప్రజల ఆర్థికజీవితమును సంతృప్తికరముగా సర్వాంగసౌష్టత కల్గించునట్లు చేయ ప్రయత్నించిరి. వీరిలోముఖ్యులు పదునాల్గవ లూయీగారు (ఫ్రాన్సు), ఎలిజబెత్తుగారు (ఇంగ్లాండు) నైయుండిరి. కాని పందొమ్మిదవ శతాబ్దమందు సాధ్యమైన "ఆర్థికవిప్లవము"వలన కల్గిన సాంఘిక పరిణామ ఫలితముగా "నూతనభావోదయముగ" పరిణామఫలితముగా రాజ్యాంగవిధానమునకు బాహ్యస్వరూపమైన ప్రభుత్వపు యాజమాన్యమునుండి ప్రజల మత, నైతిక ఆర్థిక సాంఘికజీవితము స్వతంత్రితబొందుట తటస్థించెను

## III

మనదేశమందు హిందూచక్రవర్తుల పాలనకాలమందును, తుదకు మహమ్మదీయులరాజ్యకాలమందును, జీవితపు సర్వలక్షణముల రక్షించుటకుగా నేర్పరుపబడు రాజ్యాంగ విధానమే, మనగ్రామములందధిక భాగమునందు, అనులూనం దుండెను. అటులనే చైనాదేశమందును, ఈశతాబ్దారంభ

మువరకు నట్టి రాజ్యాంగవిధానమే ఆచరణయందుండెను. కాని బ్రిటిషు వారిపాలనము మన దేశమందు స్థిరపడినప్పటినుండి (అనగా దాదాపు 120 సంవత్సరములనుండి) గ్రామపంచాయితీప్రభుత్వము రద్దుచేయబడుటయు, వివిధవృత్తులవారు తమకు యినాములుగా నున్న భూముల ననుభవించుము, కులధర్మముల నెరవేర్చ నిరాకరించుటకు స్వతంత్రత కల్గుటయు, ఏగ్రామపుధాన్యము ఆగ్రామావసరముల కుపయోగపడుటకుమారు ఎగుమతియగుచుండుటయు, ధర్మబద్ధమగుచుండిన ప్రజావృత్తి జీవితము క్రమముగా వ్యాపారసరణిబొందుటయు తటస్థించెను. మతమునకు, నైతికజీవితమునకు, రాజ్యాంగమునకు అప్పటివరకున్న గాఢమగు సంబంధము త్రెంపబడెను. ఆర్థికజీవితమునకు, రాచకీయపెత్తనమునకున్న పరస్పరసంబంధబాంధవ్యములు వేరుచేయబడెను. ప్రజలయందు ఆర్థికసంక్షోభములు కలుగకుండ, దారిద్ర్యతి హెచ్చుగాకుండ వివిధవృత్తులపరస్పరసంబంధములు చెడకుండ, అనర్థదాయకమగు అనవసరమగుపోటీ స్పర్థద్వారా కాక సహకారముద్వారా ఆర్థికప్రపంచమున ప్రజలెల్లరు తమతమసౌఖ్య సంతోషముల వృద్ధిచేసుకొనుటకు శ్రద్ధజేయు బాధ్యత రాజ్యాంగమును నడపు పాలకులకు లేకుండెను.

కనుకనే మనదేశపు క్షీణించుచున్న వృత్తులను పునరుద్ధరించుటకై తగుప్రయత్నములు ప్రభుత్వము చేయవలెనని

సర్. పిట్టిత్యాగరాయచెట్టిగారు, మదనమోహనమాలవ్యా గారు, రెనడేగారు, రమేశచంద్రదత్తుగారు వగైరా లెంత యులజడిచేసినను ఆర్థికపరిపంచకముతో నెట్టిసంబంధము పెట్టుకొనుట తగదని తలంచు బ్రిటిషు ప్రభుత్వమువారు భారతీయ కార్మికులకు సహాయము చేయనొల్లకైరి బొంబాయి, అహమదాబాదు, షోలాపూరు ఆదిగాగల పట్టణములందు బయలుదేరిన కర్మాగారములందు కూలినాలి చేయుచున్న వేలకొలది కార్మికులు బొందుచున్న భరింపరాని యిడుముల తగ్గించుటకై ప్రభుత్వమును జోక్యము కల్గించుకొనుమని టి యం నాయరుగారెంతో యులజడిచేసినగాని సఫలీకృత మనోరథుడు కాడాయెను.

భారతదేశమునందలి రైతులు కరవువాతబడి చావకుండ, గ్రామవాసులు దారిద్ర్యదేవతాదంష్ట్రలక్రిందనల్గకుండ రక్షించుటకై, మాగాణిప్రాజెక్టుల వృద్ధి పరచవలసినదని శ్రీ సర్. ఆర్థరుకాటను, రమేశచంద్రదత్తు ప్రభృతులెంత ఘోషపెట్టినను, బ్రిటిషుప్రభుత్వమట్టి వాదనను పెడచెవిని బెట్టుచుండెను. కర్మాగారపు ఆర్థికాభివృద్ధికల్గించుటకై ప్రభుత్వము తనశక్తులనుపయోగింపవలెనని శ్రీ మదనమోహన మాలవ్యాగారు, ఇండస్ట్రీసు కమీషన్ ద్వారా పల్కినను మొన్న మొన్నటివరకు మనప్రభుత్వము మనవాణిజ్యాభివృద్ధికై శ్రద్ధజేయపూనదాయెను.

ఇదేవిధముగ ప్రపంచమునందెల్లెడల పందొమ్మిదవ శతాబ్దారంభమునుండియు, వివిధప్రభుత్వములు, ఆర్థికప్రపంచముతో తమకున్నసంబంధముల త్రెంపుకొన బ్రయత్నించుచు దీనుల, అనాథల, నిర్ధనుల, నిరుద్యోగులయెడల తాము నెరపవలసిన ధర్మములయెడ విముఖతజెందుచుండెను. ఇదేసమయమందు అప్పటివరకు అమలునందున్న సాంఘిక, ఆర్థిక, రాచకీయకట్టుబాటులు తునుకతునకలగుటయు, కార్మికులెల్లరు తమ్ము పోషించువారెవ్వరో తెలియక, వివిధవృత్తులవారు తమవస్తువుల కొనువారెవ్వరో తెలియక, వ్యవసాయికకూలీలు తమ్ము కమతమున కుంచుకొనువారెవ్వరో తెలియక, అకస్మాత్తుగా స్వతంత్రమునేకాక అదివరకున్న సాంఘిక ఆర్థికబంధవిమోచనమును కూడ పొందిన స్థితియందుండిరి. అంతవరకును తమపై యాధారపడియున్న కూలీలరక్షింపవలసిన రైతులు యజమానులు, కర్మాగారాధిపతులు, తమనుండి యట్టిభారము జారిపోవుటయు, తమకు వలయు కూలీలు ఎచ్చటబట్టిన నచ్చట కొల్లలుగా దొరుకుచుండుటయు, తమకుకావలసిన వస్తువుల నిర్మించుట, కడుంగడు సులభమగుటయు, తమకును తమకూలీలకును గలసంబంధము, కూలి జెల్లించుటతోతీరిపోవుటయు జూచి సంతసించుచుండిరి. "ఎవరికివారే యమునాతీరే" యను నీ ఆర్థికస్వాతంత్ర్యోత్సవమందు బలిష్ఠులగు ధనికుల, భూస్వాములపాద

ముల క్రింద కూలీలుబడి, నలిగి, చనునైపోవుటలో వింతయే మికలదు! జగన్నాధరధప్రయాణమునందు రధముపై గంటలవాయించుచు, భగవత్ప్రీత్యర్థమై యొసంగబడు ప్రసాదమును భుజించుచు, తీర్థమును ద్రావుచు, ధనికులు భాగ్యములు కళకళలాడుచుండ, రధవేగమునకు తాళజాలక, ఆకరణారహితముగ రధచక్రముల క్రిందబడి కార్మికులు కూలీలు అసువులబాయుచుండిరి. ఈజగన్నాధరధమే "మెషినుల" యుగము. ఇంగ్లాండునందు ముందు వస్త్రముల నేతపరిశ్రమయందు, పిమ్మట, ఇనుపవస్తువులపరిశ్రమయందు, అటుపిమ్మట రైల్వేలయందు ప్రజ్వలించిన మెషినుల ప్రభావము వలన ధనికుల యాధిక్యత బలియుటయు, కార్మికుల ప్రాముఖ్యత క్షీణించుటయు, ధనికులు, మెషినుల సహాయములో, కుబేరులవలె, నిస్సహాయులగు కార్మికులపై నెక్కి స్వారిచేయకల్గుటయు జరుగనయ్యెను.

ఈదినములందు ఇంగ్లాండునందలి కూలీలు పట్టణములందు లక్షలకొలదిగా జేరి ఒకరితోనొకరు జీవనోపాధిని సంపాదించుకొనుటకై విపరీతముగా పోటీపడుచు కూలిని తగ్గించుకొనుచు తమలోతాము తగవులాడుకొనుచు నానాటికి దరిద్రదేవత వాతబడుచుండిరి వారిగృహములు అనారోగ్యమున కాలవాలమగుచుండెను. వారిజీవితము విషాదగ్రస్థమగుచుండెను. వారిమనఃప్రపంచము ఆకారరహితమై అజ్ఞానబంధురమై

పాపిష్ఠి యీలోచనలచే భయంకరాకారము బొందుచుండెను. శిశువులు వేలకొలది జచ్చుట, వయస్సునందున్న యువకులు యువతులు ముణుగురు చెంది క్షీణించుట, నడివయస్కులు జనసత్వములుడిగి దుఃఖసాగరమందు మున్గిపోవుటయు, కార్మికుల జీవితము అంధకారబంధురమగుటయు తటస్థించెను. గ్రామములందున్నప్పుడు కార్మికులయందు సహజముగా ప్రకటితమగుచుండు స్వాతంత్ర్యముగాని, వ్యక్తిత్వముగాని కన్పడకపోగా, తల్లిదండ్రులు కసిగండులారని చిన్నబిడ్డల తిట్టి కొట్టి మెషినుల పాతబెట్టుట, పిల్లలు తల్లిదండ్రుల ద్వేషించుట, భర్తలు త్రాగుబోతులై భార్యలహింసించుట, భార్యలు ధర్మచ్యుతిబొంది అవినీతిపథంబున సంచరించుట సంఘము వికలాంగమొంది సంఘజీవితము దుశ్చేష్టాభూయిష్ఠమగుటలో వింత యేమికలదు? ఐతే ఇట్టిపరిస్థితులే తదితర దేశములందును కలుగలేదేమోయను సందియమక్కరలేదు. ఈనాటి మన పట్టణములందలి సాధారణప్రజలజీవితమును పరీక్షించువారికి యభాగ్యపుస్థితిగతులు మనలకూడ నావరించియున్నవని తెల్లమగును. ఇటులనే ఇతరదేశములందును, కార్మికులు కూలివారును అసాధారణమగు భరింపశక్యముగాని అనూనమగు ఆర్థికపుటిబ్బందులకు సాంఘికదౌష్ట్యములకు లోనైయున్నారని తెలియనగును.

ఇట్టి రాక్షసప్రకృతిని ప్రచారమొనర్చుచుండు "మిషినుల యుగము"ను బాధించి "స్పర్ధ" యను మహామారిని అరికట్టి "స్వార్థపరత" యను పాపబుద్ధిని అణగద్రొక్కి "ఎవ్వరికి వారే" యను సంఘవైరుద్ధ్య భావమును దిగమ్రింగి తిరిగి, రాజ్యాంగముయొక్క ఆధిపత్యము ప్రజల ఆర్థికజీవితముపై గూడ నేర్పరచుటకు క్రమక్రమముగా హెచ్చించుచుండు ప్రయత్నములు ప్రప్రథమమున ఇంగ్లాండునందు, పిమ్మట జర్మనీయందు ఆపిమ్మట ఆస్ట్రేలియా న్యూజిలాండులందు, తుదకీకాలమున "నానాజాతికార్మికశాఖ" ద్వారా అన్నిదేశములందును చేయబడుచున్నవి. తన్నుతాను రక్షించుకొనలేక వ్యక్తిగతముగా నేకూలివాడును తనవృత్తికి తగినంత తనశక్తికి తగినట్లు తనకుటుంబపోషణమునకు వలసినంత కూలి యిచ్చువరకు తాను కూలిచేయనని పట్టుపట్టుటకు శక్తిలేనివాడై యుండెను. ఒకచోటి కూలీలు తనకులొంగకున్నను మరొకచ్చోటివారిని పిలిపించుకొనగల్గిన యజమాని ఒకవేళ అన్నిచోటులందలి కూలీలు తానుచెల్లించవలసిన కూలి కంగీకరించకున్నను తనకర్మాగారముల మూసివేసి నెలలపర్యంతము హఠయోగము పట్టగల్గియున్నాడు. ఈయిబ్బందిని కొంతవరకైన తగ్గించి కార్మికులకు సంఘీభావము కల్గించి కొంతవరకైన స్వయంసాహాయ్యమువలన తమకు ఋజుమార్గమున దక్కవలసిన కూలిని యజమానులిచ్చువరకు

కూలికిపోకుండ శక్తిపొందించుటకై "కార్మిక సంఘము"ల నేర్ప రచుటకు బ్రిటిషు ప్రభుత్వము శాసనముద్వారా ఎంతో శ్రి యత్నముపై కొల్పుకొనెను. మనదేశమందును 1921 వ సంవత్సరమునకుగాని కూలీలకు తమ ట్రేడు యూనియనుల నేర్ప రచుకొను నధికారము కలుగదయ్యెను. కాని యిప్పటికిని జమీందారీ రైతులకు తమ సంఘముల నేర్పరచుకొని జమీందారీపద్ధతి పోవలెననియు తమకష్టములు నివారణ కావలెననియు అలజడిచేయుటకు సంపూర్ణముగు వాక్కు కలుగకున్నది.

బాలబాలికలు విద్యాబుద్ధుల బొందకముందె అవయవాభివృద్ధి గాంచకముందె జవబలత్వముల సంపాదింపకముందె కర్మాగారములు, గనులు, రైల్వేలు, కోర్టు, కాల్వలు, పొలములయందు కూలినాలికి పంపబడుటవలన వారి ఆరోగ్యము చెడి విద్యాభివృద్ధి కాటంకముకల్గి దుర్బుద్ధు లలవడి సంఘవినాశనమునకు దారిదీయుటయే పర్యవసానమగుచుండుట అనుభవపూర్వకముగా ఇంగ్లాండునందు కనిపెట్టబడుటచే వారు పదునాల్గవ సంవత్సరపు ప్రాయము బొందకముందు కూలినాలికి పోరాదను నియమ మేర్పరచబడెను. ఈనియమము నెల్లదేశము లీకాలమందు పాలింపప్రయత్నించుచున్నవి.

స్త్రీలు ఈదినములందలి ఆర్థికప్రపంచమున కూలినాలి సంపాదించుకొనుటకు స్వాతంత్ర్యము బొందుట యెల్లరకు యిష్టమేయైనను వారి ఆరోగ్యమునకు, నీతికి, నడతకు భంగకరములగు గనులు, రైల్వేలు ఆదిగాగల వృత్తులందు కూలినాలికి పోరాదను నియమము ప్రథమమున ఇంగ్లాండు నందు పిమ్మట తదితర దేశములం దంగీకరింపబడినది. కాని మన దేశమున యింకను బొగ్గుగనులందు రైల్వేలందు స్త్రీలు కూలికిగా నుపయోగింపబడుట విచారకరము. అటులనె అస్సాము, నీలగిరి ఎస్టేటులందు స్త్రీలు కూలీలుగా నుండుటయు పురుషులకంటె స్త్రీలు చాలతక్కువగా నచ్చోటులందుండుటచే అనేక సాంఘిక అనాచారములు సంభవించుచుండుట జూచుచున్నాము.

కూలీలు తమ ఆర్థికజీవితాభివృద్ధికై అవసరమగునప్పుడు తాము యజమానులు నిర్ణయించు కూలినాలి కొప్పుకొనక హెచ్చుకూలి కావలెననిగాని హెచ్చుగౌరవాదరములు తాముకూలిచేయునెడ అవసరమనికాని పట్టుపట్టి 'సమ్మె' కట్టుటకు స్వాతంత్ర్యమును ముందుగా ఇంగ్లాండునందు బొందిరి. ఇప్పటి కస్వాతంత్ర్యము కొంతవరకు మన వాణిజ్యములందలి కూలీలకు తమట్రేడు యూనియనుల ద్వారా నుపయోగించుకొనుట కవకాశము కల్గుచున్నది. కాని మనవ్యవసాయిక కూలీల కిట్టిహక్కు యింకను ప్రసాదింపబడకుండుట దూరదృష్టము.

ఈహక్కును సంపూర్ణముగా సుపయోగించుటకు వీలు లేకుండ యజమానులకు కార్మికులకు వివాదములు కల్గినప్పుడెల్లను ఏదో యొక విధముగా ఒడంబడిక కల్గించుటకై ఆస్ట్రేలియా, న్యూజిలాండు దేశములందు "ఆర్థికరాజీ సంఘములు" ప్రభుత్వముచే నేర్పరచబడినవి. ఇటలీదేశమందు యజమానులకు సుఖమగు రీతి "వాణిజ్యరాజీసంఘము"ల నేర్పరచిరి. వానిద్వారానే కార్మికులు యజమానులు తమకు పరస్పరముగా కల్గుచుండు వివాదముల తీర్చుకొనవలసియున్నది.

ఇంగ్లాండునందు "సమ్మె" కట్టుటకు కార్మికులను, "పనివారితీసివేయుట"కు (Lock-outs) యజమానులకును అధికారముండినను, వివాదగ్రస్తమగు వ్యవహారముల చర్చించుటకును, వీలున్న రాజీకల్గించుటకును, అటులరాజీ సాధ్యముకానిచో నిజానిజముల దేశీయులకు వెల్లడిచేయుటకును "వాణిజ్య విచారసంఘము"లు (Industrial Enquiry Committees) అవసరమునుబట్టి ప్రభుత్వముచే నేర్పరచబడుచుండును. కాని యీసంఘమువారికి ఇరుపక్షములవారు అనుసరించవలసిన తీర్పుల జెప్పుట కధికారము లేదు.

ఒక్క వాణిజ్యమందు (బొగ్గుగనులు) వివాదముకల్గుటయు, అంత కార్మికులు 'సమ్మె' కట్టుటయు జరుగ వారికితోడ్పడుటకై సోదరకార్మికులు, తదితర వాణిజ్యములందును

(రైల్వేలు వగైరా) సమ్మెకట్టుచో, ఈ సమ్మెలవలన కల్గు యిబ్బందులచే పీడితులగు ప్రజాసామాన్యము తమకందరికి జెందిన ప్రభుత్వముద్వారా తమహక్కులరక్షింపజూచుకొనుట సహజమేకదా! అటుల ప్రజాసామాన్యపు హక్కుల రక్షించుటకై, ప్రభుత్వము రెండింటిలో నేదేనొక కార్యము చేయనగును. ఒకటి తానుమధ్యవర్తియై "వాణిజ్యవిచారణాసంఘము" వారిసూచనలను యిరుపక్షములు అంగీకరించునట్లు చేయుట. రెండు ఆసూచనలనంగీకరింపని పక్షమున తాను నిర్బంధమునుపయోగించుట. కాని యింతవరకు అనుభవమందు ఆర్థికవిచారణాసంఘము కార్మికులపక్షమున కొన్నిసూచనలు చేసినను ప్రభుత్వములుమాత్రము, వివిధదేశములందు కర్మాగారాధిపతుల పక్షము జేరి, కార్మికుల సమ్మెలపడగొట్టుట యే జూచుచున్నారము.

యజమానులకు కార్మికులకుమధ్యను, భూస్వాములకు వ్యవసాయకూలీలకుమధ్యను, ఆధునికయుగమందెల్లప్పుడు, సంఘర్షణకల్గుచునేయున్నది; క్రౌర్యము కుములుచునేయున్నది; అనుమానము పెరుగుచునేయున్నది. ఒకప్పుడు యజమానులు, మరొకప్పుడు కూలీలు తమతమ స్థితిగతుల బాగుపరచుకొనుటకై, ప్రత్యర్థిపక్షమును లొంగదీయవలెనని ఆర్థికయుద్ధముల జేయుచుండుటకలదు. యుద్ధానంతరము 1924,25 సంవత్సరములందు పాశ్చాత్యభూములందనేక పరిదేశముల,

యజమానులే కార్మికులబెదరించి 'కూలి రేటుల' తగ్గించకల్గుటయు, వారట్లు చేయుటలో వారికి ఆయా ప్రభుత్వములు సాహాయ్యబడుటయు జరిగెను. మరియు 1926 వ సంవత్సరమునందు, ఇంగ్లాండులోని కార్మికులెల్లరు, "జనరలుసమ్మె" నేర్పరచగా, ప్రభుత్వమట్టి 'సమ్మె' అశాస్త్రీయమని ప్రకటించి, కార్మికోద్యమమును పడగొట్టి, కార్మికులనోడించి, యజమానులకు జయముకల్గించెను. కనుక ఈ "సమ్మె" యనుసర్వరక్షణాయుధమువలన, కార్మికులకంతగా మేలొనగూడుట లేదని ప్రపంచమునందలి కార్మికులచరిత్రయే తెల్పుచున్నది.

"ట్రేడు యూనియనుల" ద్వారా, స్వసంఘరక్షణమును కొంతవరకేర్పరచుకొని "కూలి రేటుల"ను హెచ్చింపచేసుకొనినను ఎంతవరకు తమ్మెంతమందిని యజమానులు కూలికిపెట్టుకొనగలరో నిర్ణయించు నధికారము కూలీలకు లేదు. వ్యాపార వాణిజ్యములు చురుకుగా జరుగుచున్నంతకాలము, దొరకినంతవరకు కార్మికులనెల్లరను యజమానులుపయోగింతురు కాని వ్యాపారము మందగించుట ప్రారంభమగుటతోడనే, కార్మికులను తమయుద్యోగములనుండి పంపివేయుట యాచారమైయున్నది. కనుకనే యుద్ధానంతరము క్రిందటి పన్నెండువత్సరములందును ఏమూడువత్సరములలోనో తప్ప మిగతా కాలమందంతట, వ్యాపారముమందగించి, తయారు కాబడువస్తువులను ధాన్యమును కొనువారు లేక వ్యాపారస్థులు

తమలాభములు తగ్గుచుండ నోర్వజాలక, తమ కార్మికులను నిరుద్యోగులజేయుచుండిరి. ఇందువలన అమెరికాయందొక కోటిమంది, ఇంగ్లాండునందు యిరువదియైదులక్షలు, జర్మనీయందు నలుబదిలక్షలు, ఫ్రాన్సునందు పదునైదులక్షలమంది నిరుద్యోగులు దారితెన్నులేక యున్నారు. ఇక మనదేశపు కార్మికుల, దౌర్భాగ్యత లెక్కింపతరమా? వీరిని పోషణచేయు భారమెవ్వరిపైనున్నది? తాము కష్టించకల్గియుండి, కష్టించుటకు తయారైయుండినను, తమకుకూలివాని లేనప్పుడు తమకు జీవనాధారమును నొటుమాపకముగా నొసంగిన ప్రభుత్వము తమ్ము రక్షించవలెనని వారు వాదించుట న్యాయమే కదా? ఏ వాణిజ్యములైతే వ్యాపారము చురుకుగా నున్నప్పుడు, కార్మికుల కృషివలన లాభమొందినవో, ఆ వాణిజ్యములు ఈ నిరుద్యోగులపోషణచేయుభారము వహించుట ధర్మమని పౌరులెల్లరు కోరవచ్చును. కార్మికులకు ఆత్మరక్షణమొనర్చుకొనుట కర్తవ్యపరము కల్గుచున్నదికనుక, తాము అదృష్టదినములందు సంపాదించుకూలిలోనుండి కొంతధనమును తాము నిరుద్యోగులైయుండుకాలమున కుపయోగించుటకై వినియోగించవలసివచ్చుచున్నది. కనుకనే ఇంగ్లాండుదేశమందేర్పరచబడిన "నిరుద్యోగుల భీమా" నిధికి ప్రభుత్వము, యజమానులు, కార్మికులు సమానముగా ప్రతివారము తమతమరుసుముల చెల్లించుచున్నారు. ఈనిధినుండి నిరుద్యోగు

లైనవారికి భత్యము చెల్లించబడుచుండును. కాని ఆరు నెలల పర్యంతము ఈనిధికి తమ రుసుము చెల్లించిన కార్మికులే, వరుసగా ఇరువదియెనిమిది వారములవరకు భత్యము బొందవచ్చునను నియమము కలదు. అందుచేత అనేక వేలమంది కార్మికులు భత్యమును కూడ బొందలేక నిరుద్యోగమహామారినోటబడి క్రుమ్గుచున్నారు. అమెరికాయందింతమాత్రపు సదుపాయముకూడ లేదు. జర్మనీ, ఆస్ట్రేలియా, న్యూజీలాండులందు తప్ప ఈనిరుద్యోగుల రక్షించువిధానము తదితర దేశములందింతవరకైన యేర్పరచబడుట లేదు.

కార్మికులకు కర్మాగారము ఆదిగాగల కృషిచేయవలసిన స్థానములందు తమతప్పులవలన గాక విధివశమున కల్గు అపాయములకు వారికి, వారికుటుంబములకు యజమానులు నష్టపరిహారమిచ్చుటధర్మము. ఈసూత్రముకూడ ఇంగ్లాండునందే యంగీకరింపబడి ఇప్పటికన్ని దేశములందును ఆచరణ యందిడబడుచున్నది. కాని మనదేశమందీధర్మబద్ధముకాని వ్యాపారములు, వాణిజ్యములు, వృత్తులు ఎన్నోయింకను కలవు.

కార్మికులు, తమ కూలిద్వారా, తమతమకుటుంబములను, ఆనాటికానాటికి, పోషించుకొనుటే దుస్తరమగుచుండ వారు జబ్బుపడినప్పుడుగాని, వారిభార్యలు గర్భవతులైనప్పుడుగాని, వారు తగు ఆదరణ, పోషణ, ఔషధ

సేవబొందుట దుస్సాధ్యముకదా! ఈ బాధలు నివారించుటకై కార్మికులకొఱకు, వారి యజమానుల సహాకారముతో, ఇంగ్లాండు, జర్మనీ, ఆస్ట్రేలియా, న్యూజీలాండు, కెనడాదేశములందు, "ఆరోగ్యరక్షణాభీమా, చూలాలురక్షణాభిమా"లు ఏర్పరచబడుచున్నవి. మనదేశమునం దీసదుపాయము లెప్పటికోగదా కల్గించబడునది?

దేశపుటార్థికపరిస్థితుల ననుసరించి, ప్రతికూలివాడును దినమున కెన్నిగంటలకంటె హెచ్చుగాపనిచేయరాదో నిర్ణయించుట అగత్యము. అతనికి, కుటుంబపోషణచేయుటకు తప్పని సరిగా యెంతధనము, ఏ యేతినుబండారముల యెంతవరకు కొనగల్గినశకియున్నగాని, సాధారణకార్మికకృత్యముల చేయజాలడో నిర్ణయించి, ఆయాకాలములందు ఆచారమందున్న జీవితపథము ననుసరించి, "ప్రాథమికజీవితాధారపుపరిమితి" "Minimum standard of living" నిరూపించి, అంతకు మించిన జీతభత్యము లేయజమానులును చెల్లింపరాదను శాసనమును ప్రభుత్వముచేయవలెను. ఇట్టి నియమమును ఆస్ట్రేలియాప్రభుత్వ మేర్పరచినది; ఇంగ్లాండునందలి "ట్రేడుబోర్డులు" నిర్ణయించుచున్నవి. సింహాళపుప్రభుత్వము, మనదేశస్థులకిట్టి నియమరక్షణము కల్గించుచున్నది. మనదేశమందింక నెప్పటికో యీనియమ మేర్పరుచబడునది. మననేతపనివారు, వ్యవసాయకూలీలు, మొత్తముమీద, మనకైదీలకు ద

క్కుచున్న తిండిప్రమాణమునైన సంపాదించుకొనలేని దీన స్థితియందున్నారు. "ప్రాథమిక జీవితాధారపరిమితి"ని అన్ని దేశములు ఏర్పరచబడియుత్నించుచున్నవి.

ఒక్కపట్టణమందుగాని, కర్మాగారములందుగాని, కార్మికులెల్లరు చేరుచు, తమతమయావదరముల చర్చించుకొనుచు, తమ "ట్రేడు యూనియనుల" నేర్పరచుకొను నవకాశములులేక యున్నవారు లక్షలకొలది ప్రతిదేశమందును కలరు. ఇంగ్లాండునందు, మిషినులపై కుట్టుపనిజేయువారు, చాకిరేవులందు కష్టించువారు, తివాసీలు, టోపీలు చేయువారు, పాదరక్షలు చేయువారు, యిరువదిలక్షలమంది, స్త్రీపురుషులు, తమతమ "ట్రేడుయూనియనుల" నేర్పరచుకొనజాలక, యజమానులకు దాసానుదాసులై యున్నవారుచుండిరి. వీరిని రక్షించునిమిత్తమై "ట్రేడుబోర్డు" లను సంఘముల నేర్పరచి, అందు ప్రభుత్వము, కార్మికులు, యజమానులకు సమానస్థానమొసంగి, వానిద్వారా ఆయావృత్తులందలి కార్మికుల కెట్టికూలిరేటుల నేర్పరచవలెనో, వారి నేయేవిధముల యజమానులబారినుండి రక్షింపనగునో ఏవిధవృత్తులందలి కార్మికుల కెట్టి "ప్రాథమికజీవితాధారపుపరిమితు"ల నేర్పరచవలెనో ఆలోచించి, తగునియమముల నేర్పరచుచున్నారు. ఇట్టి కార్మికులు, కూలీలు, మన వ్యవసాయము, నేతపరిశ్రమ, బీడీలు, పుగాకుపరిశ్రమ, ఇత్తడికంచు పరిశ్రములు ఆది

గాఁగలవానియందు లక్షలకొలఁదిగా మన దేశమందున్నారు. వీరికిట్టి "బోర్డు"లగత్యమగుచున్నవి. వీనిని, ఇంగ్లాండు, ఆస్ట్రేలియా, న్యూజీలాండు దేశములందు ఏర్పరచుచున్నారు

ఈ "వేతనబోర్డు"లద్వారా యజమానుల ప్రతినిధులతోపాటు, కార్మికులప్రతినిధులు సమానప్రతిపత్తి బొందుచుందురు. అట్టియెడ, తమంతతాము, 'వేతనయూనియనుల' నేర్పరచుకొనగల్గిన కార్మికులను, యజమానులు, తమకు సమానులుగా గౌరవించి, వారి యుభయసంఘములమధ్య సహకారము, సమానప్రతిపత్తిద్వారా సాధ్యమగుటలో వింత యేమియుని మనము తలంచవచ్చును. కాని, ఇంగ్లాండునందు 1910 సంవత్సరమువరకు, రైల్వేయజమానులు, కార్మికసంఘప్రతినిధులను తమకు సమానులుగా జూడకుండిరి. మన దేశమందిప్పటికిని రైల్వేయజమానులు మన కార్మికనాయకుల గౌరవించుట లేదు, మన జమీందారులింకను, జమీందారీ రైతుసంఘప్రతినిధులతో సంప్రతించుట కంగీకరించుట లేదు. అమెరికాయందు దీనాటికి కార్మికులయొక్క "సమ్మె" జేయు హక్కును భంగపరచుటకు సుప్రీముకోర్టువారు తమ "ఇంజెంక్షను" అను యాయుధముద్వారా, సమ్మెల నాపుదలజేయుటయు, ప్రభుత్వము సమ్మెదారుల నిర్బంధించుచుండుటయు చూడనగును. ఆదేశపు యజమానులు, కార్మికుల 'సంఘముల' గుర్తించుటకే నిరాకరించుచున్నారు.

ఇన్ని సదుపాయములు కల్గుచున్నను, కార్మికులు కృషి చేయవలసిన కాలము పరిమితము కాకున్నచో, వారిని విసుగు విరామము లేకుండ, యజమానులు ఉపయోగించుటయు, తను బండారముల సంపాదించుటకై కార్మికులే, సంకుచిత భావు లై, హెచ్చుకాలము కష్టించుటయు, తద్వారా, వారి ఆరోగ్యము క్షీణించుటయు తటస్థించును. ఇటుల జరుగుటవలననే, ఇంగ్లాండునందు, వందసంవత్సరములక్రిందము, కర్మాగారము లందలి కార్మికులు పలువిధములగు జబ్బులపాలబడిరి. కనుకనే, దినమునకు ఎనిమిదిగంటలకంటె లేక పదిగంటలకంటె హెచ్చుకాలము కార్మికులు కూలివారై కష్టించరాదని వివిధ దేశములందు శాసనములు అంగీకరింపబడుచున్నవి. జపానునందు శాసనము నతిక్రమించి, కర్మాగారాధిపతులు తమ కూలీలచే పన్నెండుగంటలసేపు పనిచేయించుచుండుటవలన మన బొంబాయిమిల్లులకుండు యిబ్బందులు హెచ్చుగుట తటస్థించెను. అన్నిదేశములందును, కార్మికులు కష్టించదగు "వ్యవధి" ఒకేవిధముగ పరిమితమైనకాని, "స్పర్థ" 'పోటీ' పిచ్చిపొందిన యీప్రపంచమందే దేశమునకుగాని, తన కార్మికులు "కష్టించుకాలమును" తగ్గింపఁబ్రయత్నించుటకు సాధ్యము కాదు. "ఏడుగంటలు కష్టించుకాలము" బొగ్గుగనులకార్మికులకేర్పరచిన ఇంగ్లాండు, పదిగంటలు, తొమ్మిదిగంటల కాలముకష్టించు జర్మనుబొగ్గుగనులపనివాండ్రతో నాగలేక,

తేనుకూలివారి న్యాయసభకూడ ఎనిమిదిగంటలుచేసెను. ఎంత తక్కువకాలము కార్మికులు కర్మాగారములందు కష్టించవలసియున్న అంతచురుకుగా, చక్కగా వారు తమకు నిర్ణీతమైన పనిచేయుదురని అనుభవైక వేద్యము కనుక, మనదేశమందును ఈ "నియమితమగు కష్టించు కాలము"ను ఆచరణయందు బెట్టబ్రయత్నించుట మేలు.

V

కార్మికులు "సమ్మె" కట్టుటవలన యజమానులు కూలివారిని నిరుద్యోగులజేయుటవలన ప్రజలెల్లరకు అత్యంతముగు నష్టము కల్గుచుండుటయు దేశపుఆర్థిక స్వాస్థత భంగమొందుటయు వర్తక వాణిజ్యముల వృద్ధికి ఆటంకము సంభవించుటయేకాక నానాజాతులమధ్య విపరీతమగు "స్పర్థ" ఆర్థిక వ్యవహారములందుకల్గుచుండు దినములందు ఆయా దేశములకు అవిటితనమేర్పడుటయు తథ్యము. ఈయిబ్బందిని పోగొట్టుటకై ఆస్ట్రేలియాయందు "ఆర్థిక రాజీసంఘము" నేర్పరచి ప్రతివివాదముకూడ ఆసంఘమువారి తీర్పుప్రకారము పరిష్కారము కావలయునని శాసనము నిర్మింపబడెను. కాని ఇంతమాత్రమున వాణిజ్యములందు శాంతినెలకొనుట సాధ్యము కాదు. యజమానులకును కార్మికులకును మధ్యను సామరస్యత యేర్పడను. అమెరికాయందువలె కార్మికులు తమ నిర్ణీతమైన కృషిచేయవలసిన కాలముందేదో యొకవిధముగ కష్టించకుండ జాగరము చేయుట వివిధదేశములందును

నాచారమగుచున్నది. సమ్మెలు జరుగు సమయములందు యజమానులు పోలీసుల సహాయముకోరి కార్మికుల హింసించుచుండ వారు యజమానుల కర్మాగారము లాదిగాగల వానిని ధ్వంసమొనర్చుచున్నారు. ఈపద్ధతులవలన లాభ మిసుమంతయు లేకపోగా యజమానులకును దేశమునకును తుదకు కార్మికులకును తీరరాని నష్టము కలుగుచున్నది. సర్వకాలములందు ఇరుపక్షములమధ్య కల్గునిట్టి వైషమ్యములు తగ్గించుటకై వివిధప్రయత్నములు చేయబడుచున్నవి.

ఒకటి:— అమెరికాయందు ఫోర్డుపద్ధతిప్రకారము శాస్త్రోక్తముగా కార్మికులచే కృషిచేయించుచు వారికి తగినట్లు హెచ్చుకూలి నొసంగుచు చౌకగా నిండు భోజనపదార్థములు వారికి అమ్మించు వారిసహకారము బొందుట ఆచరణయందున్నది. శ్రీఫోర్డుగారు తన మోటారుకారు కర్మాగారమందలి కూలీలందరికి ప్రపంచమందె హెచ్చుటలేని కూలిచెల్లించుచు వారివలన మనఃపూర్వకమైన సహకారము బొందుచున్నాడు. ఆయనయొక్క ప్రతికార్మికుడును ఒకకారును కల్గి ఒకచిన్నయిల్లును కల్గి సాధారణసంసార సౌఖ్యముల సంపూర్తిగా పొందగల్గుచున్నాడు. కాని ఆ కార్మికులకు ఆర్థికస్వాతంత్ర్యము లేక ఫోర్డుగారిమాటయే వారికి వేదప్రాయముకాగా తదితరకార్మికులనుండి వారు వేరుపడియుండుట కార్మికలోకమునకు నచ్చుటలేదు.

రెండు:—కొందరు యజమానులు ఇంగ్లాండు, అమెరికా దేశములందు తమకంపెనీలలో కొన్నివాటాలను తక్కువవెలకు తమకార్మికులకు వాయిదాలమీద నిచ్చి వారిని కూడ తమకంపెనీలలో భాగస్వాములుగా చేయుచున్నారు. ఇంతమాత్రము చాలదని వీరిలో కొందరు కార్మికుల ప్రతినిధి నొక్కరిని తమతోబాటు డైరక్టరుగా నియమించుటకు సమ్మతించుచున్నారు. కాని కార్మికులనాయకుని డైరెక్టరుగా నియమించి వానిద్వారా కార్మికులకందరికి తమరహస్యములనన్నిటి తెలియజేయుట కిష్టపడక హెచ్చుమంది యజమానులు ప్రతివత్సరము వచ్చులాభములందు నియమితనుగు కొంతభాగమును కూలీలకు బహుమతిగా పంచియిచ్చుటకు సమ్మతించుచున్నారు. కాని ఈపద్ధతులన్నిటిద్వారా కార్మికుల "ట్రేడు యూనియనుల" నిర్బలత్వమొందించుటయే యజమానుల యాశయమని తలంచి కార్మికనాయకులు తమవారి నీపద్ధతుల నంగీకరింపవలదని సలహా నిచ్చుచుండుటచే ఇంతవరకే దేశమందును నూటకు పందకు ఐదుగురు కార్మికులైననీ "లాభములపంపిణీ పద్ధతిని" (Profit Sharing Method) అంగీకరించుట లేదు.

మూడు:—తమచే నిర్వచితమైన యేపద్ధతికి కార్మికులెల్లను ఒప్పుకొనరని తెలిసియే ఈకాలపుయజమానులనేకులు తమకార్మికుల ప్రీత్యర్థమై తమయందే దగుల్బాజు

చున్న ధర్మచింతకు సంతృప్తికల్గించుటకై శ్రీరౌన్‌ట్రీ, కాడ్‌బరీ, లీవరుహ్యూమ్, ఆల్ఫ్రెడ్‌మాండ్‌లను యింగ్లీషు యజమానులవలె తమకార్మికులకు ప్రత్యేకముగా ఆరోగ్యప్రదమగుగృహములునిర్మించి ఉద్యానవనములు చేసి, భోజనశాలలు కట్టించి వినోదార్థము పలయుసదుపాయములు కల్గించుచున్నారు. వారి యీప్రయత్నములద్వారా కార్మికులయెడ తమకున్న గౌరవాదరములు ప్రకటితమగుచున్నవి. మనదేశమందీ పద్ధతులందెద్దియు మనయజమానులచే అంగీకరింపబడుటలేదు.

నాల్గు:—యజమానులు తమంతతాము చేయుప్రయత్నములకు కార్మికులు సహాకారమొనర్చుచుండుటయు, ఈ యిరుపక్షములమధ్యను సహాకారముకల్గిననే జాతీయార్థిక సౌభాగ్యత వృద్ధిపొందుట కవకాశము కల్గుటయు గ్రహించియే ఇంగ్లాండు, జర్మనిదేశములందు ప్రభుత్వములే "యజమానుల కార్మికులసంఘము"ల నేర్పరచుచున్నవి. ఇంగ్లాండునందు ఈమధ్య మనదేశపు కార్మికపరిస్థితుల విచారించుటకు వచ్చిన కమీషనువారి అధ్యక్షుడగు శ్రీవిట్లీగారిచే ప్రతిపాదితమైన "యజమానుల కార్మికుల సంఘములు" ప్రతికర్మాగారమున కొక్కటిచొప్పునను ఒక వ్యాపారము లేక వాణిజ్యమునందొక్క జిల్లాయందలి సంఘములకొక కేంద్రసంఘము, దేశమందలి జిల్లాసంఘప్రతినిధులతో జేర్చి

ఒకజాతీయసంఘము యేర్పరచబడుచున్నవి. ఐతే జిల్లా జాతీయసంఘములందు ప్రభుత్వప్రతినిధులు తదితరపక్షీయుల తోబాటు సమానస్థానము బొందుచున్నారు. అటులనె జర్మనీయందును ఆర్థికసంఘములు ప్రతి కర్మాగారమునకు జిల్లాకు దేశమునకు ప్రతి వాణిజ్యమునందును, వ్యాపారము నందును ఏర్పరచబడియున్నవి.

ఈసంఘములద్వారా ఆయాకర్మాగారములందు యజమానులకు, కార్మికులకు మధ్యకల్గుచుండు భేదాభిప్రాయములు సమయునట్లు ప్రయత్నములు చేయబడుచుండును. కర్మాగారముల నడపుట కెట్టి నూతనమార్గములు అవలంబింపనగునో, కార్మికులు సూచింపవీలగును. కర్మాగారములందు తయారుకాబడు వస్తువులవలన వచ్చులాభనష్టముల విచారించుటకు యజమానులు కార్మికులు కర్మాగారముల యభివృద్ధి నిమిత్తమై తయారుకాబడు వస్తువుల నాణ్యత పరిమాణము హెచ్చుచేయుటకై ఏలాటిప్రత్యేకప్రయత్నములు చేయనగునో ఈసంఘములందు చర్చింపవచ్చును. జిల్లా జాతీయసంఘములందాయా వాణిజ్య వ్యాపారము లభివృద్ధిబొందుట కేయే కార్యకలాపము లవలంబించుటమంచిదో, కార్మికులకెట్టి జీతభత్యముల జెల్లింపనగునో, ఆయావర్తకములందుకల్గుచుండు లాభనష్టములందెంతెంత భాగము నేయేపక్షము వారెంతవరకు భరించనగునో తీర్మానించుట కీసంఘము లుపయోగపడ

వచ్చును. మరియు తమతమ వాణిజ్యము లభివృద్ధిబొందుటకై ప్రభుత్వ మేకార్యములు జేయనగునో ఈసంఘములు సూచింప వచ్చును.

ఇట్టిసంఘముల నేర్పరచవలసియున్నదని ఐర్లాండు, పోలాండు, చెకోస్లావాకియా రాజ్యాంగవిధానచట్టములు తమ యాశయముల తెల్పుచున్నవి.

జర్మనీయందు కాని, ఇంగ్లాండునందు కాని, తుదకీ సంఘములైనను, ఆర్థిక శాంతిని సమకూర్ప జాలవయ్యెను. తమకు యజమానులతో సమానమగు స్థానము కల్గినదను కార్మికులకు నమ్మకము కుదురదాయెను. డైరెక్టర్ల బోర్డులో తమ ప్రతినిధులు లేనంత కాలము ఆయా వాణిజ్యముల లాభనష్టపులెక్కలనన్నిటి మర్మము లేకుండ తమముందు యజమానులు నివేదించకుండుటచేత వర్తకవాణిజ్యములందు సంభవించులాభములందు తమకే ముఖ్యభాగము లేరుపరచుటకు యజమానులంగీకరింపకుండుటచే కార్మికులకు ఈసంఘములవలన కల్గు నుపయోగము కానరాదయ్యెను. కార్మికులేమాత్రము సంఘీభావముబొందక కార్మికసంఘము లింకను హెచ్చుగా నేర్పరుపబడక తుదకు "ట్రేడుబోర్డు"లైనను స్థాపించబడక అధోగతియందున్న మనదేశపు కార్మికులకిట్టి సంఘముల నేర్పరచుటవలన మేలేకల్గును.

## VI

ఈవిధముగ, యజమానులు చేయుచుండు ప్రయత్నములకు కార్మికులు సానుభూతిచూపెట్టకుండుటకుముఖ్యమగు కారణములు వేరుగలవు. ఈప్రయత్నము లిప్పటికి యేబది వత్సరములక్రితమే చేయబడియున్న, కార్మికులు వానిని కళ్ళకద్దుకొనెడివారే; కాని యుద్ధకాలమందు కార్మికులు తమ ప్రత్యేకవ్యక్తిత్వమును కన్గొనిరి. తాము సంఘజీవితమునకెంత యావశ్యకమైయుండిరో తెలుసుకొనిరి. తమ సహాకారమువలననే, తమ కృషిచేతనే తమత్యాగముద్వారాయే, యుద్ధము నడుపబడుచుండెననియు, జాతీయస్వాతంత్ర్యము నిలుపబడుచుండెననియు కార్మికులు కన్గొనిరి.

యుద్ధారంభమువరకు యజమానులు లేకుండినచో, ధనికులు లేకుండినచో, తమచేత సేవనియుకాదనియు, తాము ఆర్థికజీవితస్వాతంత్ర్యము బొందలేమనియు, కనుక, తమకు జీవనభృతి కలుగవలెనన్న యజమానులు, ధనికులు అగత్యమని పాశ్చాత్యదేశములందు కార్మికులు నమ్మియుండిరి. కాని యుద్ధకాలమందు అన్నిదేశములందును వివిధవ్యాపారములు వాణిజ్యములను యజమానులు నడుపజాలకుండుటయు, వానిని ప్రభుత్వములే వశపరచుకొని నడుపవలసివచ్చుటయు, తాము తమ “సమ్మె”లమాని ప్రభుత్వముతో సంపూర్ణముగా సహాకారముచేయవలసినయవసరము సంఘమునకు కల్గుటయు.

తాముకోరినకోర్కెలెల్ల సఫలమగుచుండుటయు జూడ కార్మికులెల్లరికి యజమానులన్న లెక్కలేకుండుటయు, తమ సంఘశక్తియన్న అత్యధికాత్మాభిమానము కల్గుటయు జరిగెను. కనుకనే యుద్ధానంతరము, ఇటలీయందు లోంబార్డి జిల్లాయందు కార్మికులెల్లరు కర్మాగారముల వశపరచుకొనిరి. జర్మనీయందు రాజ్యాంగమునే కార్మికులు తమవశ మొనర్చుకొనిరి. చెకోస్లావాకియా, జుగోస్లావియా, పోలాండు, ఆస్ట్రియా, హంగరీదేశములందు కార్మికులు, కర్షకులు, జమీందారులను తరిమివేసిగాని, ఏదోయొకవిధముగ నామమాత్ర నష్టపరిహారమిచ్చిగాని, పదభ్రష్టులజేసి వారిభూముల నాక్రమించుకొనిరి. ఇంగ్లాండునందును కార్మికకర్షక రాజ్యాంగము బొందిన రషియాపై దండెత్తుచున్న తమప్రభుత్వముతో సహాయనిరాకరణ మొనర్చి దానిని బెదరించి, రషియాపై బయలుదేరనున్న దండయాత్రను ఇంగ్లీషువారి కార్మికులు ఆపకల్గిరి.

ఇట్లు స్వశక్తియొక్క ప్రభావమును కన్గొన్నకార్మికులు యజమానులతో సమానస్థానము బొందుటకును, వారివ్యాపారముల లాభములలో నేదోకొంతభాగముతో సంతృప్తి బొందుటకును అంగీకరింతురా? శ్రీ కార్లుమార్క్సు, హిండ్మన్, ప్రిన్సుక్రోపాట్కిన్, లాసాల్లు వగైరా సాంఘికతత్వవాదులబోధ యెంతయుపయోగమైనదో, సత్యపథానుసంధాయకమైయున్నదో కార్మికులు కన్గొనిరి. వర్తకవాణిజ్యము

లన్నియు సాగుటకు, కార్మికులకృషియే మూలాధారమని యు, మెషినులుకూడ యొకప్పుడు కార్మికులచేతనే చేయబడుచుండెననియు, యజమానులు చేయుకార్యములు కార్మికులచే చేయబడవచ్చుననియు, యజమానులకుబదులు ప్రభుత్వమే వివిధవాణిజ్యముల వర్తకముల నడుపవచ్చుననియు కార్మికులు తలంచుచుండిరి. ఈ కాలపు జాయింటుస్టాకుకంపెనీలయందు, ధనము పెట్టువారి కేమాత్రపు పెత్తనము లేకుండుటయు, డైరక్టరులనుండి మిగతా యజమానులందరికి జీతభత్యములు నిర్ణయింపబడి, వారు వాటాదారులనుండి చాలవరకు వేరైయుండుటచే, వారందరిని ఇప్పటివలె వాటాదారుల యాజమాన్యమున నుంచుటకుబదులు ప్రభుత్వపుపెత్తనముక్రిందనే యుంచనగును. వాటాదారులు, వర్తకవాణిజ్యములందుపయోగించుధనమును ప్రభుత్వమే పెట్టుబడిపెట్టుచు, తనకు, అంగులకై, అగత్యమగుధనమును, ప్రజలనుండి తాను అప్పుగాగొనుటకు ప్రభుత్వమునకు సాధ్యమగుననియు వారు నమ్ముచుండిరి.

ఇప్పటివలె, వాటాదారులు, తమకంపెనీలందు కల్గుచుండులాభములనన్నిటి తామే పొందుటకుమారు, ఆలాభమంతయు, సంఘీయులెల్లరికై యున్న ప్రభుత్వము సంపాదించును. ఇప్పటికంపెనీలయందలి వాటాదారులలో ఎప్పుడైన నష్టమువచ్చునేమో యనుసందియమునకు తయారగువారు.

కొద్దిమంది కనుక, తుదకు వారికైనకలుగనుండు ఆపద చాలతక్కువ కనుక, ప్రభుత్వము వివిధవ్యాపారముల నడుపబ్రయత్నించినంతమాత్రమున నష్టమేమాత్రము కలుగదని కార్మికులు విశ్వసించుచుండిరి.

మరియు, యజమానులీకాలమున, ఎంతహెచ్చుగా తముచే తయారుకాబడువస్తువుల తయారుచేసి, చౌకగానమ్మిన నెంతలాభము సంఘమునకు కల్గునో ఆలోచించుటకు మారు, ఏవిధముగ తమువస్తువుల తయారుచేసి, అమ్మిచో తమ కెక్కుడులాభము కల్గునా యని విచారించుచుండెదరు. కనుక, వారిపెత్తనమును రూపుమాపుటె సంఘలాభమునకు గత్యంతరము. యజమానులు స్వలాభమే విచారించుచుండ ప్రభుత్వము ప్రజలమేలు కోరుచుండును. ప్రభుత్వమే కనుక వివిధవ్యాపారముల నడుపుచుండుచో, లాభములమాట యటుంచి, ప్రజల కేవిధములగువస్తువు లెంతవరకు, ఎంతచౌకగా తయారుచేసి అమ్మిన దేశోపయోగకరమో విచారించుచుండును. ప్రజలమేలే ప్రభుత్వము గణించుచుండును. స్వంతమేలే యజమానులాలోచించెదరు. కార్మికులవిషయమందును, యజమానులు వారినుండి ఏవిధముగనైననేమి హెచ్చు 'కృషి' బొందుటయే గత్యంతరమనుకొనుచుండ, ప్రభుత్వము, తనక్రింద కృషిచేయుకార్మికుల మంచిచెడ్డలశ్రద్ధమై విచారించుచుండును.

ఈదినములందు, యజమానులకు, కార్మికులకు సంఘర్షణకల్గుచుండుటయు, తన్మూలమున నిరుపక్షములకు, దేశీయులకు నష్టముకల్గుచున్నది. ప్రభుత్వమే యీవ్యాపారముల నన్నిటి నడపుచో, కార్మికులు తాముసంఘసేవచేయుచున్నామను భావముకల్గి, తమ సాధకబాధకముల విచారించుటకు ప్రభుత్వము తగు శ్రద్ధతీసుకొనుచుండు ననునమ్మకముకల్గినవారై, తాము సంఘనిర్మాణమందు ముఖ్యులై యుంటిమను అభిమానముకల్గి 'సమ్మె'లమాని, తమశక్తికొలది కష్టించి, ఆర్థికసంపదనభివృద్ధికల్గించుటకు తయారగుదురు.

మరియు యిప్పటియజమానులపెత్తనము సాగుటవలన వేలకువేలమంది, ప్రజలకు చెందవలసినధనమును, కోట్లకొలదిగా లాభములు బొంది, ఆధనమును ప్రజావసరములకై ఖర్చిడక, దాచియుంచుటకో లేక మిల్లులువగైరాలు కట్టించుటకో యుపయోగించుచుందురు. ఇందువలన ప్రజలు తిండికై అలమటించుచుండ, ధనికులు మెషినులజేర్చుచుందురు. కాన, ధనికులు తయారుచేయువస్తువుల కొనువారులేకుండుటయు, వస్తువులుకోరు కార్మికులకు ధనములేకుండుటయు, తన్మూలమున ఆర్థికమాంద్య మేర్పడి, సంఘవిచ్ఛేదనము బయలుదేరుట తప్పదు. కనుకనే ఈశతాబ్దపు "ఆర్థికసంక్షోభములు" తీవ్రరూపము దాల్చుచున్నవి. యజమానులపెత్తనముపోయి, ప్రభుత్వమే ముఖ్యమగువాణిజ్యముల నడపుచో,

ధనికుల హస్తములలోనికి లాభములు పోకుండుటయు, ప్రజలందరికి ఆవాణిజ్యమువలనకల్గు లాభములు చేకూరుటయు, అందువలన, ఆర్థిక సంక్షోభముల తీవ్రితమైన తగ్గుటయు సాధ్యముకాగలదు.

అయితే వివిధకంపెనీలు వాని వ్యవహారములవలన కల్గులాభములందు భాగముబొందకల్గువారిచే నడుపబడుచున్నవి కాన, చాలజాగ్రత్తగను, శ్రద్ధగాను సాగించబడుచున్నవి. కాని, ప్రభుత్వముచే నవియెల్లను, జీతభత్యములుమాత్రము బొందు నుద్యోగులచేత నడుపబడుచో నష్టముకే కల్గించుచుండుననియజమానులప్రతినిధులు వాదించుచున్నారు కాని ఈకాలపుకంపెనీలనడపువారిలో హెచ్చుమంది యజమానులనబడువారికి ఆకంపెనీలలాభములందు భాగమే లేకున్నది. మరియు తమకు ప్రత్యేకలాభము లేవియు లేకున్నను తాము సంఘసేవయందు తత్పరులమై యుంటిమను నుత్సాహము కల్గియుండు ప్రభుత్వోద్యోగులు, యజమానులవలెనే, శ్రద్ధాళులై నమ్మకస్థులై వ్యాపారములనడుపగలరని సహకారపరపతిసంఘవ్యవహారములు మనదేశమందును, జర్మనీయందును, కొనుగోలుసహకారసంఘములు, జర్మనీ, ఇంగ్లాండునందును నిరూపించుచున్నవి.

ఇప్పటికిని, యజమానులవశమందేయున్న వర్తకవాణిజ్యములకు వలయు గుమాస్తాలు యజమానులు, తదితర

ఉద్యోగులనేర్పాటుచేయు పద్ధతులుచాల అసంతృప్తికరముగానున్నవి. కాని ప్రభుత్వోద్యోగీయుల నియమించు నేర్పాటులు ఇంగ్లాండు, జర్మనీ, తుదకు ఫ్రాన్సునందు ఎంతో ఆదర్శప్రాయముగనున్నవి. జర్మనీయందును, ఫ్రాన్సునందును, కార్మికులుకోరకనే సాంఘికవాదులు బలవంతపెట్టకనే, ప్రభుత్వము రైల్లు, రహదారులు, కాలువలు, హార్బరులు, పోస్టాఫీసు, టెలిగ్రాఫు, కేబిలు వ్యవహారములను సాగించ మొదలిడెను. స్థానికప్రభుత్వసంస్థలు తమప్రజలకువలయు నీటిసప్లై, ఎలెక్ట్రికుసప్లై, ట్రాంబండ్లు, పాలసప్లై, రొట్టెసప్లై ఆదిగాగల వ్యాపారముల తమంతతామే నడుప మొదలిడినవి. మనదేశమందును మనప్రభుత్వము రైల్వేలగూడా స్వయముగా నడుపబూనుకొనుచున్నది. ఈవ్యవహారములనన్నిటి ఆదేశములందు ప్రభుత్వోద్యోగులు చాలసంతృప్తికరముగా జయప్రదముగా సాగించకల్గుచున్నారని ఎల్లరంగీకరించు చున్నారు. ఇటులనే ఇంగ్లీషువారిస్థానికసంస్థలును ఆస్ట్రేలియాయందలిప్రభుత్వమును వివిధవ్యాపారముల స్వయముగా సాగించుచున్నవి. యుద్ధకాలమునందు అన్నిప్రభుత్వములు అనేకముఖ్యములగు వర్తకవాణిజ్యములను చురుకుతనముగా సాధారణయజమానులకంటె లాభకరముగా నడపినవని ఆకాలపువ్యవహారములగాంచి పిమ్మట గ్రంథములవ్రాసిన ఆర్థికశాస్త్రవేత్తలే యంగీకరించుచున్నారు.

ఐనను అన్ని వ్యాపారములును, వాణిజ్యములును ప్రభుత్వమే తనంతతాను నడుపబూనుటవలన లాభమంతగా కలుగకపోయినను నష్టముకల్గునేమోయను సంశయము అనేకులకు కలదు. సాధారణధనికులు యజమానులెట్టివ్యాపారముల సాగింపదలచరో, ఏవ్యాపారములు జాతీయజీవిత స్వాతంత్ర్యమున కత్యవసరమో, ఏవ్యాపారములు యజమానుల హస్తములందుండుచో వానివలన ప్రజలకు లాభము కల్గుటకు మారుగా నిస్సారతయేర్పడునో, వానినే ప్రభుత్వము నడుపజూచుట మేలని అనేకులయభిప్రాయమై యున్నది. రైల్వేలు, కాల్వలు, రహదారులు, పోష్టు, టెలిగ్రాఫు కేబులు, బ్రాడుకాస్టింగు, అడవులు, ఎలెక్ట్రికు సప్లై, బొగ్గుగనులు సాధారణముగా ప్రభుత్వయాజమాన్యముక్రిందనే యున్నలాభమని ఎల్లరంగీకరించుచున్నారు. అటులనే బాంకులును, భూమియు, వస్త్రపరిశ్రమయు, యినుపసామానుల పరిశ్రమయు ప్రభుత్వవశమగుట మేలని అనేకులు వాదించుచున్నారు.

రషియాయందు అన్నివాణిజ్యములు ప్రభుత్వపుయాజమాన్యముక్రింద నుండుటవలన వాణిజ్యాభివృద్ధి కల్గుటయు వస్తునిర్మాణము హెచ్చుగా సాధ్యమగుటయు జూచుచున్నాము. ఉద్యోగులు లంచగొండులుగాక చల్లగా మెల్లగా నడచుకొనువారుగాక, ముందుచూపుకల్గి త్వరితగతి తమకుసంబంధం

చిన వాణిజ్యముల వృద్ధిజేయ నాదేశమందు బ్రయత్నించుచున్నారు. మరియు తదితర దేశములందు నిరుద్యోగబాధ కల్గుచుండ అచ్చటట్టిదేమియు లేకపోగా తదితర దేశములందు దేశమునకంతకు ఒక్క సంవత్సరమువరకైన "ఆర్థిక పునర్నిర్మాణ కార్యక్రమము" నేర్పరచుట యసాధ్యమగుచుండ అచ్చట ఐదువత్సరముల ఆర్థికపునర్నిర్మాణకార్యక్రమము ఆచరణయందిడబడి సంపూర్తిగావింపబడుచున్నది. కనుక ప్రభుత్వపు యాజమాన్యము ఆర్థికజీవితమందు హెచ్చుట ప్రజాశ్రేయోభివృద్ధికారకమని చెప్పుటకు సందియ ముండనక్కర లేదు.

VII

ఈపరిశ్రమల నడపుటలో ప్రభుత్వమెట్లు కార్మికులతో సామరస్యము నెరపుట? యని సందియము కలుగవచ్చును. "యజమానులు, కార్మికుల సంఘము" లకు బదులు "ప్రభుత్వము, కార్మికులసంఘము" లు ప్రతికర్మాగారమునకును ప్రతిజిల్లాకును తుదకు దేశమునకంతకు ప్రతివాణిజ్యమునకును ఏర్పరచవలెను. ఈసంఘములద్వారా కార్మికులు తమకుతోచిన సలహాలను తమతమ వాణిజ్యాభివృద్ధి కై చేయుచుండవచ్చును. వాణిజ్యపులెక్కలనన్నిటిని జాతీయసంఘమునందు ప్రభుత్వోద్యోగులు నివేదించెదరు. ఆసంఘమువారు మంచిచెడ్డలాలోచించి సభ్యసంఘముల సలహాల ననుసరించి తమవాణిజ్యాభివృద్ధి కెట్టిసదుపాయముల కల్గించవలె

నో తమ కార్మికులకే యేసదుపాయముల వృద్ధిజేయువలెనో తీర్మానించవలయును. ఈ సంఘతీర్మానములను ప్రజాభిప్రాయము ననుసరించి తగినట్లు సవరించి ఆచరణయందు బెట్టు భారము ఆయా వాణిజ్యమునకుగా నేర్పాటుపబడిన మంత్రిపై కలదు. సాధారణముగా ఈసంఘమందలి ప్రభుత్వపు ప్రతినిధులు శాసనసభాసభ్యులై యుందురు కనుక ఈసంఘతీర్మానములు ఆసభవారిచే అంగీకరింపబడుట సహజము. మంత్రిగారి నియమములను, అనుభవమున దేయేజిల్లాలయం దెట్టెట్లు పెట్టటో తీర్మానించుటకు జిల్లాసంఘము లుపయోగించును. అటులనే తమకర్మాగారమునకు విధించబడిన కార్యమును సాధించుట కెట్టిప్రయత్నముల జేయనగునో కర్మాగారసంఘము తీర్మానించును. కర్మాగారమును నడపు నుద్యోగినుండి వింగతా యుద్యోగులెల్లరు "ప్రభుత్వార్థిక సర్వీసుకమీషను" వారిచేత నడుపబడతగినట్టి పరీక్షలందు త్తీర్ణులైనవారై యుందురు. వీరు ఉద్యోగములందు యున్నప్పుడు ఉద్యోగులకు ప్రమోషను కల్గించునప్పుడు కర్మాగారపు జిల్లాసంఘముల సవరణబొందవలెను. కర్మాగారపుటుద్యోగి సాధ్యమైనంతవరకు తన కేర్పరచిన సలహాసంఘమువారి సలహాల ననుసరించియే తన కార్యమును సాధించవలసియుండును. కర్మాగారమునందు కార్మికులెట్లు ఏ నియమముల ననుసరించి తమ ధర్మముల నిర్వర్తించ

వలెనో, ఈసంఘము కర్మాగారాధిపతి సహాయముతో నిర్ణయించును. వీరిద్దరిమధ్య భేదాభిప్రాయముకల్గుచో జిల్లాసంఘమునకును, అవసరమగుచో జాతీయ సంఘమునకును, అప్పీలుచేయుటకు కర్మాగారకలహాసంఘమునకును, కార్మికులకును హక్కుండవలెను. ఇట్టి సలహాసంఘములు, కార్మికుల సంఘములు యేర్పరచిన రషియా ప్రభుత్వము తనయనుభవమున కార్మికులు వస్తునిర్మాణమునకంతగా త్వరపడి సహాయము చేయుట లేదని, ఈమధ్య కర్మాగారపుఉద్యోగులకే నిరంకుశాధికారమొసంగి కార్మికుల సలహాసంఘముల హక్కులతగ్గించుచున్నది. ఈమార్పుంతయు దురదృష్టకరమైనది. వస్తునిర్మాణము కొంచెము మందగించినను వాణిజ్యాభివృద్ధికవసరమగు కార్యములననుసరించుటకు అందరిసమ్మతిగొనుటకొంచెము కష్టతరమైనను కార్మికులసహాకారముతోడనే ప్రభుత్వము ఏదేశమందైనను తనవాణిజ్యములనభివృద్ధిచేయుట మేలు. కర్మాగారములందు కష్టించు కార్మికులు స్వప్రతిభకల్గి స్వయంశక్తికల్గి స్వతంత్రాలోచనకల్గియుందురు. వారికితాము తమవృత్తియందలి కార్యక్రమమునందు పాలుపుచ్చుకొనుచున్నామను ఆత్మవిశ్వాసము లేకుండుచో తమశక్తికొలది హృదయపూర్వకముగ కష్టించరు వారిపై యజమానులు కాని, ప్రభుత్వముకాని నిర్బంధము ప్రయోగించినగాని లక్ష్మీప్రభావము ప్రయోగించిగాని లాభములేదు. కార్మికులకు ఆత్మ

సంతృప్తికల్గు నేర్పాటులు చేయవలెను. తమవృత్తియందు తాము ప్రాధాన్యులమను భావము వారికి కల్గించవలెను.

ఇట్టివాణిజ్యములందు ప్రభుత్వములు లాభములు బొందగోరవు. ప్రజలశ్రేయోభివృద్ధియే వానియాశయము. వానియందలి కార్మికుల సాంఘికార్థిక సంతోషాభివృద్ధియే ప్రభుత్వపుముఖ్యధర్మమైయున్నది. వీరిసమృద్ధిపరచుటకై, వీరికిసంతృప్తి కల్గించుటకై యిట్టిప్రభుత్వయాజమాన్యము యేర్పరుపబడుచున్నదో, అట్టిప్రజలయందధికసంఖ్యాకులగు కార్మికులకు గౌరవనీయమగు జీవితమునడప్పుకొను నవకాశములు తనచే నడుపబడుచుండు వాణిజ్యములందు ప్రభుత్వము కల్గించుచుండుట ధర్మము కనుక మనదేశపు ప్రభుత్వము తనరైల్వేలను ఇంగ్లీషుకంపెనీలయాజమాన్యమునకిచ్చుటయు, మనకార్మికులకు ఆయాజమానులు సమానగౌరవప్రతిపత్తులుకల్గించకుండుటయు, కార్మికులశ్రేయోభివృద్ధికి ప్రభుత్వముకాని, కంపెనీలుకాని శ్రమించకుండుటయు కార్మికుల సంఘాలను అంతస్థులన్నిట నంగీకరించకుండుటయు, ధర్మవిరుద్ధమైయున్నది. కనుకనే ఇప్పటికిని కొన్నికంపెనీల పెత్తనమున నష్టములు కల్గుచుండుటయు ప్రభుత్వము వానికి నష్టపరిహారము చేయుచుండుటయు తటస్థించుచున్నది.

మనదేశమందు ప్రభుత్వము ఉప్పును, సారాయమును, గంజాయిని ప్రత్యేకముగా తానే తయారుచేయుచున్నది కాని

ఆ యీరా వాణిజ్యములందలి కార్మికులకేమాత్రము సభ్యతకల్గించుట లేదు.

ఇప్పటికే ధనికులయు యజమానులయు వశమందున్న రైల్వేలువగైరా వాణిజ్యములను ప్రభుత్వము వశపరచుకొనవలసియున్నది. ఇందులకై రషియా ప్రభుత్వమువలె ఇప్పటి వాటాదారులను, యజమానులబలవంతముగా పదభ్రష్టులజేయుట సంఘశాంతికిభంగకరము. కాని మనప్రభుత్వమువలెనే పేరుమాత్రమునందు ప్రభుత్వమట్టివాణిజ్యముల వశపరచుకొనజూచుచున్నదని తెలియుటబట్టి, పెరిగియున్న ధరలప్రకారము వాటాదారులకు నష్టపరిహారమిచ్చి వశపరచుకొనుట దేశపుటార్థికస్వాస్థ్యమునకు భంగకరము. కాని బాల్కనురాష్ట్రములందు జమీందారుల భూములను న్యాయమగు ధరలకు ప్రభుత్వమెట్లుకొనునో, అటులనే వాటాదారులకు వందరూపాయలపేరువకు నలుబదో, ఏబదో యిచ్చి వాణిజ్యవ్యాపారముల వశపరచుకొనుట మంచిది.

ఈ వ్యాపారములేకాక జనసామాన్యపు టవసరములకు సంబంధించిన వస్త్రములు, కాయగూరలు, బియ్యము, పప్పు, నూనె, నెయ్యి, మిరపకాయ, ఉప్పు, సుగంధద్రవ్యములు, పసుపుకుంకుమవగైరా వస్తువుల విక్రయించుటలో ప్రభుత్వము జోక్యముకల్గించుకొనుట ఈదినములందంతగా లాభసాటిగాదు. పాశ్చాత్యదేశములందే ఈ వ్యాపారములందు

ప్రభుత్వము అంతగా సంబంధము కల్గించుకొనుచుండుట లేదు. కాని "రాచ్ డేల్" అను పట్టణపుకార్మికులు కొందరు ఇప్పటికి ఎనుబదివత్సరములక్రింద కనిపెట్టిన పద్ధతిప్రకారము "వస్తువిక్రయసహకారసంఘము"ల నేర్పరచి వానిద్వారా ఈవ్యాపారములన్నిటిని ప్రజలవశ మొనర్చిరి. ఇంగ్లాండు నందిప్పటికీ వ్యాపారములందు బాదాపువాల్గవభాగము ఈసంఘములవశమైనది. జర్మనీ, ఇటలీ, స్విట్జర్లాండు దేశములందు నిట్లే ఈసంఘములు ప్రాముఖ్యతవహించుచున్నవి. మనదేశమందు ప్రశిద్ధికెక్కు స్తోర్సు మినహా గణనీయమగు ప్రయత్నములింకను చేయబడుటలేదు. ఈమధ్యమాత్రము మద్రాసు, కలకత్తా, బొంబాయి, పూనాపట్టణములందు "పాలవిక్రయసహకారసంఘము" లేర్పరుపబడినవి. ఈసంఘములద్వారా వస్తువులకొనదలచిన ప్రజలెల్లరు, ఆయావస్తువుల నిర్మించినకార్మికుల నుండి నేరాసరిగ కొనితమలో తమయవసరముల బట్టిపంచుకొందురు. అందువలన సాధారణముగా వర్తకులకు చెందులాభములు ప్రజలు చెల్లింపనక్కరలేదు. ఇంగ్లాండునందలి సంఘములన్నియు గ్లాస్కోలో నొక్క కేంద్రదుకాణమును, మాంచెస్టరులో మరొక్క కేంద్రదుకాణము నేర్పరచి ఆదుకాణములద్వారా "వస్తునిర్మాణశాఖ"ల నిర్మించి వివిధదేశములందు భూముల సంపాదించి కార్మికజనమునకు వలయు వివిధసాంసారికవస్తువుల నన్నిటిని తమ వేలకొలదిగానున్న సంఘములద్వారా అమ్ము

చున్నవి. తదితర వ్యాపారస్థులెట్టి వెలలకమ్ముచుందురో ఆధర లకే తమవస్తువులను తమసభ్యులకు విక్రయించి ఆఱునెలల కొక్కమారు లెక్కలుసరిజూచి మిగిలియున్న ధనమునుండి ఎవ్వరెవ్వరెంతధనముపెట్టి వస్తువులకొనిరో అంతకుసరిపోవు నట్లుగా భాగములుపంచియిచ్చుట యీసంఘమునందు ఆచారమైయున్నది

గ్రామమందలి సంఘమునకు సంఘీయులెల్లరు తమ పంచాయితీదారుల నెన్నుకొందురు. ఈపంచాయితీయే సభ్యుల కగత్యమగువస్తువులను కేంద్రదుకాణము, దానియుప సంఘములనుండి తెప్పించి, అమ్ముచుందురు

ఈగ్రామసంఘమునుండి జిల్లాసంఘమునకును, జిల్లా సంఘమునుండి కేంద్రదుకాణసంఘమునకు ప్రతినిధుల పంపుట, ఇంగ్లాండునందును, తదితరదేశములందును వాడుకయై యున్నది. ఇప్పటివరకీమహోద్యమము కార్మికులవశమై యుండుటచే, శ్రీలార్డు పాస్మోరు శ్రీసిడ్నీ వెబ్బుగారు, సాధారణవ్యాపారములనన్నిటిని ప్రభుత్వమే వశపరచుకొని, ఇట్టిసంఘములద్వారా వానిని నడుపబ్రయత్నించుట మేలని వాదించుచున్నారు. వారివలెనే పారిసునగరమందలి ఆర్థిక శాస్త్రజ్ఞుడును, ఈ సంఘముల నిర్మాతయు నగు ప్రొఫెసరు జీడుగారును ప్రచారము చేయుచున్నారు. ఇంతవరకు యుద్యమమునకు కలిగినజయము గాంచ, ప్రభుత్వమే ప్రజ

లకు వలయు జీవితావసరవస్తువులనన్నిటిని రషియా యందు వలెనే అమర్చుటకు ప్రయత్నించుటమే లేకాక సాధ్యమనియు తోచుచున్నది.

ఈ యుద్యమము సంపూర్తిగా ఆయా వ్యాపారముల వారు గ్రహించినప్పుడు కూడను, లేక ఈ వ్యాపారములనన్నిటిని ప్రభుత్వమే వశపరచుకొన్నప్పుడును కార్మికులకు తదితర ప్రభుత్వపు వాణిజ్య నిర్వాహణాము దెట్టిసభ్యత కలుగుచుండునో, అట్టి స్థానమే ప్రసాదించబడుట యుక్తము. మరియు "వస్తు విక్రియసంఘము"ల ద్వారాయే యీ వ్యాపారములు నడపుచు రకు, ఆసంఘముల చేత నియమింపబడు కార్మికులకు వివిధసంఘముల పంచాయితీల యందు సగి భాగపుస్థానముల నిచ్చుట ధర్మము. ఏ కార్మికుల లాభముసకై, యజమానుల పెత్తనమును రూపుమాపుటకై, కార్మికులకు ఆర్థిక స్వాతంత్ర్యము ప్రసాదించుటకై, ఆర్థిక జీవితమందును ప్రజాస్వామ్యము కల్గించుటకై ఈ సంఘము లేర్పడుచున్నవో, ఆ యాదర్శములు ఫలితము బొందవలెనన్న, వస్తువుల నిర్మించువారును, వస్తువుల నుప యోగించువారును ఈ సంఘములందు సమాన ప్రతిపత్తి అన్ని విషయములలో కూడ పొందవలసియున్నది. ప్రభుత్వము, యజమానులెల్లరు తమ కార్మికులయెడ నెరపవలసిన ధర్మముల నిర్ణయించుటతోడనే, వాటిని సంపూర్తిగా, మనఃపూర్వకముగా యీ సంఘము లాచరించుట యుక్తము.

మన దేశమం దీదినములందు, సహకారపరపతిసంఘోద్యమము అత్యున్నతస్థాన మాక్రమించుచున్నది. ఇందు కార్మికులు, లేక ఉద్యోగు లనబడెడువారు చాల నల్పసంఖ్యాకులు. కనుక, వీరి కెట్టిపెత్తనము ఈయుద్యమము నడపుటలో కల్గించవలె ననుసమస్య యంతగా కల్గుట లేదు. కాని వీరి యనుభవము నుపయోగించుకొనుటకై, రాష్ట్రీయసహకారసంఘమునందు వీరికి కొన్నిస్థానముల నొసంగుట యోగ్యము. గ్రామపంచాయితీలు జిల్లాబాంకులయందును, జిల్లాబాంకులు రాష్ట్రీయబాంకులందును ప్రాతినిధ్యత బొందియున్నవి. కో-ఆపరేటివ్ డిపార్టుమెంటు వారి కీయుద్యమముపై, కొంతపెత్తనముండుట యుచితము.

ఈ రెండువిధములగు వ్యాపారవాణిజ్యములు లేక, మిగిలిన ఆర్థికజీవితమునకు సంబంధించిన వ్యాపారములందు ప్రభుత్వము తానంతతానే అన్ని కార్యముల నెరవేర్చుటకు ప్రయత్నించుటకు మారు ఇప్పటివలెనే వివిధయజమానులచే అయ్యవి నడుపబడుట కవకాశమిచ్చుట మేలు. జమీందారులనుండి భూములను ప్రభుత్వము సంపాదించిన పిమ్మట, వానిని సేద్యము చేయుటకుగా రైతుల కొసంగుటయే మేలు. అటులనే అనేక చిన్నచిన్న వ్యాపారములు వివిధయజమానుల వశమందుంచుటే మంచిది. కాని, ఈ రైతులు, ఆయజమానులు, తమతమ కార్మికులనెల్లర యోగ్యతతో

జూచుచు జీవితార్థము వలయు కూలినాలి చెల్లించుచు, కార్మికుల సహాకారము సంపూర్ణముగా పొందుచుండునట్లు జాగ్రత్తపడవలసి యున్నది. ఇందులకుగాను, మన దేశమందు, "శ్రమబోర్డు"లను స్థాపించి, కార్మికుల కెట్టిజీతము లివ్వదగునో నిర్ణయించి, యజమానులెల్లరు తమ కార్మికుల జీతములు చెల్లించునట్లుచేయుట ప్రభుత్వపు ధర్మమైయున్నది. కార్మికుల విద్యాభివృద్ధికి, సాంఘిక స్వాతంత్ర్యమునకు, ఆర్థిక సంపదకు యజమానులెల్లరు వారివారిశక్తులకొలది సహాయపడునట్లు, ప్రభుత్వము భద్రతబొందవలసియున్నది. ఈ వ్యాపారములందు తనధనమును పెట్టుబడినిడి తమ్మె యిచ్చువాటాదారుల హక్కుల రక్షించుటకు ప్రభుత్వము తగు శ్రద్ధచేయవలెను. ఇట్టికంపెనీలయొక్క డైరక్టర్లబోర్డులో సగముమంది డైరక్టరులు, కార్మికులు, తదితరయుద్యోగుల ప్రతినిధులై యుండుటమేలు. ఈవిధముగ ధనికులవశమందే యుంచబడు వ్యాపారములు ప్రజాసామాన్యముయొక్క ఆర్థికాభివృద్ధికి భంగముగా నుండునట్లు ధనికులగు వాటాదారులు ప్రయత్నించుచో, ఆప్రయత్నముల భంగపరచవలసిన బాధ్యత ప్రభుత్వముపై కలదు. ఇందులకుగాను డైరక్టర్లబోర్డునందలి కార్మికులప్రతినిధులు ప్రభుత్వమును తగు విచారణచేయవలసినదిగా కోరుచో, ఆవ్యాపారమును సమగ్రముగా ప్రభుత్వము విచారించుట తగవు.

ఈవిధముగా ప్రతి వ్యాపారమును నియమబద్ధమొనర్చి కార్మికుల హక్కుబాధ్యతల నిర్వచించి కార్మికులయొక్క సహకారము ఏయే సంస్థలద్వారా వాణిజ్యవ్యాపారముల నిర్వహణమందు సంతృప్తికరముగా బొందనగునో నిరూపించి కార్మికులకు జాతీయ ఆర్థికజీవితమందు యజమానులతోపాటే కాక ప్రభుత్వముతోపాటు సమానసభ్యత బొందుటకవకాశములు కల్గించుటకు ప్రభుత్వము పూనుకొనవలసియున్నది. ప్రభుత్వమిట్లు ఆర్థికజీవితమంతను ధర్మబద్ధమొనర్చుచో కార్మికులకు తమతమవృత్తులందు గౌరవాదరములు కల్గి కష్టించవలసిన వ్యవధియందు వారు హెచ్చుఉత్సాహముతో కష్టించుటయు సాధ్యమగును. ఆర్థికాభివృద్ధి త్వరితముగ కల్గుటయు భాగ్యాభివృద్ధి పెంపొందుటయు ప్రతి కార్మికుడును ఆర్థికజీవితమందును స్వతంత్రుడై హక్కుబాధ్యతల కల్గిన ప్రత్యేకవ్యక్తియై తనవృత్తియందున్న, తనయుద్యోగమున్న, తనకర్మాగారమున్న ప్రేమకల్గినవాడగుటయు సాధ్యము. అప్పుడే, కార్మికులు తమకు నిర్ణయింపబడిన వస్తునిర్మాణమందు తమ శక్తియుక్తులను, కళానైపుణ్యమును, బుద్ధికుశలతను, ప్రకటించుట కుత్సాహులయ్యెదరు. అప్పుడే, కార్మికులు సర్వాంగసౌష్టవము బొందని సంపూర్ణమగు లక్షణములు బొందని కార్యమును చేయకుందురు. అప్పుడే వెనుకటి కాలపు కార్మికులు తమ కృత్రిమకార్యములందు అభిమానము కల్గియుండినట్లే కాలపు

వారును తమవృద్ధియన్న గర్వపడగల్గుదురు. టాజ్ మహాల్ నిర్మించినవారు, అజంతా ఎల్లోరాచిత్రముల వ్రాసినవారు, మధుర, కంచి, రామేశ్వరపుదేవళముల నిర్మించినవారు, ఆన కట్టలగట్టినవారు, పట్టణముల నిర్మించినవారెట్లు ఆత్మగౌరవ పరులై యుండిరో అటుల నీకాలపు కార్మికులు సగర్వులు కాగ లరు. తమకృషివలన తాము తమదేశీయులు లాభపడుట యు, తమజాతీయులు గౌరవప్రతిష్ఠలు బొందుటయు సాధ్య మగునని వారికి నమ్మకముకల్గును. సివిలుసర్వీసువారివలెనే కళాభిజ్ఞులు, డాక్టర్లు, లాయర్లు ప్రొఫెసర్లవలెనే తమకార్మిక ధర్మమును ఆదర్శప్రాయముగా నెరవేర్చు కార్మికులు పూను కొందురు. ఆదినము ఎప్పుడుకల్గునోగదా!

యజమానుల వశమందు కొన్ని వ్యాపారము లన్ని దేశములందింకను చాలకాలమువరకు నుండునుకనుక, ఆయజ మానులెల్లరు తమతమ వ్యాపారముల ననుసరించి దేశీయ సంఘముల నేర్పరచుకొని తమకు సంబంధించిన ఆర్థికవ్యవహార ముల నెట్లింకను న్యాయముగ నడపుటో విచారించుచుండుట శ్రేయము.

కార్మికులును తమతమ సంఘములను బలపరచుకొన వలసియున్నది. దేశపు ఆర్థికజీవితమునకు సంబంధించిన ప్రతివృత్తికొరకు కేంద్రసంఘమును, సభాసంఘములను స్థా పించవలెను. ఈసంఘములద్వారా కార్మికుల మంచిచెడ్డల

విచారింపుచు వివిధవ్యాపారములందలి సాధకబాధకముల గమనించుచు తమయభిప్రాయముల ప్రభుత్వమునకు ఆయా వాణిజ్యపు జాతీయసంఘమునకు తెలియపరచుచు తమతమ పత్రికలందు వానిని ప్రకటించుచుండుట మేలు. ఈసంఘములు "జాతీయ వాణిజ్యసంఘముల" చేత క్రొత్త క్రొత్త వస్తునిర్మాణపద్ధతుల గూర్చి పరిశోధనల చేయించుచుండవలయును.

కార్మికుల సంఘములకె ఏయేవృత్తులందు నిండుజీత భత్యముల బొందుట కెన్నివత్సరము లెట్టిశిక్షణను యువకులు, యువతులు బొందవలయునో నిర్ణయించు నధికారము కల్గియుండదగును. తమతమ వాణిజ్యములందలి కార్మికు లెట్టి సంఘప్రచండాలను చెల్లించి ఏయేసంఘధర్మముల నిర్వర్తించవలెనో ఈసంఘములె నిర్ణయించనగును. ఈసంఘము లెట్టిధర్మములను జాతీయాభ్యుదయకారకముగా నిర్వర్తించుటకై జాతీయప్రభుత్వము తగుచర్యల తీసుకొనుచుండవలెను.

ఈకార్మికులసంఘములే తమంతతామే వివిధవృత్తులందు తయారుకానగు వస్తువులను తమతమ కర్మాగారముల ద్వారా చేయించి అమ్ముటకు సంసిద్ధతబొందుచో అట్టిప్రయత్నములకు ప్రభుత్వమెల్లప్పుడు తగినచేయూత నొసంగుటకు తయారై యుండవలెను. యజమానులు లేకున్నను ప్రభుత్వ

పురయాజమాన్యమైన లేనిచో కార్మికులు తమంతతాము వివిధవాణిజ్యముల నడుపజాలరనియే రైల్వేలు వగైరాలను ప్రభుత్వమే కార్మికులసహాయముతో నడుపవలెనని చెప్పితిమి. కాని కార్మికులే తమంతతాము "వృత్తిసంఘముల" నేర్పరచుకొని వాణిజ్యములనడుపయత్నించుట మరింతశుభప్రదము. ఇట్టిప్రయత్నములు జయప్రదములుకావలెనన్న ప్రభుత్వము పెట్టుబడిపెట్టి ఇంజనీయరులు అదిగాగలవారి సలహాలనుచితముగా నిప్పించి "వస్తువిక్రియ సహకారసంఘముల" ద్వారా ఈ"వృత్తిసంఘముల" వస్తువులనమ్మించి కార్మికులక్రయశక్తివృద్ధిని కల్గించనగును. ఇటలీయందు శ్రీ ముస్సోలీనిగారి నిరంకుశప్రభుత్వము రాకముందు "వృత్తిసంఘముల"కే మునిసిపాలిటీలు ధర్మాదాయపుసంఘములు తమకంట్రాక్టుల నివ్వవలెనని ప్రభుత్వము పట్టుపట్టుచుండెను. అటులనే మనదేశమందును "నేతపనివారివృత్తిసంఘము" నుండియే "కంచరపనివారిసంఘము"నుండియే జైళ్ళు ప్రభుత్వపుతదితరసంస్థలు తమకువలయువస్తువులకొనవలెనని తీర్మానించవచ్చును. అటులనే"వడ్డె, ఉప్పర, కమ్మర, కుమ్మర''సంఘములద్వారా పి. డబ్లుడీ. డిపార్టుమెంటువారు లోకలుబోర్డులు తమకార్యముల (బ్రిడ్జీలు, కాల్వలు, రోడ్లు భవనములుకట్టుట) నెరవేర్చుకొనవలెనని ప్రకటించవచ్చును.

ఇట్టి "వృత్తిసంఘములు" ఈనాటియజమానులవలెనే ప్రజలయవసరముల బట్టి అన్యాయముగా హెచ్చుధరలు వేసి హెచ్చులాభముల సంపాదించుకొనవలెనని ప్రయత్నించుట యసాధ్యము కాదు. పదునాఱు పదునేడవ శతాబ్దములందు ఇంగ్లాండునందలి "వృత్తి సంఘములు" జాతీయుల మోసము చేయుటకును వృత్తియందు జేరదలచినవారికి యిబ్బంది యెక్కువగా కల్గించుటకును స్వార్థపరతతో తమవృత్తి యభివృద్ధికై జాతీయాభ్యుదయమును లెక్కగొనకుండుటకును వెనుకాడలేదు. కనుక అట్టి జాతీయానర్థకములగు నధికారమిా "వృత్తిసంఘము"లకు కలుగకుండుటకై ప్రభుత్వమెల్లప్పుడు తగుజాగరూకతబూని ప్రతివృత్తిసంఘపువృత్తమును పరీక్షించుట కధికారముకల్గియుండి వృత్తిసంఘమునకు సలహాల నిచ్చుచు ఆసంఘమువారు తమప్రతినిధులతో సంప్రదించిన పిమ్మటనే వివిధవస్తువుల ధరల నిర్ణయించునట్లు చేయవలసి యున్నది. ప్రభుత్వపు యాజమాన్యముక్రిందనే యుండదగు వాణిజ్యములు "వస్తువిక్రయసంఘములు" వ్యాపారములు, యజమానులక్రిందనుండదగు సంఘములుకూడ మొదటనే వృత్తి సంఘములక్రిందకు వచ్చుట యసాధ్యము. వృత్తిసంఘములకు శక్తియుక్తులప్రకటించుకొనులది ప్రీతి, కీర్తి, వాణిజ్యములు వానివశమొనర్చుటకు వీలగును.

వివిధవృత్తులందు జేరుచున్న కార్మికులెల్లరకు తమ తమశక్తియుక్తుల ననుసరించి, అధికముగుచుండు వర్తక, వాణిజ్యబోధనను బొందుటకు తగునవకాశముల కల్గించుట ప్రభుత్వపు ధర్మము. మనదేశమందు ఇండస్ట్రీసుడిపార్టు మెంటువారు నడపుచున్న "నేతపరిశ్రమ బోధనాలయము" లాదిగాగలవి ఆయావృత్తులందున్న ప్రజలకె సాయముగున్నట్లు ఆయావృత్తియందలి "కార్మికసంఘముల" సహాకారముతో నడుపవలసియున్నది. వృత్తివిద్యకుతోడు సాధారణవిద్యా బుద్ధులను ప్రతికార్మికునకు కల్గునటుల ప్రయత్నించవలసి యున్నది.

వివిధ వాణిజ్యవ్యాపారములందు ప్రభుత్వపు "వస్తు విక్రయసంఘముల" యొక్క "వృత్తిసంఘముల" యొక్క యాజమాన్యత హెచ్చుచేసి, మిగతవ్యాపారములందున యజమానుల స్వాతంత్ర్యము నెంతగానో అరికట్టి కార్మికుల పెత్తనమును వృద్ధిచేయుటవలన యజమానులుగానుండదలచు వారికి నిరుత్సాహత కలుగవాయును సందియము కొందరికి కలుగవచ్చును. కాని వర్తకముజేయుచుండు గొప్పవారెల్లరు (కార్నిజీ రాక్ఫెల్లరు, ఫోర్డు, మోర్గను, టాటా, అన్నామలై చెట్టి) తమలాంటివారు ధనకాంక్షచే కాక తమతరగతిలోని వివిధవ్యాపారములకంటె మించిన పెత్తనముచేసి హెచ్చినప్రతిష్ఠ బొందవలెననియే యాతురతజెందుచుండె

దరని చెప్పుచున్నారు. స్థానికసంస్థలందు తమధనమునే పోగొట్టుకొని ప్రజాసేవ చేయుకోరువారి సంఖ్య హెచ్చుచుండుట జూచుచున్న మనకు స్వప్రతిభ, స్వశక్తి ప్రకటనజేయదలంచు వ్యాపారులకు కరవుకల్గునను సందియముకలుగునా?

కాని మనదేశపు వ్యాపారస్థులును తదితరదేశస్థుల వలెనే దూరదృష్టిలేక విద్యావంతులైనవారిని తమబృందమందు జేర్చుకొనుట కంతగా యాతురత జూపకుండుట విచారకరము. ఆర్థికశాస్త్రము, ఇంజనీయరింగు, రసాయనశాస్త్రము ఆదిగాగల ఉన్నతవిద్యాబుద్ధుల బొందినవారిని వ్యాపారస్థులు తమవృత్తులలోనికి ఆహ్వానించుట శ్రేయోదాయకము.

---

# పదునేడవ ప్రకరణము.

## నానాజాతి సమస్యలు.

### సమితి, కార్మిక సంఘము, వ్యవసాయ సంఘము; న్యాయస్థానములు.

"ఆధునిక రాజ్యాంగోదయము" అను గ్రంథమందు, దేశీయ రాష్ట్ర రాజ్యాంగములయొక్క స్వయంనిర్ణయాధికార మెట్టుల, ప్రపంచ శాంతికి భంగకరమైనదో, నానాజాతీయ సామరస్యము స్థాపించుకొనుట యెంతయవసరమో, మానవలోకమునంతను ఆవరించి, ప్రపంచమంతను సంబంధించిన నానాజాతిరాజ్యాంగస్థాపన మెంతయగత్యమో విచారించితిమి. ఏ దేశమునకా దేశము, స్వయంనిర్ణయాధికారముగల్గి తదితర దేశములన్నియు తనకు శత్రులైయుండునను భీతిగొని తన ప్రజలయందు శాంతి నెలకొల్పుటకే గాక, ఇతర దేశములనుండి దండయాత్ర రాకుండుటకై రక్షణాదళముల నేర్పరచుకొనుచుండ ఆత్మహత్యకు కారణమగును. మరియు ఏ దేశమైనను తనంతతాను తన రక్షణాదళములతోడనే తన స్వాతంత్ర్యము నిల్పుకొనగలనను ధైర్యము బొందజాలక, తదితర దేశములలో కొన్నిటితోనైన స్నేహమొనర్చుకొన బ్రయత్నించి రక్షణయొడంబడికల జేసుకొనుచుండును. ఇటుల నేప్రతిదేశము ప్రయత్నించుటచేతనే, యుద్ధమునకు పూర్వము ప్రపంచమందలి వివిధ దేశము

లనేక బృందములుగా నేర్పడి ఒకటి మరొకదానిగూర్చి భయ
మందుచు ఎల్లప్పుడు భయసంభ్రమములకులోనై తుదకు
ప్రపంచయుద్ధము తమతలపైకి తెచ్చుకొనెను. ఇట్టి అరాజక
ప్రదౌర్భాగ్యత బోగొట్టుటకై 'నానాజాతిసమితిని' అమెరి
కాప్రెసిడెంటుగారగు శ్రీ వుడ్రోవిల్సనుగారి ప్రోత్సాహమువ
లన యుద్ధానంతరము, సంధిపత్రము తయారుచేయుసమయ
మున స్థాపించబడెను. ఈసమితిద్వారా భావికాలమున
ప్రపంచమునకంతకొక రాజ్యాంగము నేర్పరచవలెనని ఆయన
యాశించెను. భావికాలపు మానవలోకపు రాజ్యాంగమున
కు ఈసమితిని పునాదిగాపరిగణింపనగును.

నానాజాతిసమితిరాజ్యాంగవిధానపుచట్టము ప్రకార
ము "అస్సెంబ్లీ' యను ప్రతినిధిసభకలదు. ఇందలిసభ్యులెల్ల
రు, ఇప్పటికి, సభ్యదేశములయొక్క ప్రభుత్వ
ములచే నియమింపబడుచున్నారు. ఒక్కొక్క

అస్సెంబ్లీ.

రాజ్యాంగమున కొక్కొక్క సభ్యత్వముకలదు. కాని వివిధ
ప్రభుత్వములు, తమతరఫున కొంతమంది పెద్దలనొకప్రతినిధి
సంఘము గావింపవచ్చును. వోటులుతీసుకొనునప్పుడు మాత్రి
మీాసంఘాధ్యక్షునకొక్కనికే, వోటునిచ్చుటకు హక్కుకల
దు. చిన్నరాజ్యములనియు, పెద్దరాజ్యములనియు భేదముల
గమనించక అన్నిరాజ్యములకు, సమానముగు ప్రాతినిధ్యత
మీాసభయందివ్వబడినది. వివిధ రాజ్యములింకను తమపంపా

ర్ణస్వాతంత్ర్యాధికారమును వదలకుండుటచేతను, తమ స్వయం నిర్ణయాధికారమును వీడఁటకిష్టపడకుండుటచేతను, పెద్దరాజ్యములు తమ్మెప్పుడు దిగ్రమింగునోయను భయముచే చిన్న రాజ్యములు సమితియందు చేరుటకు సందేహించుటచేతను ఈ విధముగ పెద్దచిన్నరాజ్యములను విభేదముల లెక్కగొనక, సర్వరాజ్యములకును సమానముగు ప్రాతినిధ్యము అస్సెంబ్లీయం దివ్వబడినది. 1924 సం॥ వరకు ఏబదియైదు రాజ్యములు ఈసమితియందు సభ్యత్వము పొందినవి. కొలదికాలములోనే ఈరాను, టర్కీ, ఈజిప్టు దేశములును సభ్యులుగా జేరవచ్చును. ఈను ధ్య తమకోర్కెలను సమితివారు సమకూర్చలేదనికోపమొంది తమ సభ్యత్వముల మానుకొనిన జపాను, జర్మనీ దేశములు తిరిగి సభ్యత్వముబొందవచ్చును.

ఇన్ని దేశములు సమితియందు చేరినను రషియా, అమెరికా రాజ్యములు సమితియందు చేరకున్నంతవరకు నానాజాతిసమితి ప్రపంచమునంతటికిని సర్వవిధముల నుపయోగపడ జాలదు.

ఈ అస్సెంబ్లీసభకు గల యధికారములు క్రమక్రమముగా వేరగుచున్నవి. ఇప్పటికివీరికి సమితియొక్క రాజ్యాంగవిధానపుచట్టమును మార్చుటకుతగు హక్కుకల్గుచున్నది. కౌన్సిలునందలిసభ్యులును మిగిలినసభ్యులలో నధికసంఖ్యాకులును అంగీకరించినచో, అట్టిచట్టపుసవరణలు నిర్మింపవచ్చు

ను. క్రొత్త రాజ్యములను సభ్యులుగా జేర్చుకొనుటకు ఈసభా సభ్యులలో మూడింట రెండువంతులు అంగీకరించవలయును. కౌన్సిలునకు తాత్కాలికముగా నెన్నుకొనబడు సభ్యులను, అస్సెంబ్లీవారు మూడింట రెండువంతులుగా ఎన్నుకొనవలయును. తనయొక్క కార్యక్రమపద్ధతిని మార్చుటకు తనసభ్యులలో నధికసంఖ్యాకులొప్పుకొనినచాలును. "నానాజాతిన్యాయస్థానపు" న్యాయమూర్తులను ఎన్నుకొనుటలో ఈసభవారును, కౌన్సిలుతో సహకార మొనర్చవలసియున్నది. కౌన్సిలువారివలన సూచింపబడినట్టియు, వివాదమునందు జేరినపక్షములు తమసమక్షమునకుఁ దెచ్చినట్టియు, వివాదములను పరిష్కార మొనర్చుటకు అస్సెంబ్లీకి అధికారముకలదు. నానాజాతిసమితియొక్క బడ్జెట్టునుచర్చించి అంగీకరించి ఖర్చులభారమును సభ్యరాజ్యములమధ్య వానివానిశక్తులననుసరించి, భాగించుటకు అస్సెంబ్లీవారికి హక్కుగలదు. సమితిపేరున జరుపబడుచుండు కార్యకలాపమును గురించిన నివేదికను అస్సెంబ్లీవారు విచారించవలసియున్నది. సమితివారియాజమాన్యమున వివిధ సభ్యరాజ్యములచే పాలింపబడుచుండు (మాండేట్లు) దేశములపాలనముగూర్చిన నివేదికలు ఈసభవారు చర్చించవలయును.

ఈ 'అస్సెంబ్లీ' యొక్క కార్యములను అనుదినము విచారించుచు, సమితియొక్కధర్మముల అస్సెంబ్లి యనుమతి

ప్రకారము నడుపుటకై 'కౌన్సిలు' యేర్పరచబడినది. ఇందు శాశ్వతముగానుండు సభ్యులు పదుగురును, తాత్కాలికము గానుండువారు పద్గురునుకలరు ప్రప్రథమమున నల్గురే శాశ్వత సభ్యులుండిరను జర్మను రాజ్యాంగమునకొక సభ్యత్వమివ్వ బడినపిమ్మట పదుగురు శాశ్వత సభ్యులైరి. ఇంగ్లాండు, ఫ్రాన్సు, ఇటలీ, జపాను, జర్మనీలకు శాశ్వతసభ్యత్వములివ్వ బడెను. మిగతా పదుతాత్కాలిక సభ్యత్వములు మిగతా రాజ్యాంగములలో ఎన్నికద్వారా, పంచిపెట్టబడుచున్నవి. ఈతాత్కాలిక సభ్యులను అస్సెంబ్లీవారు మూడింట రెండు వంతులయొక్క అంగీకారముతో నెన్నుకొనుచుందురు. రష్యా, అమెరికా దేశములుకూడను సమితియందు చేరుచో వాని కికూడ కౌన్సిలునందు శాశ్వతముగు సభ్యత్వములివ్వబడును. శాశ్వతసభ్యత్వస్థానములకంటె తాత్కాలికసభ్యత్వస్థానము లు రెండు హెచ్చుగానుండుట యాచారమైయున్నది, కనుక, ఈ రెండు ప్రధానరాజ్యములు శాశ్వతసభ్యత్వములబొందుట తోడనే తాత్కాలికసభ్యత్వములును రెండునూతనముగ యేర్పరచబడును.

ఈకౌన్సిలువారు తమకార్యక్రమమును మెజారిటీ వోటు ద్వారాగాక సర్వసభ్యులఏకగ్రీవాభిప్రాయముద్వారా నే నెరవేర్చవలసియున్నది. ఇట్టియవసరమే అస్సెంబ్లీవారికి కూడ దాదాకు అన్నిముఖ్యవ్యవహారముల నిర్ణయించుటయం

దును కల్గుచున్నను, కౌన్సిలు వారు తమ కార్యములను హెచ్చు సుగమముగా, త్వరితముగా నెరవేర్చ కల్గుటకవకాశము కలదు. ఈ కౌన్సిలునందు ఇప్పటికి పన్నెండుగురు సభ్యులే కలరు గనుకను, వీరు మాసమునకొకమారు కలుసుకొనుచు ఒకరినొకరు బాగుగా నెరింగియుండుటచే పరస్పర స్నేహము బొంది ఒకరి తత్వమును అవసరమును మరొకరు గ్రహించుటవలనను ప్రతి విషయమును త్వరితముగను, సంతృప్తికరముగాను పరిష్కరింపకల్గుచున్నారు.

ఒక్క జపానురాజ్యపు ప్రతినిధితప్ప మిగతా శాశ్వతపు సభ్యులును యూరపు ఖండపుదేశముల సభ్యులును ఆ యా రాజ్యముల విదేశాంగ మంత్రులై కాని, ప్రధాన మంత్రులై కాని యుండెదరు గనుక, వీరు తమతమ రాజ్యముల తరఫున బాధ్యతవహించి ధైర్యముతో వ్యవహారముల తేల్చుటను పూనుకొనగలరు. అసెంబ్లీవారు సంవత్సరమున కొకమారు మాసముపర్యంతమె సమావేశమైయుందురు. కౌన్సిలువారు దాదాపు ప్రతిమాసమును అవసరము కల్గినప్పుడెల్ల కొలదిదినముల వ్యవధిలోడనె సమావేశము కాగల్గుచుండుటచే కౌన్సిలువారికి అత్యధిక ప్రాముఖ్యము ఆపాదింపబడుచున్నది. సమితివారి సమక్షమునకు తేల్చవలసిన వివాదములు, సమస్యలు, ప్రప్రథమమున ఈ "కౌన్సిలు" వారికి నివేదించబడును. వీరా కార్యముల కెల్లను రూపురేఖలు కల్గించి

వీలున్న వానిని తామే నిర్వహించి తమకు సాధ్యము కాకుండుచో అస్సెంబ్లీకి వానిని నివేదించుటకు అవకాశము కలదు.

సమితియందలి సభ్యరాజ్యములు తమకు సంబంధించిన వివాదములను "నానాజాతిరాజీవంషమును" యందుగాని "నానాజాతి న్యాయస్థానము" నందుగాని విచారణకు తెచ్చుటకంగీకరింపనిచో తప్పక "కౌన్సిలు" వారి సమక్షమందిట్టి వివాదముల నివేదించవలసియున్నది. కౌన్సిలువారికట్టి వివాదమును పరిష్కరించుటకు సావకాశము కలుగనిచో ఏకగ్రీవాభిప్రాయముతోగాని లేక మెజారిటీవారి అంగీకారముతోగాని కౌన్సిలు వారు ఆవివాదముపై తమయభిప్రాయములను ప్రకటించవచ్చును. కౌన్సిలువారి సూచనలు సర్వసభ్యుల యామోదముచే చేయబడుచో వానిని వివాదమందలి యిరుపక్షములలో నొకపక్షము వారు అంగీకరించి అమలుపరచినచో రెండవపక్షము వారు ప్రథమపక్షపు దేశములపై యుద్ధమునకు 'డీ' కొనరాదు. మెజారిటీవారె అట్టిసూచనల జేయకల్గుచో ఆసూచనల నంగీకరింపని పక్షము తదితరపక్షముపై మూడు నెలల పిమ్మటగాని యుద్ధము చేయుటకు పూను కొనరాదు. వివాదమునందలి రెండుపక్షములలో నొక్కటి ఆవివాదసంబంధమైన విషయము తనదేశాంతర్గతమగు వ్యవహారమని ప్రకటించుచో కౌన్సిలువారు ఆయభిప్రాయము నంగీకరించుచో ఆవివాదమును విచారించుటకు కౌన్సిలు

వారికి హక్కు ఉండదు. వివాదమునందలి పక్షములలోనే యొక్కరి కోరికపైగాని, కౌన్సిలువారు తమయిష్టముపైగాని తమసమక్షమందు పెట్టబడిన వివాదగ్రస్థమగు వ్యవహారమును అసెంబ్లీవారికి నివేదించవచ్చును. అంత అసెంబ్లీవారికి కౌన్సిలువారి హక్కుబాధ్యతలు ఈవిషయమందు సంక్రమించును.

కౌన్సిలువారుగాని అసెంబ్లీవారుగాని తమకునివేదించబడిన వివాదములకు సంబంధించిన ఇరుపక్షములవారికిని తమతమవాదముల నివేదించుటకును, వివాదమువలన కష్టనష్టముల బొందుచుండు ప్రజల ప్రతినిధుల మొరలనాలకించుటకును హక్కు ఉండును. మరియు ఆహక్కును ఈసంస్థ ఉపయోగించుట వారిధర్మము. కౌన్సిలువారిచేత పరిష్కారముకాబడిన వివాదములు అసెంబ్లీవారిచేత పునర్విమర్శ చేయబడరాదు. పరిష్కారమైన వ్యవహారములను తిరిగి అసెంబ్లీవారు విచారించుచో వివాదము లెప్పటికిని తేల్చబడవు.

సమితియందుజేరు సభ్యరాజ్యములన్నియు ప్రమాణపూర్తిగా తాము వివిధదేశములతో ఏర్పరచుకొనుచుండు రాజీలు ఒడంబడికలను సమితివారికి నివేదించుచుందుమని వాగ్దానము చేయుచున్నారు. ఈధర్మమును సభ్యరాజ్యములన్నియు సంపూర్తిగా నెరవేర్చుచో ప్రపంచశాంతికిని

వివిధరాజ్యముల శ్రేయమునకును భంగకరమగు రాజీలు కాని, ఒడంబడికలుకాని సమ్మతింపబడవు. యుద్ధమునకు పూర్వము ఇట్టియొడంబడికలు రహస్యముగా జరుపబడుచుం డుటచేతనే ఒకరాజ్యమునకు మరొకరాజ్యమునకును మధ్య యనుమానములుకల్గి ప్రపంచమంతట రెండుమూడు పెద్ద ముఠాలుగా రాజ్యములు ఏర్పరుపబడుట తటస్థించెను. ఇట్టి దౌర్భాగ్యపుస్థితి ఈప్రమాణమును సకలసభ్యరాజ్యములును పాలించుచో కలుగదు. కాని ఇప్పటికిని కొన్నిరాజ్యములు అధర్మవర్తనమందె యుత్సాహముజూపుచు రహస్యపుటొడం బడికల నేర్పరచుచుండుట దురదృష్టము.

సమితియందలి సభ్యరాజ్యముల సరిహద్దుల మార్చుటకు సమితివారి యామోదము అగత్యము. సరిహద్దుల మార్పులకు సంబంధించిన రాజ్యములు ఆమార్పుల కంగీకరించుచో సమితివారు తమసాధారణ సమ్మతి వెలిపుచ్చవచ్చును. కాని వివాదము కల్గుచో ప్రపంచశాంతి స్థాపనకై ఇరుపక్షములయొక్క భూమిని కొంతను "మధ్యరాజ్యభాగము"గా నేర్పరచి దానిపై సమితియే పెత్తనము జేయుటకు అంగీకరించవచ్చును,

రక్షణదళముల పరిమాణమును నిర్ణయించుటకు సమితివారు తమకు సాధ్యమగు శక్తియుక్తుల నుపయోగించవలసియున్నది. ఈయుగమందు "సమిష్టిభాగ్యవిభజన"సూత్రా

నుసారము వివిధప్రభుత్వములు తమయాజమాన్యమున అనుదినము అధికమగుచుండు సాంఘిక ఆర్థికోపయోగ కార్యముల జేయుచుండుట కుత్సాహపడుచున్నవి. కాని యీకార్యముల నిర్వహించుట కగత్యముగు ధనము చాలినంతగా దొరుకకుండుట విచారకరము. ఇందులకు ముఖ్యకారణము, ప్రతిదేశమును తన ప్రభుత్వాదాయమందు నాల్గవభాగమునుండి సగభాగమువరకును రక్షణదళములపై ఖర్చిడవలసివచ్చుటయే ! ఈరక్షణదళములవలన ప్రపంచమున కంతకుకల్గు లాభము చాలతక్కువ. ఒకదేశము మరొకదేశమును భయపెట్టుటకే యీవ్యయోపయోగమేమోకాని ఏదేశపుదళములును తదితరదేశముల దళముల నరికట్టుటకు చాలియుండవు కాన యుద్ధమునకు పూర్వమువలెనే ప్రతిదేశము మరికొన్ని దేశములతో ప్రత్యేక "స్వరక్షణ" స్నేహమునొనర్చుకొనవలసివచ్చుచున్నది. ఇటుల తిరిగి ప్రపంచమునందు రెండుమూడు పెద్దకక్షముల నేర్పరచుటకుమారు ప్రతిదేశము తదితరదేశములతోను, అన్ని దేశములు పరస్పరముగాను సమితిద్వారా స్నేహపరంపరల కల్గించుకొనుట యుక్తముగదా!

ఈ రహస్యమును వుడ్రోవిల్సనుగారు గ్రహించుటవలననే 'రక్షణదళముల' తగ్గించుటకు సమితివారు తమశక్తుల ధారపోయవలెనని ఆజ్ఞాపించిరి. క్రిందటి పదివత్సరములందును అనేక ప్రపంచసభలద్వారా వివిధ రాచకీయవేత్తలు

రక్షణదళముల తగ్గింప బ్రయత్నించియుండిరి. వాషింగ్టను నగరమున 1922 లో కూడిన "నావికాదళసభ" వారు కొంత కాలమువరకు ప్రధానరాజ్యములగు బ్రిటను, అమెరికా, ఫ్రాన్సు, జపాను, ఇటలీవారు నిరూపింపబడిన నావికాదళముల నిర్మింపరాదని సూచింప ఆయా రాజ్యములు ఆసూచనల నంగీకరించి ఇప్పటివరకు వానిని గౌరవించుచున్నవి. తిరిగి 1929 సంవత్సరమందు శ్రీరామ్సేమాక్డునాల్డుగారి నాయకత్వముక్రింద సమావేశమైన సభవారు ఈవిషయముల చర్చించిరి. కాని ఏయొడంబడికల నేర్పరచ లేరైరి. ఈసభలు సమితివారికి సంబంధము లేకనె సమావేశమైనవని చెప్ప వచ్చును.

సమితివారి నాయకత్వముక్రింద, "రక్షణదళము"ల తగ్గించుటకు అనేకమారులు ప్రయత్నము లొనర్పబడెను కాని, జయముకలుగ బాలెను. తుదకిప్పుడు, శ్రీ ఆర్థరు హెన్‌డర్సనుగారి అధ్యక్షతక్రింద సమావేశమగుచున్న "రక్షణదళములవిచ్ఛేదనపు సభ" వారు, చల్లచల్లగా, చిన్నిచిన్ని తీర్మానములను, ఒడంబడికలను అంగీకరింప జేయుచున్నారు. ఈసభలన్నిటియందును, సమితియందు సభ్యులైన రాజ్యములేకాక, అమెరికా, రషియా, టర్కీ దేశములు కూడ పాల్గొనుచున్నవి. ఫ్రాన్సుదేశము యూరపుఖండమందు తన యాధిక్యత నిల్పుకొనుటకై, సైనికదళముల తగ్గిం

చుటకు సమ్మతించుట లేదు. ఆ రాజ్యపు సైనికదళములు తగ్గి ననే కాని. తనకు తన పక్షపు రాజ్యములకు ఆధిక్యత కలుగ దను భయముకల్గిన, ఇటలీ సైనికదళముల తగ్గించవలెనని యే వాదించుచున్నది. ప్రపంచమందలి తనయాధిని వేశసా మంత రాజ్యముల రక్షణార్థై, నావికాదళముల తగ్గించుటకు వీలు లేదని, ఇంగ్లాండు పట్టుపట్టుచున్నది. ఇంగ్లాండుతో పో టీపడుచుండు, అమెరికా, అమెరికా ఇంగ్లాండులజూచి భయ మందు జపాను, ఫ్రాన్సుతోటి పోటీపడుచుండు ఇటలీ, తమ నావికాదళములను, సంతృప్తికరమగునట్లు తగ్గించుటకు సమ్మ తించుట లేదు. సైనికదళములతో నిమిత్తము లేని అమెరికా, ఇంగ్లాండులు తమ కష్టముల తెలుసుకొనజాలవని ఫ్రాన్సు వారు వాదింతురు. పూర్వకాలమునుండియు నావికాదళము లందు ప్రధానస్థాన మాక్రమించియుండి, తమ సామ్రాజ్య రక్షణాభారము వహించవలసిన తమ సాధక బాధకముల తదిత రులు గ్రహింపజాలరని ఇంగ్లాండు వాదించుచుండును. తమ కు మాత్రము, రక్షణదళములు లేకుండజేసి, తదితర రాజ్య ములు, అందుముఖ్యముగా, ఫ్రాన్సు, పోలాండు, చెకోస్లా వాకియా, హంగరీ రాజ్యముల రక్షణదళముల తగ్గించుటకు ప్రయత్నించకుండుట దురన్యాయమని జర్మనీవారు ఘోష పెట్టుచున్నారు. తమ ఆర్థికస్థితికి మించినట్లు, సైనికబలగము లకల్గియున్నను, అందరితోబాటు తామును, రక్షణదళముల

తగ్గించుటకు సంసిద్ధులమనియు, ప్రపంచ శాంతిరక్షణకు, వివిధరాజ్యముల పెత్తనముక్రింద నె రక్షణాదళములుంచుట తగదనియు, రషియాప్రతినిధులు ప్రచారముచేయుచు న్నారు. నావికాదళములందు కొన్నితరగతుల స్టీమరులును, సైనికదళములందు నిర్బంధముగా పౌరులెల్లరు చేరవలసిన దను నియమములలో కొన్నియు, వాయువిమానములలో కొన్నిరకములు, మందుగుండుసామానులలో కొన్నిరకములు మాత్రము, ఎవ్వరు నుపయోగించరాదను ధర్మములను కొన్నిటిని ఇప్పటికి అందరు అంగీకరించుచున్నారు విషవా యువుల ప్రచారముచేయుట, పట్టణములపై వాయువిమాన ములనుండి బాంబులు వేయుట, సముద్రగర్భమందు సంచరిం చు, 'సబ్ మెరీను' స్టీమరులతో యుద్ధమొనర్చుట ఆదిగాగల యమానుషకృత్యముల మాపుదలజేయుట కెల్లరు ఎట్టకేలకు అంగీకరించుచున్నారు. కాని, పౌరులెల్లరు రక్షణాదళములందు చేరవలెనను నిర్బంధపు ఏర్పాటులు వివిధదేశములందుండు వరకు, వివిధదేశముల ప్రభుత్వపుబొక్కసములనుండి అధిక భాగపుధనమును రక్షణాదళములపై వృథాచేయుచుండువరకు ప్రపంచశాంతి దూరమగుచుండుటయు, ప్రజలయభివృద్ధి యసాధ్యమగుటయు తథ్యము.

యుద్ధము కూడదు.

సమితియొక్క ఆదర్శము ప్రపంచమందంతట శాంతి స్థాపనమొనర్చి వివిధ దేశములమధ్య యుద్ధములు కలుగకుండ చేయుటయై యున్నది. ఒక రాజ్యమందెల్లు ప్రజలకు సంఘములకు మధ్య పోరాటములు జరుగకుండుటకై పోలీసుబలగములు స్థాపించబడుచున్నవో అటులనే ప్రపంచమందలి వివిధ రాజ్యములమధ్య పోరాటము జరుగకుండుటకై సమితివారు తగు బలగములబొందుట అగత్యము. కాని, ఇంతవరకును ఏ దేశమును సమితిహస్తములందె తన సరిహద్దుల రక్షణాభారము నిడుటకు పూనుకొనలేదు. అమెరికారాజ్యాంగపు విదేశాంగమంత్రియగు శ్రీ కెల్లాగ్ గారి ప్రబోధమువలన 'ప్రతిదేశమును యుద్ధముద్వారా, ఇతర దేశములతోగల్గు వివాదములను పరిష్కరించుకొనరాదు, అనుటతప్పను అభిప్రాయము ప్రపంచమందు ప్రచురమైనది. వివిధదేశములమధ్యగల్గు వివాదముల పరిష్కరించుటకు యుద్ధముకూడదను భావము బలముగా ప్రజలయందు ప్రచారమగుచున్నది. కనుకనే, "యుద్ధము అధర్మము" అను యొడంబడికను ప్రపంచమందలి ముఖ్యదేశములన్నియు నంగీకరించినవి. దానికి సమ్మతించినవారు నమ్మదగినవారు కారనుభయముచేతనే కొన్నిరాజ్యములవారు దానిపై సంతకమిడుట కంగీకరించరైరి. కాని, వారికిని "యుద్ధము అధర్మము" అను నమ్మికకలదు. ఈలాటి నమ్మిక ప్రపంచమందలి రాజ్యము

లన్నియు కల్గియున్నంతమాత్రమున లాభమేమియుని తలంచ రాదు. యుద్ధముచేయుట అధర్మమనియు తమ రాజ్యముకూడ యుద్ధముచేయుట యధర్మమనుసూత్రమును అంగీకరించి యున్నదనియు ప్రజలెల్లరికి తెలియుచో తమరాజ్యము యుద్ధప్రయత్నముల జేయుచు ఇతర రాజ్యములపై యుద్ధము ప్రకటించు నెడల తామందరు తమ యసువుల, ఆస్తిపాస్తుల త్యాగము చేయుట తగవు కాదని ప్రజలకు ఏదేశమందైనను తోచవచ్చును. ప్రపంచమందలి రాజకీయ నేతలెల్లరు "యుద్ధము చేయుట యధర్మము"ను సూత్రము నంగీకరించుచో ఆసూత్రము నమలులో పెట్టుటకు తగు ప్రయత్నముల జేయుటకై కొంత వరకైన శ్రద్ధజేయుట సాధ్యము. ఈయొడంబడిక సమితి వారి యామోదముపైనను ఆదరణచేతను సంపూర్తి పొందినది.

మైనారిటీల రక్షణ:—

వివిధ రాజ్యములందలి అల్పసంఖ్యాకులకు వలయు ప్రత్యేక హక్కులను రక్షించు భారము సమితిపై విడబడినది. ప్రప్రథమమున బాల్కను రాష్ట్రములందలి మైనారిటీల రక్షణయే సమితికి అవసరమగుచున్నను, క్రమముగా, అన్ని దేశములందలి మైనారిటీల హక్కుల రక్షించు ధర్మము సమితినిర్వహించ వలసియుండును. రాజ్యాంగపు భాష యొకటైయుండ, మరొక భాషనుకల్గి, మరొక సాహిత్యముకల్గిన ప్రజలకు, వారి భాషాసాంప్రదాయముల వృద్ధియాకాంక్షితము కనుక, వారి

హక్కుల రక్షించవలెను. అధికసంఖ్యాకు లగువారొక మతస్థులైయుండ, మైనారిటీవారు మరొకమతస్థు లగుచో, మైనారిటీవారి మతస్వాతంత్ర్యము రక్షింపబడవలెను. ఇటులనే, మైనారిటీయందున్న, వివిధ జాతులయొక్క ప్రత్యేక సాంఘిక, మత, రాజకీయహక్కులను, సమితివారు రక్షింపవలెను. ఇందులకుగాను, వివిధ రాజ్యాంగముల చట్టములయందు, పౌరుల ప్రాథమికహక్కుల నిర్వచనముచేయునెడ, మైనారిటీలహక్కులను పేర్కొనుట యుగత్యము కనుకనే, బాల్కను రాష్ట్రములందలి రాజ్యాంగవిధానపు చట్టములలో నీహక్కులు పేర్కొనబడునట్లు, సమితివారు శ్రద్ధచేసియుండిరి. మనదేశపు మైనారిటీల సమస్యను పరిష్కరించుటకై, సమితివారి మధ్యవర్తిత్వమును, మహాత్మగాంధి, పండిత మాలవ్యా వగైరాలు సూచించియుండిరి. క్రమముగా, సమితి బలిష్ఠత బొందుకొలది, ప్రపంచమందలి వివిధ రాజ్యములందలి మైనారిటీల రక్షించుటకు, సమితివారు తగు చర్యలతీసుకొనవలసియుండును. ప్రజాస్వామిక రాజ్యాంగముతో అన్ని దేశములందును యేర్పరచబడుచున్నను, తఱచుగా, మెజారిటీయందున్నపక్షమువారు, ఒకేజాతికి, లేక, మతస్థులకు లేక, భాషాసంప్రదాయములవారికి లొంగిపోయి, మిగిలిన వారికి తీరరాని అన్యాయముల కల్గించుచుండుట అసాధ్యము కాదు. కాన, అట్టి సమయములందు కష్టములకు లోనగు వారు సమితియొక్క రక్షణనుకోరుటకు సాధ్యము కావలెను.

యుద్ధానంతరము జర్మనువారివలన రాజ్యముల నన్నిటిని సమితివారు వశపరచుకొని వానిని వివిధసభ్య రాజ్యములమధ్య పంచియిడి, ఆరాజ్యములు తమ రక్షణక్రింద పెట్టబడిన దేశముల నెట్లు పాలించుచున్నవో తమకు తెలియపరచవలెనను నియమముల నేర్పరచెను. ఈరక్షించబడు దేశములను 'మాండేటెడ్' భూభాగములందురు. ఇవి మూడుతరగతులు. ప్రథమ తరగతికి చెందినవి త్వరలో నె స్వరాజ్యము పొందగలిగినవి. ఈరాకు ఈజిప్టు యితరతరగతికి చెందియున్నవి. రెండవతరగతి దేశములు చాలకాలమునకుగాని స్వరాజ్యమున కర్హత బొందజాలవు. మూడవతరగతికి చెందినవి స్వరాజ్యమున కర్హతబొందలేవేమోయనునట్టి దుస్థితియందున్నవి. ఈ దేశముల నన్నిటిని వానియందలి ప్రజలను ఆర్థిక రాచకీయాభివృద్ధి బొందుటకుగాను సభ్యరాజ్యములు తగు ప్రయత్నములు చేయుచు ఆప్రజలు స్వరాజ్యపు సంస్థల కలవాటుపడి తుదకు స్వరాజ్యార్హత బొందునట్లు చేయవలసియున్నది. సంవత్సరమునకొకమారు ఈసభ్యరాజ్యములు తమకు వశపరచబడిన దేశములను వానియందలి ప్రజల నెట్లు పరిపాలించుచున్నవో తెల్పుచు తమ నివేదికల సమితివారికి పంపుకొనవలెను. ఆనివేదికలను కౌన్సిలు అసెంబ్లీవారలు విమర్శించి తగు సలహాలనిచ్చుచుండవలయును.

అనాగరికపు జాతులరక్షణ

కాని దక్షిణాఫ్రికా తనకు వశపరచబడిన రాష్ట్రమందును, ఫ్రాన్సు సిరియాయందును అనేక దుర్మార్గములచేసియుండినను సమితివా రాదుర్మార్గముల నాపలేకపోగా, ఆసభ్యరాజ్యములను తీవ్రముగా విమర్శించుటకు గాని, వాని పెత్తనమును తొలగించుటకు గాని శక్తివంతులుకారైరి. ఈ పద్ధతిని మార్చవలసియున్నది. సభ్యరాజ్యముల పెత్తనమును తగురీతి, ఎప్పటికప్పుడు పరీక్షించి, మంచిచెడ్డలను సమితికి తెల్పుటకును, సమితితరఫున సభ్యరాజ్యములకు తగు సూచనల నొసంగుటకును, ప్రతి మాండేటెడ్ దేశమునందు నొకసమితి ప్రతినిధియుండవలెను. ఆతడు పెత్తనమందున్న సభ్యరాజ్యపుదేశస్థుడు కాగూడదు. అతనికి వాని యుద్యోగులకు రక్షింపవలసియున్న ప్రజలభాషలు, ఆచారములు తెలిసియుండవలెను. ఆసమితిప్రతినిధిద్వారా సమితివారు ఎప్పటికప్పుడు వ్యవహారములు మించిపోకముందె యుక్తమగు తీర్మానములకు వచ్చి వానిని సభ్యరాజ్యము లాచరించునట్లు చేయవచ్చును. ఇప్పటికిని ఇంగ్లాండు, ఫ్రాన్సు, బెల్జియము, ఇటలీ, అమెరికా, జపాను, దక్షిణాఫ్రికా దేశములక్రింద సామంత రాజ్యములుగానున్న భూభాగములుకూడ, 'మాండేటెడ్' రాజ్యములుగా మార్చబడుట, ఆరాజ్యముల ప్రజల యభ్యుదయమునకు వీలుకల్గించుటయగును. సమితి బలిష్ఠతబొందుకొలది, ఈసంస్కరణ సాధ్యముకావచ్చును.

ఈ బాధ్యతలకుతోడు, ప్రపంచమందలి కార్మికుల బాగోగుల విచారించి వారి సౌఖ్యము వృద్ధిచేయుటయు మత్తు పదార్థముల యుత్పత్తి ప్రచారము నాపుదల చేయుటయు, వ్యభిచారమునకై స్త్రీలను వివిధదేశములకు త్రిప్పు వ్యాపారమును మాపుమాపుటయు, వివిధదేశములమధ్య రాకపోకలకు సలయు సదుపాయముల హెచ్చుచేయుటయు, వివిధ రాజ్యములు పరస్పరముగా వర్తకసంబంధములు లాభకరముగా నుండునట్లేర్పరచుకొనుటకు సహాయపడుటయు, అంటు వ్యాధులు ఒకదేశమునుండి మరొకదేశమునకు ప్రాకకుండునట్లు ప్రయత్నించుటయు, వివిధవృత్తి వ్యాపారముల వృద్ధికై తగు సంస్థల నేర్పరచి పాలనచేయుటయు, అవిటివారికి, అనాథలకు రక్షణ గల్గించుటయు సమితివారి ధర్మములై యున్నవి. ఇప్పటికప్పుడే, నిషావస్తువుల యుత్పత్తి నాపుటకు కొన్ని రాజ్యములచే (ఇండియా, చైనా) నొప్పించినది. ఆనిషావస్తువుల ప్రచురము చేయకుండుట కనేకదేశముల చేత వాగ్దానము బొందినది. వ్యభిచారమునకై స్త్రీలు అమ్మబడకుండుటకు, తగువిచారణ జరిపి, వివిధ ప్రభుత్వములచే తగుకార్యకలాపముల జేయించ ప్రయత్నించుచున్నది. బానిసత్వము, ఏయేచోటుల నెట్లెట్లుకలదో విచారించుచున్నది. వివిధదేశములమధ్య జరుగదగు వర్తకమును హెచ్చించుటకే యేసంస్కరణలగత్యమో ఇప్పటికి జరిగిన రెండు అధికసభలద్వారా ప్రకటించియున్నది. ఈకా

లపు మారకపుతికమకలనెట్లు ఆపి, ఆర్థికసంక్షోభముల తగ్గించుటకు వీలగునో విచారించుటకై "బ్రస్సెల్సునందు, జినీవాయందు" ఆర్థికసభల గావించినది. సమితిపిలుపుపైననె, ప్రపంచమందలి, విజ్ఞానులు, పండితోత్తములు, "ప్రపంచపౌరసత్వపులక్షణముల నిర్వచింప బ్రయత్నించుచున్నారు. ఈకాలపు ప్రపంచముయొక్క యభివృద్ధికెట్టి రాజ్యాంగ ఆర్థికసాంఘిక మతనైతికపు ఏర్పాటులు తగునో, ఆపండితులు తమనానాజాతి సభలందు చర్చించుచున్నారు. వివిధదేశములమధ్య, రహదారుల నెట్లుచేయుట యుక్తమో విచారించుటకు సమితి త్వరలోనే పూనుకొననై యున్నది.

అన్నిటికి మించి, కార్మికుల ఆర్థికసాంఘికాభివృద్ధి నిమిత్తమై, సమితియిప్పటికి అత్యద్భుతముగా సేవచేసినదని అందరొప్పుకొనుచున్నారు. "నానాజాతి కార్మికసంఘము" నేర్పరచి, దానిద్వారా "నానాజాతికార్మికసభ"ను, ప్రతి సంవత్సరము సమావేశపరచి, ఆసభయందు ప్రతిసభ్యరాజ్యమునకును సమానముగు ప్రాతినిధ్యమిచ్చి, సమితి ప్రపంచసేవ జేయుచున్నది. ఈసభయందు, ప్రతిదేశముతరఫున పాల్గొను ప్రతినిధులలో సగముమంది ప్రభుత్వముచేతను, మిగిలినవారిలోసగముమంది యజమానులచేతను, మరిసగముమంది కార్మికులచేతను నిర్ణయింపబడుచున్నారు. ఈ "కార్మికుల సభ"వారు వివిధదేశములందలి కార్మికులెట్టి ఆరోగ్యనియ

మముల ననుసరించి, ప్రాణరక్షణార్థమై వలయు నియమముల ననుసరించి కర్మాగారములందు పనిచేయనగునో, ఎన్నిగంట లసేపు ఒక్కొక్కదినమందు కార్మికులు కృషిచేయనగునో, కార్మికులకు ఏనియమములబట్టి, స్వరక్షణార్థమై "ట్రేడు యూనియను"ల నేర్పరచుకొను హక్కు ప్రసాదించబడవ లెనో, నిరుద్యోగ నివారణార్థమై, ఆరోగ్యరక్షణార్థమై, చూలాలుల రక్షించుటకై, కర్మాగారములందు అపాటితనము బొందువారి పోషణార్థమై యెట్టిసదుపాయము లగత్యమో విచారించుట యీసభవారి ధర్మము. సభవారెల్లరు అంగీక రింపకల్గిన తీర్మానములను, బిల్లులను, సభ్యరాజ్యము లంగీక రించుచో, ఆయాదేశములందు తగినట్టి శాసనములు నిర్మిత ములగుట సులభసాధ్యమగును. పాశ్చాత్యదేశములందును, జపానునందు, భారతదేశమందు, క్రిందటి పన్నెండువత్సరము లనుండి కార్మికులు అమితమైన బలమును, సహాయమును, ఈ"కార్మికసంఘము"ద్వారా, సమితియొక్క నైతికసానుభూతిద్వారా పొందగల్గిరి.

వీటి యన్నిటికంటెను వివిధదేశములందలి కార్మికులు ఎట్టిస్థితియందున్నారో, ఆయాప్రభుత్వము లెంతెంతవరకు కార్మికులకు సహాయముచేయుచున్నవో కన్గొనుచు తగినట్టి విచారణలు చేయింపుచు దొరకినభోగట్టానంతను "కార్మిక సభ"వారికి, సమితికి, ప్రజానాయకులకు అందజేయుచు

"కార్మిక సంఘము" వారమోఘమైన సేవచేయుచున్నారు. ఇటులనె శ్రీలూజిన్‌గారిచే నిర్మింపబడిన "నానాజాతి వ్యవసాయికసంఘము" రోమునగరమునుండి, తనపరిశోధనల ఫలితములను ప్రపంచమునకు ప్రకటించుచున్నది. ఇటులనే సమితివారును నానాజాతిసహాకార సంఘోద్యమమును గూర్చియు, వర్తకవాణిజ్యముల గూర్చియు, వణిక్కుల సంఘముల చర్యలగూర్చియు తగినవిచారణల జరిపించి తత్ఫలితముల ప్రపంచమునకు ప్రకటించుటవలన చాలమేలు కల్గును. వీనికితోడు నానాజాతి "పెట్టుబడి సంఘము" నొకదాని నేర్పరచుటయు లాభకరమగును. దీనిద్వారా, సమితియొక్క కార్మికరక్షణ నియమముల నంగీకరించిన దేశములకే తగుసహాయము చేయింపవచ్చును. ఈమధ్య ఆత్మహత్య చేసుకొనిన శ్రీకూగ్రరువంటి వాణిజ్యనాయకులు, వివిధదేశములందలి ప్రజలమోసపుచ్చకుండ, వివిధదేశములందలి ప్రజలు, నానాదేశములకు సంబంధించిన వ్యాపారములకు పెట్టుబడిపెట్టుటకును, వివిధరాజ్యములు, తమంతతామె వాణిజ్యముల నడపుటకు తగు పెట్టుబడిధనమును సంపాదించుకొనుటకును, ఈసంఘము వారు సహాయపడవచ్చును. ఇప్పటికే విపరీతముగా ఆత్మహత్యాపూరితముగా పెరుగుచున్న, ఎగుమతి దిగుమతిపన్నుల తగ్గించి, వస్తువుల యెగుమతి దిగుమతులు ప్రపంచమందంతట స్వతంత్రముగా

జరుగుటకై తగు ప్రయత్నములను సమితివారు చేయుట అగత్యము. యుద్ధానంతరము సమితి ఆస్ట్రియా, హంగరీ దేశముల ఆర్థిక సౌధమును పునర్నిర్మాణ మొనర్చి, అచ్చటి వాణిజ్యములు సాగించుటకై ఆదేశస్థులకు వారి ప్రభుత్వములద్వారా కోట్లకొలది పౌనులధనమును అప్పుగా ఇతరదేశస్థులు వారి ప్రభుత్వములచేత యిప్పించెను. అటులనే ఇప్పటికి "మాండేటెడ్" దేశములు, సామంతదేశములుగా నున్నరాజ్యముల ఆర్థికాభివృద్ధికై సమితివారు సహాయముచేయవలసి యుండును.

ఒకదేశమునుండి మఱితరదేశములకు జీవనోపాధినిమిత్తమై భూమికొరకై వలసపోదలచినప్రజల నేదేశమును పూర్తిగా నిరోధించకుండుటకై తగుశ్రద్ధను సమితి జూపెట్టవలసియున్నది. యుద్ధమునకుపూర్వము జర్మనువారు తమ ప్రజలకు వలసబోవుటకు తగు సావకాశములు లేవని యలజడిజేయుచుండిరి. ఇప్పుడు ఇటలీవారిట్లే హడావిడిచేయుచున్నారు. ఆస్ట్రేలియా అమెరికాదేశములకు ఆశియాఖండవాసులు వలసకైరాగూడదని శాసనములు నిర్మింపబడుచున్నవి. ఇందువలన వివిధజాతులమధ్య అనవసరమగు కోపతాపములుకల్గుట తథ్యము. ఆస్ట్రేలియాయందు దాదాపు వదియవవంతు సారవంతమగుభూమినికూడ సాగుచేయగల్గిన ప్రజలు లేరు. కాని, కొన్నిలక్షలమంది తెల్లవారాఖండము

నాక్రమించుకొని ఆశియావాసు లందు కాలిడుటకు వీలు లేదనుచున్నారు. అటులనే ఆఫ్రికాఖండమందును కొన్నిలక్షులమంది తెల్లవారుజేరి కోట్లకొలదిగానున్న నీగ్రోల నివాస హేయులజేసి ఆశియావాసుల నాదరికిజేరనీయకుండ ప్రయత్నించుచున్నారు. ఇట్టి దుశ్చేష్టలవలన ప్రపంచశాంతికి భంగముతప్పక ఏనాడో యొకనాడు కల్గును. కాన వీనిని ఆపుదలజేయుట సమితియొక్క ధర్మము. ఈవిధముగావలసగొని వచ్చినప్రజల నాయా రాజ్యములు ధర్మబద్ధముగా రక్షించుచున్నవా లేదాయని, సమితివిచారించుచు తగుచర్యల తీసుకొనుచుండవలెను.

నానాజాతి న్యాయస్థానము

క్రీ॥ శ॥ 1907 సంవత్సరమందు హేగునగరమందు సమావేశమైన "హేగు నానాజాతిసభ"వారు "నానాజాతి న్యాయస్థానము"నేర్పరచ ప్రయత్నించిరి కాని, ఆ ప్రయత్నము సఫలము కాదయ్యెను. ఆన్యాయస్థానపు న్యాయమూర్తుల నెటులనియమించుటో తీర్మానించజాలక ఆసభవారు న్యాయస్థానము నేర్పరచజాలకుండిరి. కాని, పారిసునగరమున సంధియేర్పాటులుజరిగి నానాజాతిసమితి యేర్పడినప్పుడు ఆసమితివారికి న్యాయస్థానము నేర్పరుపవలసిన బాధ్యత యేర్పడెను. రెండవ హేగుసభవారిచేత "నానాజాతి రాజీసంఘము" ఒకటి అదివరకే యేర్పరుపబడియుండెను. "వివిధజాతులచే నిరూపింపబడిన రెండు

వందలమంది పెద్దలనుండి వివాదపడుచున్న రాజ్యములకు అంగీకారమగువారు ఆసంఘపు తాత్కాలికపు న్యాయాధిపతులుగా నిర్ణయింపబడుచుండిరి. అవసరమునుబట్టియు న్యాయాధిపతులు నియమింపబడుచుండిరి. కనుక ఈ సంఘము న్యాయాధిపతులను కొందరిని తయారు చేయలేకుండెను.

సమితివారిచే నేర్పరుపబడిన "నానాజాతి న్యాయస్థాన"మందల్లుగాక పదునొకండుమంది జడ్జీలు, నల్గురు డిప్యూటీ జడ్జీలు, తొమ్మిదివత్సరములకొకసారి సంపూర్ణోద్యోగులుగా నియమింపబడుచున్నారు. సమితియొక్క అసెంబ్లీవారును, కౌన్సిలువారును వీరి నెన్నుకొనవలెను. పెద్దరాజ్యముల పలుకుబడి హెచ్చుగానుండకుండుటకై అసెంబ్లీకి సంతృప్తికరమగువారినే నియమింపవలెననియు, చిన్నరాజ్యములకు లొంగిపోయి పెద్దరాజ్యములతో విరోధించువారే యెన్నుకొనబడకుండుటకై కౌన్సిలునకు సంతృప్తికరమగువారినే నియమింపవలెననియు ఏర్పాటు చేయబడెను.

ఈ రెండుసంస్థలును ఇప్పటికిని అమలునందున్నవి. రాజీసంఘము వివాదగ్రస్థమగు వ్యవహారమును ఇరుపక్షముల యానతిపై సర్దుటకు ప్రయత్నించుచుండును. న్యాయస్థానమల్లుకాక తమ సముక్షమునకు తేబడు వ్యవహారములపై న్యాయసూత్రములప్రకారము తీర్పు చెప్పుచుండును. ఒకటి రాచకీయపు మంచిచెడ్డలననుసరించి ఇరుపక్షములకు సమ్మ

తిగా యుండునట్లు ఒడంబడిక కలిగించును; మరొకటి రాజకీయావసరములతో నిమిత్తము లేకుండ ధర్మసిద్ధాంతముల ప్రకారము న్యాయము పాలించును.

సమితి అమలులోనికివచ్చినప్పటినుండి రాజీసంఘమునకు ప్రాముఖ్యత తగ్గిపోయినది. ఆసంఘము చేయకల్గు కార్యములను కౌన్సిలువారు, అసెంబ్లీవారే చాలవరకు నిర్వర్తించుచున్నారు. అప్పటికిని తెగనివివాదములు రాజీసంఘమునకు పంపబడుట చాలయరుదు

న్యాయస్థానమునకు వివిధరాజ్యములమధ్యకల్గు వివాదములనన్నిటి విచారించుట కధికారము లేదు. ఏయేదేశములు తమవివాదములను ఆన్యాయస్థానమునకు తెచ్చెదమని యొప్పుకొనునో, ఏయేవివాదముల తేల్చుకొనుటకు ఏయేదేశములీన్యాయస్థానమును గుర్తించియున్నవో, ఏయే యొడంబడికలందు వాని నమలుపరచుటలో కల్గు వివాదముల నీకోర్టుసముఖమునకు తేవలెనని చెప్పబడియున్నదో అట్టి కేసులే ఈకోర్టువారిచే విచారింపబడును.

అన్నిదేశములు అన్ని నానాజాతీయవివాదములందును ఈన్యాయస్థానమువారి తీర్పులనే పొందుటకు సమ్మతించవలెనని అనేకులు వాదించిరికాని, అనేకదేశములు ఈ సంస్కరణమున కొప్పుకొనవాయెను. కాని, ఏదేశము ఈకోర్టుద్వారా తన నానాజాతీయవివాదముల పరిష్కారమొనర్చు

కొనదలచునో ఆదేశమునకట్టి యేర్పాటు చేసుకొనుటకు వీలుం కలుగజేయుచు సమితియొక్క నియమమునంగీకరించెను. ఇప్ప టికిరువది చిన్న దేశములును, ఇంగ్లాండును ఈకోర్టునంగీకరించి నవి. క్రమముగా కౌన్సిలునందు సభ్యత్వముబొందినగొప్ప రా జ్యములు మరికొన్ని యీకోర్టుయొక్క పెత్తనమునొప్పుకొను చో ఇయ్యది సభ్యరాజ్యములకన్నిటిపై పెత్తనముబొందును. రానురాను "యుద్ధముచేయుట అధర్మము" అను సూత్రమును అన్నిదేశము లొప్పుకొన్నపిమ్మట రక్షణాదళముల తగ్గించిన పిమ్మట, సమితియొక్క పెత్తనము హెచ్చినపిమ్మట, నానాజాతి న్యాయస్థానమే ప్రపంచమందు వివిధజాతులమధ్య దేశీయుల మధ్య కల్గుచుండు వివాదముల పరిష్కారమొనర్చుట కధి కారము పొందగల్గును.

సామంతదేశములుకల్గియున్న రాజ్యములపాలనమును విచారించి విమర్శించుటకు సమితికి హక్కుకలుగవలెను. అ టులనే వివిధదేశములందు మెజారిటీయందున్న ప్రజలు మై నారిటీయందున్న యితరమతస్థుల జాతీయులు రంగుజాతిప్ర జల నెట్లుజూచుచున్నారో విచారించుటకధికారము అవసరము. కష్టములబారిపడిన ప్రజలయొక్క శాసనసభాసభ్యులవినతిపై సమితివారు తగు విచారణల జరిపించుటమంచిది. ఈవివాదము లను రాచకీయపుపద్ధతిపై అస్సెంబ్లీ కౌన్సిలునందు అథమము

రాజీసంఘమునందు తేల్చుటకు సమితి ప్రయత్నించవలెను. అవసరమున్న న్యాయస్థానపు సమక్షమునకు వీనిని పంపవలయును.

ప్రపంచశాంతిని సుస్థిరముగా నెలకొల్పవలెనన్న అనాథజనులను, అనాగరిక ప్రజలను రక్షించి, సామంతరాజ్యములకు స్వాతంత్ర్యముకల్గించి, మైనారిటీల ప్రాథమిక హక్కులసురక్షితపరచి ప్రపంచములో మానవకోటియొక్క యభివృద్ధిని పెంపొందింపజేయవలెనన్న తనయాజ్ఞలద్వారా సభ్యదేశములపై, సభ్యరాజ్యములపై తగినట్టిశిక్ష నేర్పరచగల్గినశక్తి సమితికగత్యము. కాని, ఈశతాబ్దమందు సభ్యరాజ్యములు తమరక్షణాదళములతీసివేసి సమితియే రక్షణాదళముల నేర్పరచుట కంగీకరించు సూచనలు కానరావు. ఇట్టి పరిస్థితులందు సమితికున్న ఆయుధమెల్లను, ఆర్థికసహాయనిరాకరణమే! ఏదేశమైతే సమితియొక్క ఆజ్ఞలనుగాని తీర్పులనుగాని అంగీకరించక యుద్ధమునకు దొరకొనునో ఆదేశముతో తదితరదేశములు ఏవిధముగానైనను సహాకారముచేయరాదని సమితి శాసించవచ్చును. అట్టి ప్రయత్నము 1810—15 సంవత్సరములందే ప్రథమనెపోలియను చక్రవర్తి పెత్తనముక్రింద యెంతో జయప్రదముకాగా, క్రిందటియుద్ధమందు ఆర్థికపుటిబ్బందులే జర్మనీని లొంగదీయగా, జపానువస్తువులను బహిష్కరణచేసిన చైనాదేశము జయముసుందగా, సమితి ఆర్థికవ్యవహారములందు తన సహాయనిరాకరణాయుధమును జయప్రదముగానుపయోగించజాలకుండునా ?

ఐతే తప్పొనర్చిన దేశమెయ్యదో నిర్ణయించు టెట్లు? ఏ రెండు లేక అధిక దేశములమధ్యకల్గు వివాదములను వివాద పడుచుండు దేశములకోరికపైగాని, తదితర సభ్యరాజ్యముల కోరికపైగాని సమితి తన సంస్థలలోనెద్దానిచేనైనను విచారింపించి న్యాయాన్యాయముల తేల్చి, తప్పొనర్చిన వారెవ్వరో నిర్ణయించి వివాదపడుచున్న పక్షము లేయేవిధముల నష్టపరిహారముల చెల్లింపనగునో తెల్పునట్లు చేయవలెను. కౌన్సిలుఅస్సెంబ్లీవారే యాతీర్పు చెప్పవలసివచ్చిన, వారుతముతీర్పు ఆచరణయోగ్యము కావలెనన్న, ఏకగ్రీవముగా నిర్ణయించవలెనని యిప్పుడు నియమమున్నను వారిలో అధికసంఖ్యాకులట్టి తీర్పునొప్పుకొనిన చాలునని సవరణచేయవలెను. అంతనట్టి తీర్పును అంగీకరించని దేశము "శిక్షాపాత్రమని" ప్రకటించి దానిపై ఆర్థికసహాయ నిరాకరణాయుధమును ప్రయోగించవలెను అటులనే నానాజాతి న్యాయస్థానపుతీర్పుల నంగీకరించని దేశము "మాండేటు"యొక్కధర్మముల నిర్వర్తించక అనాథల హింసించుదేశము, వలసపోయిన ప్రజలను అల్పసంఖ్యాకులను బాధపెట్టుదేశము సమితియొక్క తీర్పునకు వ్యతిరేకముగా ప్రవర్తించుచో "శిక్షాపాత్రమని" దానిని గణించి తగుపాటి శిక్షదానిపై విధించుటన్యాయము.

ఐతే, పైనపేర్కొనబడిన యధికారములన్నియు, నానాజాతిసమితివారికి, ఇప్పటిలో సభ్యరాజ్యము లిచ్చునాయని

కొందరు సందియపడవచ్చును. కాని, ఈ కాలపు ప్రపంచము జీవించియుండి, నాగరికతా సాంప్రదాయములు నిల్చియుండి, కళలు, విజ్ఞానము, గ్రంథాలయములు, విశ్వవిద్యాలయములు, మతసాంఘిక నైతికాచారములు వన్నెకెక్కవలెనన్న, రానున్న యేబదివర్షములందు, వివిధ రాజ్యములు, సమితికిట్టి యధికారము లివ్వకతప్పదు.

సమితికీ యధికారముల నివ్వవలసినది రానున్నయుగములవారు, ఇప్పటికే పాఠశాలలందున్నవారు, పుట్టియున్నవారు, వచ్చేయిరువది వత్సరములందు పుట్టనున్నవారు, "యుద్ధము చేయుట అధర్మము" "అహింసే పరమధర్మము" "సహాయనిరాకరణమె అధర్మమునకు మందు" అను సూత్రముల బలమును, సత్యమును, ఉపయోగతనుకన్గొని, మానవకోటియొక్క యైక్యత, ప్రపంచపునైక్యత- భగవంతుని స్వరూపమే, ప్రపంచము దేహమే అందలి మానవకోటియను నీరహస్యముల తెలుసుకొనుచో, నానాజాతి సమితి తప్పక లోకకళ్యాణ ప్రదమగును.

ఈవిషయమును కన్గొనబట్టియే, "రక్షణాదళముల తగ్గించుటకై సమావేశమైయున్న ప్రపంచసభవారు, ఏవిధముగా, నానాజాతిబుద్ధి, ప్రపంచతత్వము, మానవసంఘ సౌభ్రాతృభావము కల్గించుటకు వీలుకలదో విచారించుటకుగా నొకయుపసంఘము నేర్పరచియున్నారు. వీరు పాఠశాలలందు

విద్యార్థుల కెట్టిపాఠపుస్తకముల ద్వారా, ప్రపంచైక్యత, మానవసోదరత్వము పూజనీయముగా జేయనగునో విచారించుచున్నారు మహాత్మగాంధి, రవీంద్రనాథఠాకూరు, సి. ఏఫ్. ఆండ్రూసు, సర్ రాధాకృష్ణ, సర్ జె. సి బోసు, సర్, సి. వి. రామన్ మున్నగువారు మనదేశమందును, శ్రీగిల్బర్టు ముర్రే, వైకౌంటు సిసిలు, లార్డు పాన్సాన్బీ, రామ్సే మాక్డునాల్డు బార్నేర్డుషా, హెచ్ జి. వెల్సుగారలు ఇంగ్లాండునందును; పాల్ ఫౌరు, హెంరి రెమ్యా, రోమెయిను రోలాండుగారలు ఫ్రాన్సునందును; జనరలు స్మట్సుగారు దక్షిణాఫ్రికాయందును నానాజాతి సౌభ్రాతృత్వప్రదవరమును ప్రజలకు ప్రకటించి మానవసేవ చేయుచున్నారు ఇంగ్లాండునందు "యుద్ధముచలదు" అను సంఘము, నానాజాతిసంఘము (స్త్రీ పురుషుల) సమితిప్రచారక సంఘము, లేబరుపార్టీ, తమయుపసంఘముల ద్వారా సమితిని బలపరచుచున్నారు.

నానాజాతిసమితి శైశవావస్థయందున్నది యుద్ధమందు జయించిన దేశములకు సమితియున్న కంటగింపుగనే యున్నది. సమితివలననే క్రొత్తబాల్కనురాష్ట్రములందలి మైనారిటీలు, "మాండేటెడ్" భూభాగములందలి నీగ్రోలును, తదితరులును కొంతరక్షణబొందుచున్నారు. ఈజిప్తు ఇండియాదేశములకు, సమితిసహాయము చేయలేకపోయెనని, దాని నిరాకరించుట న్యాయముగాదు. క్రమముగా వివిధదేశము

లందలి ప్రజలను నానాజాతి సామరస్యతనే కోరునట్లును; దేశీయపు అభిమానమును తగ్గించి, మానవలోకకళ్యాణమును వాంఛించునట్లు చేయుటయే, విద్యాధికులయొక్కయు, జ్ఞానులయొక్కయు, సత్పురుషులయొక్కయు ధర్మమైయున్నది. విద్యాలయములన్నిటియందును, విద్యార్థులందరికిని, దేశాభిమానము, సంఘాభిమానము, మతాభిమానములకుండు పరిమితులజూపెట్టి, మానవలోకమును ప్రేమించుటకెట్లు పరిమితిలేదో, మానవలోకసేవద్వారా, భగవత్సేవనెట్లు చేయునగునో బోధించుట ధర్మము.

"ప్రపంచాభిప్రాయము" బలముకల్గి, పటుత్వము కలదై, పలుకుబడి సంపాదించి, వ్రాయుటకు వార్తాపత్రికలు, పాడుటకు బ్రాడ్ కాస్టింగు, పల్కుటకు గ్రంథములు కల్గియుండుచో, బ్రిటిషువారియొక్కయు ఫ్రెంచివారియొక్కయు అవజ్ఞయును నిరంకుశత, బెల్జియమువారి గుడ్డితనపు పరజాతిద్వేషము, అమెరికనువారి ఆడంబరము, జపానువారి అసూయ, ఆస్ట్రేలియావారి స్వార్థపరత, దక్షిణాఫ్రికావారి అమానుషస్వభావము ఇప్పటికెప్పుడో పటాపంచలు కాకుండెనా? "ప్రపంచమంతయు నొక్క ఆర్థికసంఘము" "మనుజులెల్లరా సంఘమునందలి సభ్యులు" అను సాధారణసూత్రములను ప్రజలు, వారి నాయకులు గ్రహించుచో, ఆత్మహత్యతో సమానమగు పోటీరక్షణ పన్నులను, వివిధ దేశములు పరస్పర

ఎగుమతి దిగుమతులపై వేయుచుందునా? "ప్రపంచమందంతట శాంతియగత్యమును" సామాన్యసత్యమును ప్రజలు గ్రహింపకపోబట్టియేకదా, రక్షణదళములపై క్రమక్రమముగా ఖర్చు లెక్కువగుచుండుట? ప్రపంచమునందలి వివిధజాతులకు, స్వాతంత్ర్యతవలయును. ఒక్కరి స్వాతంత్ర్యమును నిరోధించుటకు మరొకజాతివారు పూనుకొనుట అవినీతికరము నధర్మమును, సామాన్యనీతుల ప్రజలు గ్రహింపకుండుట చేతనే యూరపువారు రంగుజాతుల పీడించుచున్నారు. పతితులకు, అనాథలగుజాతులకు, మానవకళ్యాణము కాంక్షించు వారికి అపారమగుసముద్రమున తేలుచుండు చిన్న తెప్పవలె అల్లదుగో "సమితి" రక్షణమార్గమును సూచించుచున్నది. ఆమార్గమును వెంబడించి, దానిని బలపరచి అందరికందుబాటులో బెట్టుటయే మనయందరి ధర్మము.

సమాప్తము.

# సహాయులు.

1 శ్రీయుత మల్లిడి సత్యనారాయణ రెడ్డిగారు,
రామచంద్రపురము.

2 ,, డా॥ తోలేటి కనకరాజుగారు,
రామచంద్రపురము.

3 ,, ముక్కపిల్లి వేంకటనారాయణగారు,
రామచంద్రపురం.

4 ,, మెట్ల రామమూర్తిగారు, ధవళేశ్వరం.

5 ,, పున్నమరాజు వేంకట్రాయుడుగారు, కాకినాడ.

6 ,, పోలిశెట్టి స్వామినాయుడుగారు, గూడాల.

7 ,, పొక్కులూరి సుబ్బారావుగారు,
రామచంద్రపురం.

8 ,, బిక్కిన వీరరాఘవులుచౌదరీగారు, చోడవరం.

9 ,, నీరుకొండ వేంకటరత్నంచౌదరీగారు,
సీతానగరం.

10 ,, శ్రీపాదం వెంకన్నగారు, కాకినాడ.

11 ,, పోకల సరయ్యానాయుడుగారు, కాకినాడ.

12 ,, పైండా వేంకటరమణమూర్తిగారు, కాకినాడ.

13 ,, మర్ల ఫణిశాస్త్రిగారు, ఆర్యవటం.

14 ,, వట్టికూటి ఆదినారాయణగారు, కూర్మాపురం.

15 శ్రీయుత డా॥ వేదాంతం వేంకటకృష్ణయ్యగారు,
కాకినాడ.

16 ,, నాగదేవర సూర్యారావుగారు, సోమేశ్వరం.

17 ,, చిట్టూరి వేంకటదుర్గాప్రకాశరావుగారు,
కూళ్లమల్లవరం.

18 ,, బుద్ధవరపు మహాదేవుడుగారు,
రామచంద్రపురం.

19 ,, జోశ్యుల రామచంద్రరావుగారు,
రామచంద్రపురం.

20 ,, బాలాంత్రపు వేంకటకృష్ణారావుగారు.
రామచంద్రపురం.

21 ,, మిత్రింటి మందేశ్వరరావుగారు,
రామచంద్రపురం.

22 ,, డా॥ కె॥ యల్॥ నరసింహారావుగారు,
రాజమండ్రి.

23 ,, డా॥ శివరాజు రామారావుగారు, రాజమండ్రి.

24 ,, డా॥ పాలకోడేటి గురుమూర్తిగారు,
రాజమండ్రి.

25 ,, డా॥ ఎ॥ బి॥ నాగేశ్వరరావుగారు,
రాజమండ్రి,

26 ,, బిక్కిన వీరాస్వామిచౌదరిగారు, తాటిపాక.

27 శ్రీయుత మూరిన సుబ్బారావుగారు, దోనకాయలపల్లి.
28 ,, కాముళవరపు శేషగిరిరావుగారు, కాకినాడ.
29 ,, ములుకుట్ల వేంకటశాస్త్రిగారు, కాకినాడ.
30 ,, పెద్దాడ రామస్వామిగారు, కాకినాడ.
31 ,, గుంటి నరసింహశర్మగారు, పేరూరు.
32 ,, చాగంటి అమ్యులలింగంగారు, అమలాపురం.
33 ,, నేత్రకంటి వేంకటయోగానందరావుగారు, కాకినాడ.
34 ,, బులుసు గంగారాయుడుగారు, కొమానపల్లి.
35 ,, చాగంటి వేణుగోపాలకృష్ణారావుగారు, నల్లూరు.
36 ,, ఉప్పలూరి రామమూర్తిగారు, మూలస్థానం.
37 ,, చెలికాని సూర్యనారాయణమూర్తిగారు, ఆర్యవటం.
38 ,, వేమూరి విశ్వనాథశర్మగారు, రాజమండ్రి.
39 ,, చావలి రామసోమయాజులుగారు, కాకినాడ.
40 ,, యల్లాజోస్యుల వేంకటేశ్వర్లుగారు, కాకినాడ.
41 ,, సాగిరాజు సత్యనారాయణరాజుగారు, రాపర్తి రాయవరం.
42 ,, భావరాజు సత్యనారాయణగారు, చామర్లకోట.

43 శ్రీయుత చెలికాని బుచ్చివేంకట్రావుగారు, ఆర్యవటం.
44 ,, గొల్లపల్లి వీర్రాజుగారు, పెద్దాపురప్పాడు.
45 ,, రావిపాటి సత్యనారాయణచౌదరీగారు,
దంగేరు.
46 ,, ముప్పర్తి వేంకటరత్నంగారు, మోరి.
47 ,, బోయనపల్లి రామశర్మగారు,
రామచంద్రపురం.
48 ,, పైండా వేంకటనారాయణగారు, కాకినాడ.
49 ,, పెద్దాడ సీతాపతిరావుగారు, రాజమండ్రి.
50 శ్రీమతి బి॥ కామేశ్వరమ్మగారు, మైసూరు.
51 శ్రీయుత దంతుర్తి శాంతయ్యగారు, చామర్లకోట.
52 ,, గోదావరి సత్యనారాయణగారు, కోటిఫలి
53 ,, మారిన వరసన్నగారు, రాజమండ్రి.
54 ,, యామన చినసుబ్బారావుగారు, ఆరెంపూడి.
55 ,, కమ్మ బుచ్చయ్యచౌదరీగారు, కపిలేశ్వరపురం.
56 ,, బులుసు సర్వారాయుడుగారు, కపిలేశ్వరపురం.
57 ,, చెలికాని రామారాయణంగారు, ఆర్యవటం.
58 ,, యార్లగడ్డ లచ్చన్నచౌదరీగారు, పెదపూడి.
59 ,, పులుగుర్త వేంకటకృష్ణారావుగారు,
రామచంద్రపురం.
60 ,, జుజ్జవరపు వీరన్నగారు, వద్దిపర్రు.

61 శ్రీయుత పబ్బిసీడి విష్ణుమూర్తిగారు, గుర్రజనాపల్లి.
62 ,, డా॥ టి॥ సత్యనారాయణగారు, పిఠాపురం.
63 ,, వేపూరి గోపాలదాసుగారు, పిఠాపురం.
64 ,, కొత్త సూర్యనారాయణగారు, పిఠాపురం.
65 ,, ఆచంట సత్యనారాయణగారు, పిఠాపురం.
66 ,, బాలాంత్రపు రామచంద్రరావుగారు, గుంటూరు.
67 ,, దాట్ల సూర్యనారాయణరాజుగారు, కైకవోలు.
68 ,, నూకల సత్యనారాయణమూర్తిగారు, కందికుప్ప.
69 ,, పళ్ళ పెదమాళ్లుగారు, టానేలంక.
70 ,, ఆచంట రామకృష్ణమ్మగారు, ఉప్పాడి.
71 ,, నూకల వేంకటరత్నంగారు, అనాతరవరం.
72 ,, దేవత శ్రీరామమూర్తిగారు, రాజమండ్రి.
73 ,, క్రొత్త కామరాజుగారు, పిఠాపురం.
74 ,, కస్తూరి నరసరాజుగారు, రాజోలు.
75 ,, నిరోగి సుబ్బారావుగారు, పెద్దాపురం.
76 ,, చెలికాని పెదబుచ్చివేంకట్రావుగారు, వేళంగి.
77 ,, మెర్ల సత్యంగారు, వేళంగి.
78 ,, మెర్ల సుబ్బారావుగారు, వేళంగి.
79 ,, మెర్ల చినవీరన్నగారు, వేళంగి.

80 శ్రీయుత మెర్ల వేంకట్రావుగారు, వేళంగి.
81 ,, చుండూరు సుబ్బారావుగారు, వేళంగి.
82 ,, మెర్ల సత్తిరాజుగారు, వేళంగి.
83 ,, తణుకు రాయుడుగారు, గొల్లపాలెం.
84 ,, కోకా వీరభద్రరావుగారు, గొల్లపాలెం.
85 ,, తోటకూరి వేంకట్రాజుగారు, తాడేపల్లిగూడెం
86 ,, నిడమర్తి గౌరీశంకరదత్తుగారు, నిడమర్రు.
87 ,, డా॥ బొమ్మకంటి రామమూర్తిశాస్త్రిగారు, నిడదవోలు.
88 ,, డా॥ జీడిగుంట కామరాజుగారు, నిడదవోలు.
89 ,, డా॥ యర్రమిల్లి దీక్షితులుగారు, నిడదవోలు.
90 ,, ముళ్లపూడి తిమ్మరాజుగారు, తణుకు.
91 ,, శ్రీపాద లక్ష్మీనరసింహంగారు, నరసాపురం.
92 ,, డా॥ సత్తిరాజు వేంకట్రావుగారు, అత్తిలి.
93 ,, అంత్యం నరసింహమూర్తిగారు, పాలకొల్లు.
94 ,, ఇందుకూరి లక్ష్మీపతిరాజుగారు, దువ్వ
95 ,, డా॥ చీమకొండ సూర్యనారాయణగారు, పిప్పర.
96 ,, డా॥ ముల్పూరి రంగయ్యగారు, ఏలూరు.
97 ,, సోమవేదం సత్యనారాయణగారు, వసంతవాడ.
98 ,, కొమ్మిరెడ్డి ఆంజనేయులుగారు, పోతునూరు.

99 శ్రీయుత కొమ్మిరెడ్డి సత్యనారాయణగారు, పోతునూరు.
100 ,, మున్నే వేంకటనారాయణగారు, దేవ.
101 ,, మున్నె సత్యనారాయణగారు, కొడమంచలి.
102 ,, గొడవర్తి నాగేశ్వరరావుగారు, ఆచంట.
103 ,, ఇందుకూరి సూర్యనారాయణగారు, దువ్వ.
104 ,, ఓసూరి నారాయణస్వామిగారు, నర్సాపురం.
105 ,, తుమ్మలపల్లి వీరభద్రరావుగారు, పిప్పర.
106 ,, ఆచంట జానకిరాంగారు, బెజవాడ.
107 ,, మల్లాది సీతారామశాస్త్రిగారు, బెజవాడ.
108 ,, పర్వతనేని భూమయ్యచౌదరీగారు, నూజల్ల.
109 ,, తిక్కవరపు కామిరెడ్డిగారు, నెల్లూరు.
110 ,, బెజవాడ వేంకటకృష్ణారెడ్డిగారు, బుచ్చిరెడ్డిపాలెం.
111 ,, రేబాల పట్టాభిరామరెడ్డిగారు, నెల్లూరు.
112 ,, కొమాండూరి వేంకటాచారిగారు, హైదరాబాదు.
113 ,, గాడేపల్లి జగన్నాథంగారు, హైదరాబాదు.
114 ,, పి॥ నాగేశ్వరరావుగారు, సికిందరాబాదు.
115 ,, ఆర్॥ శివరాంగారు, ఢిల్లీ.
116 ,, అరవ ఆదినారాయణమూర్తిగారు, రాజమండ్రి.
117 ,, పద్మసోల కృష్ణమూర్తిగారు, కాకినాడ.

118 ,, బి॥ ఎన్॥ శాస్త్రిగారు, వకీలు, అమలాపురం.
119 ,, చిట్టూరి నరసింహాముగారు, కూళ్లమల్లవరము.
120 ,, మూత్తా సత్యప్రసన్నంగారు, కాకినాడ.
121 ,, బోళ్ల పద్దయ్యగారు, సామర్లకోట.
122 ,, ప్రభల సుబ్బారావుగారు, అమలాపుం.